వెయ్యేళ్ళ తెలుగు వెలుగు - యుగకవి

# శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మ

అభినందన సభలో సమర్పింపబడిన

# బిరుదు పత్రము

వెయ్యేళ్ళ తెలుగు సాహిత్య వారసత్వ మూర్తి - యుగకీర్తి

అయిన

## శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మ గారిని

కాకినాడ అభిమాన కవి పండిత లోకము

# నవ కవితా పితామహ

బిరుదముతో సత్కరిస్తున్నది

18-3-97

కాకినాడ

ఇట్లు

అభినందన సభ - ఆహ్వాన సంఘం

# చైతన్య కవిత

శేషేంద్ర సప్తతి సంచిక

సంపాదకుడు
**తంగిరాల సుబ్బారావు**

సహాయకులు
రాజేశ్వరీ దివాకర్ల
అంబికా అనంత్
వాసు

# పులకల్ పుల్కలు సంతసమ్ములు

– గింజల నరసింహా రెడ్డి

పులకల్ పుల్కలు సంతసమ్ములవి! ఏ పూర్ణేందు చాంద్రీప్రభా
కలనన్ కాదు, వసంత వాసరవనీ గంధమ్ముచేఁ గాదు, ఏ
జలదాశాపరిషేచన స్ఫురణలున్ సంధిల్లుటన్ గాదు; వి
స్తుల కమ్రోక్తి కవిత్వ లోకముల రీతుల్ తోచి శేషేంద్రుడై ! 1

విద్వదవతంస కవిలోక విధుడు, సుకృత
పథుడు శేషేంద్ర ఆంధ్రోక్తి ప్రౌఢవనికి
ఒక మహోమధు, డానంద ముకుర పదుడు,
సునవతేంద్ర ధనుస్స్ఫుర ద్వనద ఋతువు. 2

ఘనవాగీశత తన్ముఖాన, జనతాకైలాస వాసస్మిత
మ్మున సందీప్తము లౌచు తచ్ఛివత, అంభోజాద్భుతామోదముల్
వినికిందోయికి తెల్పు చిత్రత అహో! వీణాక్వణ ప్రాణ వా
జ్జినద ప్రౌఢ మహోంధ్ర ధాత్రి విభవోన్మేషంబు శేషేంద్రుడై. 3

ఒక వేయేన్గులు వేయి సింహములు ఇంకో వేయి శార్దూలముల్
సకలమ్ముల్ బహురీతులద్భుత బలస్వాదిష్ఠముల్ నావచో
నికరమ్ముల్ భవదక్షరామృతము లందింపంగ నాశీస్సులో
సుకవీశా! నతుడన్ నతుండనిదె వాక్సూనాలు నీవాల్కుచోన్. 4

నీ వాచార్యుడు నేను శిష్యుడను వాణీక్షోణి కావచ్చులే
నీవో మిత్ర మహేందు మిత్రుడుగనై నేనిట్లు కావచ్చులే

ఏ వంశీరవ దివ్యగాన కలనం బే ప్రౌఢ వీణాక్వణం
బీవాఙ్మాధురి తన్మయత్వ ఘటనా హేవాక భావాభమై. 5

సుకృత ప్రౌఢము నీ వచస్సు-ఇది వాసోదివ్య తల్‌నిల్పె నా
కొక దివ్యాకృతి నిచ్చె దివ్యతమ మోహోత్కర్షమున్ గూర్చె నే
నొక సన్మార్గుడనై చరించు నొక మంత్రోక్తిన్ ప్రసాదించె- ఓ
సుకవీశా! సకలాశలన్ సుఖ మహా స్ఫూర్తుల్ ప్రవర్తిల్లెడిన్. 6

నీ సేహార్ద్ర పరీమళ ప్రతతి సందీప్తమ్ము సంగీతమై
నీ సాహిత్య మహాబ్ధి మాధురి ద్యుతి స్నిగ్ధత్వ శ్రీఖండమై
ఈ సంతోషము ధీసుచాలనము వాగీశ ప్రబోధమ్ము ఔ
నౌ సద్యః పరనిర్వృతి ప్రసర మీహ్లాదమ్మలేఖ్యమ్మగున్. 7

శేషేంద్ర! మహాకవితా
భూషా! సాహార్ద్ర సుగతి భువన విజేతా!
భాషాంధ్ర ధరావల్లీ
పోషక జీవన వికాస ఫుల్ల సుహాసా! 8

కావలె జ్ఞానపీఠ ఘన క్రమ పురస్కృతి నీకు, అట్టులే
కావలెనంత కన్న ఘన క్రమతరమ్మగు ''నోబె'' లట్టిదో
పావన వాఙ్మహావ్రత విపశ్చిదమోఘ కవీశరాట్ప్రథా!
ఆ విలసన్మహోత్సవమె అంద పురస్కృతమౌ పురస్కృతే! 9

నీకు నమస్కృతిచ్చుటలనేకము నిల్పగ నబ్దపాళి నై
దూకెడు బిందు పాళినయి తోచెద నిట్లు మహాకవీంద్ర! వి
ద్యాకలనా వనోత్కర సమాగత మంద మరుత్ ప్రసారణా!
ఓ కవితేంద్రచాప సకలోహా! అశేష మనీష! శేషుడా! 10

**Firsrt Urdu/English translation to be printed together in Urdu Daily Siasat "Munday Suryudu" poem translated by Akhtar Hassan**

جی شیشندر شرما

انگریزی ترجمہ :- اختر حسن

# انسان — مہرِ درخشاں



By: Gunturu Seshendra Sarma

<u>Man The Burning Sun</u>

I am the drop of sweat, I am the sun
rising from the hills of human sinews
hearts are my friends
I live in the city of sufferings.
Although in my fist I hold an ocean
of history, I sculptured man silently.

Wings that carried the birds did not bring them back
I am drinking thick darkness in the haunts of those forests
which cry out in agony for the birds
that did not return.

Clutching at the garment woven of memories
I twine myself to the feet of my country,
heads that were hanging to the trees
smile as flowers today in the branches,
hearts that received the bullets
ring in the temples of our land like bells;
the blood of their nights squeezed and offered
by how many to bring forth this day!
they are hanging like icicles
on the ridges of our roofs.
Look, it is iron fist I have
I shall excavate the flame of light from rocks of time
I will set fire to the sleep of resisting centuries.

To the rivers that run in passion after the sea
I cry halt, command them
to paint the colourless arid lands in green
invite back the smile which fled away
in terror from this land,
to the butterfly longing hungrily for a flower
I shall give a garden

Come, children, eat bits of night
mixing it in the moonlight,
I shall not allow the sun to cheat this sacred day.
If he wakes not on the horizon of this land
I shall tear my burning heart and put it in his place,
With the scarlet of my living flesh illuminate this earth.

پسینے کی چمکتی بوند ہوں، مہرِ درخشاں ہوں
رگ و پے کے کہستان سے ابھرتا ہوں، سناں بن کر
دلوں سے رابطہ میرا، دلوں سے میرا یارانہ
دیارِ درد میں رہتا ہوں چشمِ خوں چکاں بن کر
مری مٹھی میں ہے تاریخ کا اک بحرِ بے پایاں
مرے قدموں کو چھوتی ہے زمیں بھی آسماں بن کر
تراشا ہے مرے دستِ ہنر نے کس تکلف سے
بتِ آدم کو صناعِ ازل کا راز داں بن کر
پر پرواز جن کو لے اڑے کنجِ نشیں سے
وہ طائر پھر نہ لوٹے نغمہ سنجِ آشیاں بن کر
اسی دشتِ بلا کے گھپ اندھیرے پیتا رہتا ہوں
جو اپنے طائروں کو ڈھونڈتے ہیں نوحہ خواں بن کر
میں اپنے دیس کے چرنوں پہ ماتھا ٹیک دیتا ہوں
ردا اوڑھے ہوئے یادوں کی خاکِ آستاں بن کر
سروں کے کاسے آویزاں تھے جو کل تک درختوں پر
کھلے ہیں اب وہی شاخوں پہ گلہائے جناں بن کر
جنھوں نے گولیاں کھائی تھیں، وہ دل آج رقصاں ہیں
مری دھرتی کے سندر مندروں میں گھنٹیاں بن کر
پیا ہے کتنی راتوں کا لہو، کتنے جیالوں نے
ملا ہے تب کہیں یہ روزِ روشن ارمغاں بن کر
مگر اب تک ہمارے بام و در کے زرد چھجوں سے
لٹکتی ہیں صلیبیں درد کی حسرت نشاں بن کر
یہ میرے آہنی بازو، یہ پنجے میرے فولادی
کہ جن کی ضرب سے اڑ جائیں کوہ و دشت دھواں بن کر
چٹانیں کاٹ کر انوار کی نہریں نکالیں گے
یہی تیشے، بہ فیضِ شوق، شعلوں کی زباں بن کر
اگر سوتی ہوئی صدیوں نے روکا راستہ میرا
جلا کر راکھ کر دوں گا انہیں، آتش فشاں بن کر
وہ دریا جو سوئے قلزم رواں ہیں جوشِ الفت میں
ٹھہر جاتے ہیں میرے حکم سے دامن کشاں بن کر
عطا کرتے ہیں پھر شادابیاں بنجر زمینوں کو
بکھر جاتے ہیں دھرتی پر بہارِ بے خزاں بن کر
خوشی سہمی ڈری سی جا چھپی تھی کنجِ عزلت میں
مری دعوت پہ لوٹ آتی ہے موجِ زرفشاں بن کر
جسے اک پھول کی خواہش ہے میں اس پیاسی تتلی کو
گلستاں کا گلستاں بخش دوں گا مہرباں بن کر
سنو بچو! ملا کر چاندنی میں رات کی بوندیں
صبوحی شوق کی پی لو، قطرہ قطرہ کہکشاں بن کر
نہ دوں سورج کو اب اسکی اجازت بھسم کر ڈالے
مرے امروز کی تقدیس کو برقِ تپاں بن کر
اگر اب بھی نہ جاگا وہ تو پھر طاقِ افق پر یہ
کلیجہ چیر کر رکھ دوں گا اپنا بے اماں بن کر
مناؤں گا میں پھر جشنِ چراغاں بزمِ گیتی میں
مرا خونِ جگر چمکے گا یاقوتِ رواں بن کر

# చైతన్య కవిత

## 26

## శేషేంద్ర సప్తతి సంచిక

ఈశ్వర నామ సంవత్సరం

శరత్తు - హేమంతం - శిశిరం

**OCTOBER 1997 - MARCH 1998**

సంపాదకుడు

**తంగిరాల సుబ్బారావు**

సహాయకులు

**రాజేశ్వరీ దివాకర్ల**

**అంబికా అనంత్**

**వాసు**


**చైతన్య కవితా వేదిక**

**40/12-7 'సౌరభ' (మేడపైన)**

**22 వ క్రాసు, గోవిందరాజ నగర్**

**విజయనగర్, బెంగుళూరు - 560 040**

CHAITANYA KAVITA, a journal devoted to Telugu Poetry and Published by Chaitanya Kavita Vedika, 40/12-7 "Saurabha" (Upstairs), 22nd Cross, Govindaraja Nagar, Vijayanagar, BANGALORE - 560 040, October 1997.
Pp. xx+212

| | | |
|---|---|---|
| ముఖచిత్రం | : | డెబ్బది శరత్తులు నిండిన 'నవకవితా పితామహ'<br>డా॥ గుంటూరు శేషేంద్ర శర్మ, జ్ఞాన్‌బాగ్ ప్యాలెస్,<br>గోషామహల్, హైదరాబాదు – 500 012 |
| అట్ట వెనుక | : | కవి దంపతులు :<br>రాజకుమారి ఇందిరాదేవి ధనరాజగిరి – శేషేంద్ర |
| అక్షరాలంకరణ | : | పి.సి. నరసింహారెడ్డి – బాపు |

| | | | |
|---|---|---|---|
| వెల | : | విడిప్రతి | · రూ. 50.00 |
| | | ప్రత్యేక సభ్యత్వం | . రూ. 200.00 |
| | | జీవిత సభ్యత్వం | : రూ. 500.00 |
| | | పోషక సభ్యత్వం | : రూ. 1000.00 |
| ప్రకటనలు | : | పూర్తిపుట | : రూ. 1000.00 |

**For Copies** : **Prof. T.V. Subba Rao** (Retd.)
No. 40/12-7,"Saurabha" (Upstairs)
22nd Cross, Govindarajanagar,
Vijayanagar, Bangalore - 560 040

**M/s. Visalaandhra Book House**
4-1-435, Bank Street, Hyderabad - 500 001
and all its Branches

**M/s. Navodaya Book House,**
Opp. Arya Samaj Mandir, Kachiguda,
Hyderabad - 520 027

**M/s. Pallavi Publications**
Eluru Road, Vijayawada - 520 002

**DTP By** : **FONTLINE GRAPHICS,** Hyderabad
: **Sree Laxmi Laser Graphics**, Bangalore

**Printed By** : **PRINTEK PRINTERS,** Bangalore

Dedicated
to
Seshendra's Wife

RAJKUMARI INDIRADEVI DHANRAJGIR

Gyanbagh Palace
Goshamahal
Hyderabad -500 012
A.P.

# రాజహంసి

- తంగిరాల

వైకుంఠంలో
శ్రీమహావిష్ణువు వక్షస్థలం మీది
శ్రీవత్సాంకాన్ని వదలి
నిస్తులకౌస్తుభరత్నాన్ని వదలి
విధిశప్తయై కదలి
భూలోకానికి విచ్చేసిన
సాక్షాత్తు లక్ష్మీదేవి!
ఆంగ్ల కవితాలోక అపర సరస్వతి!
'యుగకవి' జీవన ప్రావృట్కాలంలో
పురి విప్పిన నెమలి,
'రాష్ట్రేందు'ని కవితాకిరణాల్లో
వికసించిన తెల్ల కలువ,
మన తెనుగుకవి మానస సరోవరంలో
విహరించే రాజహంసి!

గొప్ప రాజవంశంలో పుట్టినా
ఎప్పుడూ సామాన్య గృహిణిలా ప్రవర్తించే నిగర్వి.
ప్రాణనాధుడు అగ్గిమీద గుగ్గిలమై పోతున్నా
చల్లని చిరునవ్వులు చిందించే పరమశాంతిశ్రీ
భూదేవంత ఓర్పు
మహామంత్రి తిమ్మరుసంతనేర్పు

# ROYAL SWAN

-Tangirala

*From the abode of `Vishnu' the `Vaikuntham'*
*Leaving the sacred mole of His bosom - the `Srivatsam'*
*Leaving the eternal gem - the `Kaustubham'*
*As if cursed by fate*
*Appearing in the mortal world,*
*She is Lakshmi Devi herself*
*And in the English poetic world,*
*She is Saraswati herself !*
*In the life's monsoon of `Yuga Kavi'*
*She is the peacock with Plumes fully spread !*
*Drenched in the poetic rays of `Rashtrendu'*
*She is the white water lilly blossomed !*
*In our Telugu poet's `Manasa Sarovara'*
*She is the Royal Swan regaling !*

*A Royal birth*
*Yet a simple, unassuming gentle code of life*
*Poetess herself and a poet's wife.*
*When her beloved is breathing fires*
*She cools him with her smiles.*

అత్యుత్తమ వంశ సంజాత
అధునాతన గృహలక్ష్మి!
పలుకు పలుకులో
ప్రతి కదలికలో
నిత్య ప్రవర్తనలో
మహోన్నత నాగరకతావైభవం
మూర్తీభవించిన సౌజన్యనిధి!

శ్రీనాథుడు జగన్నాథుడుగా
జగన్నాథుడు శేషేంద్రుడుగా
శాపగ్రస్త గంధర్వుడుగా
'నవకవితా పితామహుడు'గా
మన మధ్యకు వచ్చిన
మహాకవిని వరించిన
అపూర్వ అతిలోక అద్భుత అప్సరస!
జ్ఞాన్‌బాగ్ ప్యాలెస్ సరోవర సారస!!
శేషేంద్ర నిత్యనూతన కవితా రసఝురి!
రాజకుమారి ఇందిరాదేవి ధనరాజగిరి!!

*She has patience of Mother Earth*
*Prudence of Minister Timmarasu*
*She is Lady of Royal Heritage*
*A house-wife of modern age !*
*In each word*
*In every move*
*In normal course of life*
*She has highest civilized grandeur*
*Yet a personification of gentle composure !*

*`Srinatha' transformed as `Jagannatha'*
*`Jagannatha' as `Seshendra'*
*As a cursed Gandharva*
*As `Nava Kavita Pitamaha'*
*He came to us as an eninent poet*
*She, a celestial wonderful nymph*
*Chose him as her consort*
*She is Gyan Bagh Palace's pervading glow*
*Sesheandra's ever springing poetic flow.*
*She is Rajkumari*
*Indira Devi Dhanrajgiri !*

(Translated from Telugu by AMBIKA ANANTH)

# శరత్తారలు

## THUS SPAKE SCHOLARS :



## VIEWS and REVIEWS

# 'నవకవితా పితామహ' రాష్ట్రేందు శేషేంద్ర

నన్ను జీవితంలో మిక్కిలి ప్రభావితుణ్ణి చేసిన ఆధునిక మహాకవులు ముగ్గురు: శ్రీశ్రీ, తిలక్, శేషేంద్ర. వీరిని వర్తమాన శతమాన 'కవిత్రయం'గా పరిగణించే విమర్శకులు కూడా ఉన్నారు. నేను శ్రీశ్రీకి ఏకలవ్య శిష్యుణ్ణి; తిలక్‌కి ప్రత్యక్ష శిష్యుణ్ణి; శేషేంద్రకు ఆత్మీయ మిత్రుణ్ణి. (నన్ను శిష్యుడుగా స్వీకరించేందుకు శేషేంద్రగారు కాని మల్లంపల్లి శరభయ్యగారు కాని అంగీకరించలేదు. మిత్రుడుగానే ఉండి పొమ్మన్నారు).

కవిత్వంలో పేద ప్రజల వాస్తవిక దుర్భర జీవితాలను ఇతివృత్తంగా ప్రవేశపెట్టిన మొట్టమొదటి కవి శ్రీశ్రీ. దోపిడీచేయబడుతున్న కర్షకుల శ్రామికుల శ్రమైక జీవన సౌందర్యాన్ని వర్ణించిన కవి కూడా ఆయనే. దీనికి వాహికగా అక్షరగణబద్ధమైన పద్యచ్ఛందస్సును వదలి, మాత్రాగణబద్ధమైన గేయచ్ఛందస్సును స్వీకరించాడు శ్రీశ్రీ. అయితే ఆయన భాష, అభివ్యక్తి మాత్రం ప్రాచీనమైనదే కాని నూతనమైనదికాదు. (నన్నయ భాషకీ శ్రీశ్రీ భాషకీ ఏమీ తేడా లేదు). తరువాత శ్రీ శ్రీ కమ్యూనిజం ప్రభావంలో పడి, రూపాన్ని అభివ్యక్తిని తృణీకరిస్తూ, వస్తువును మాత్రమే నెత్తికెత్తుకొని, మార్క్సిజం సూత్రాలను వల్లించడమే మహాకవిత్వంగా భ్రమింపజేసే ఒక మాయావాతావరణాన్ని దేశమంతా-ముఖ్యంగా యువతలో వ్యాపింపజేశాడు. దీనితో సంప్రదాయ కవిత్వాన్ని ఉపేక్షించడం - కొండొకచో ఆక్షేపించడం, దేశభక్తిని విస్మరించడం మొదలైన దుర్గుణాలు కూడా తరుణ కవిలోకంలో ప్రవేశించాయి. కమ్యూనిస్టులు భూలోక స్వర్గంలా భావించే రష్యాను దర్శించి వచ్చిన శ్రీశ్రీ, భారతదేశాన్ని కించ పరుస్తూ ఒక ప్రకటన ఇచ్చాడు. దానిని ఖండిస్తూ పాలగుమ్మి పద్మరాజు, దేవరకొండ బాలగంగాధరతిలక్ మొదలైన కవులందరూ శ్రీశ్రీపై తిరుగుబాటు చేశారు. ఆ సమయంలోనే తిలక్ 'కవివాక్కు' అనే ఒక విశిష్ట కవితను ప్రకటించాడు.

"పులిచంపిన లేడి నెత్తురు పులుము కోలేను
ఖడ్గ మృగోదగ్ర విరావం ఆలకించలేను
జగద్ధాత్రీ! నీబిడ్డలమైన మేము
తత్త్వాల పేర ఇజాలపేర ఒకరినొకరం హతమార్చుకోలేము"

- ఇది స్పష్టంగా హింసాప్రబోధకమైన 'అభ్యుదయ కవిత్వం'పై (ఇంకా స్పష్టంగా

చెప్పాలంటే కమ్యూనిస్టు కవిత్వంపై) ధ్వజమెత్తడమే.

అభ్యుదయ కవిత్వంలోని వాస్తవిక శ్రామిక జీవన వస్తువుకు, భావకవిత్వంలోని అనుభూతి ప్రధానమైన అభివ్యక్తిని జోడించి నూతన కవిత్వాన్ని సృష్టించిన మొదటికవి దేవరకొండ బాలగంగాధరతిలక్. అందుకే ఆయన్ని 'భావాభ్యుదయ కవి' అన్నారు కొందరు. వచనకవిత్వంలో కావ్యశైలిని ప్రవేశపెట్టిన కవి కూడా తిలక్కే. అంటే అభ్యుదయ కవిత్వంలోని పేలవమైన అభివ్యక్తినీ, వచన కవిత్వ శైలినీ మార్చాలని ప్రయత్నించిన మొదటి కవి తిలక్. ఇంతలో 1965లో దిగంబర కవిత్వం పుట్టి 1969 వరకూ సాహిత్య వాతావరణాన్ని అల్లకల్లోలం చేసివేసింది. (తిలక్ స్పష్టమైన అవగాహన, సమచిత్తం కలిగిన ఉత్తమకవి. 1965లో దిగంబర కవులు తమ కవితా సంపుటిని పాండు అనే ఒక రిక్షావాలా చేత ఆవిష్కరింప జేసినప్పుడు తిలక్ ఇలా ఆక్షేపించాడు. "కవిత్వ విషయంలో మంత్రిగారు ఎంత మూర్ఖుడో రిక్షావాలా కూడా అంతే మూర్ఖుడు. ఇది కేవలం పబ్లిసిటీ స్టంటు". ఫలితంగా 1970లో విప్లవ కవిత్వం ఆవిర్భవించింది. తిలక్ 1966లోనే అకాలమరణానికి గురి అయ్యాడు.

తిలక్ స్వీకరించిన ప్రాచీన ప్రబంధ ధోరణిలోని కావ్య భాషకాని, అతి సుకుమారమైన భావకవిత్వాభివ్యక్తికాని విప్లవకవిత్వానికి సరిపోలేదు. ఆయన భావకవిత్వం + అభ్యుదయ కవిత్వం: వీటిని సమన్వయ పరచడానికి మాత్రమే ప్రయత్నించాడు. ఆయన చనిపోయే కాలానికి దిగంబర కవిత్వం పుట్టింది కాని, విప్లవ కవిత్వం పుట్టలేదు. 1970లో విజృంభించిన విప్లవ కవిత్వానికి ఒక నూతన కవిత్వాభివ్యక్తి, శక్తిమంతమైన ఒక నూతన భాష అవసరమయ్యాయి. ఈ అవసరాన్ని తీర్చడం కోసం మహాకవి శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మగారు రంగ ప్రవేశం చేశారు. 1974లో ఆయన ప్రకటించిన 'మండే సూర్యుడు' అనే కావ్యం విప్లవ కవిత్వంలో నూతన కవిత్వాభివ్యక్తికీ, నూతన భాషాశైలికీ శ్రీకారం చుట్టింది. అప్పటి నుండి ఇప్పటివరకూ - అంటే ఈ 20వ శతాబ్ది నాల్గవ పాదం అంతా, తెలుగు కవితా లోకమంతా 'శేషేంద్ర జాలం' తో నిండి పోయింది!

కవులు మనకు కొల్లలుగా ఉన్నారు. కాని డొక్కశుద్ధి కలిగిన కవులు మాత్రం వ్రేళ్ళపై లెక్కింప దగిన సంఖ్యలోనే ఉన్నారు. కవిత్వం అల్లడానికి కేవలం ప్రతిభ ఒక్కటే సరిపోదు. వ్యుత్పత్తి అభ్యాసాలు కూడా పుష్కలంగా ఉండాలి. ఈ కవిత్వ హేతువులు మూడూ ఎక్కువగా ఉన్న కవి శేషేంద్ర. శ్రీశ్రీ కన్నా, తిలక్ కన్నా శేషేంద్ర బాగా చదువుకున్నకవి. వాల్మీకి రామాయణమంతా నిత్యం ఆయన నాలుకపై

తాండవిస్తూ ఉంటుంది. ప్రాచీనాంధ్ర సాహిత్యాన్ని, సంస్కృత సాహిత్యాన్ని, ఆంగ్ల సాహిత్యాన్ని, వేదాల్ని, పురాణాల్ని, మంత్రశాస్త్రాన్ని, ఆధునిక రాజకీయాల్ని, ప్రపంచ చరిత్రని బాగా మధించిన గొప్ప పండిత కవి శేషేంద్ర. శేషేంద్ర ఎంత గొప్పకవో అంత గొప్ప పండితుడు. ఎంత గొప్ప పండితుడో అంత గొప్ప విమర్శకుడు. విశ్వనాధ+కృష్ణశాస్త్రి+శ్రీశ్రీ+తిలక్ - ఈ నలుగురూ కలిస్తే శేషేంద్ర అవుతాడు. అందువల్ల ఈ సృష్టించిన కవిత్వం భారతీయ సాంస్కృతిక నేపధ్యంతో కూడి విశిష్టమైనదిగా, గంభీరమైనదిగా రూపొందింది. శేషేంద్రవల్ల తెలుగు కవిత్వం ఆంధ్ర రాష్ట్రాన్ని, భారత దేశాన్ని దాటి సుదూర తీరాలకు పయనించి, అనేక కవి విమర్శకుల మెప్పును పొందింది. కేవలం ఒక ప్రాంతం, ఒక దేశం కాకుండా ప్రపంచ మానవుల బాధలన్నీ శేషేంద్రకు కవితా వస్తువులయ్యాయి. అందువల్ల శేషేంద్ర కేవలం ఆంధ్ర కవీంద్రుడు, భారత కవీంద్రుడు కాకుండా విశ్వకవీంద్రుడయ్యాడు. ఈయన పాఠకులు కూడా కేవలం తెలుగులోనే కాకుండా ఉర్దూ, హిందీ, బెంగాలీ, ఇంగ్లీషు, గ్రీకు మొదలైన అనేక భాషల్లో ఉన్నారు. అలనాడు ప్రబంధాన్ని సృష్టించి అల్లసానిపెద్దనగారు 'ఆంధ్ర కవితా పితామహు'డయినట్టుగానే, నవ్య కవిత్వానికి శక్తిమంతమైన ఒక నూతన శైలిని, ఒక అధునాతన అభివ్యక్తిని ప్రసాదించి శేషేంద్ర 'నవ కవితా పితామహు'డయ్యాడు. నిజానికి 'చేరా' చెప్పినట్టు శేషేంద్ర పురస్కారాల దశను దాటిపోయాడు.

డా. గుంటూరు శేషేంద్ర శర్మగారికి ఈ సంవత్సరం అక్టోబరు 20వ తేదీతో 70 శరత్తులు నిండుతున్నాయి. అంతే కాదు, ఈ సంవత్సరం శేషేంద్ర కవితా స్వర్ణోత్సవ సంవత్సరం కూడా. 1947లో శేషేంద్ర ఎ.సి.కాలేజీలో బి.ఏ. విద్యార్థిగా ఉన్నప్పుడు 'సోరబు' అనే పద్యకావ్యాన్ని రచించారు. ఇది ఆయన మొట్టమొదటి రచన. ఈ సందర్భంగా ప్రస్తుత చైతన్య కవితను ఆయన ప్రత్యేక సంచికగా వెలువరిస్తున్నాం. ఈ కవిత్వ పత్రికను 1986లో స్థాపించాం. 1987లో శేషేంద్ర షష్టిపూర్తి జరిగింది. అప్పుడు ఆయన ముఖచిత్రంతో చైతన్యకవితను ప్రకటించాం. ఇప్పుడు 1997లో శేషేంద్ర సప్తతి సంచికను ముద్రిస్తున్నాం. తెలుగు నవకవితా పితామహుని షష్టిపూర్తి సంచిక, సప్తతి సంచిక - రెండింటినీ వెలువరించే అదృష్టం మా చైతన్య కవితకు కలిగినందుకు మిక్కిలి సంతోషిస్తున్నాం.

ఈ 1997 వ సంవత్సరం ఒక విశిష్టమైన సంవత్సరం. ముఖ్యంగా ఈ సంవత్సరంలో జనవరి, జూలై, ఆగస్టు నెలలు మరీ విశిష్టమైనవి. జనవరి 23వ తేదీని

మహావీరుడు, స్వాతంత్ర్య సమరధీరుడు అయిన నేతాజీ సుభాస్ చంద్రబోసు జన్మదినం - శతజయంతి. జూలై 4వ తేదీని 'విప్లవజ్యోతి' అల్లూరి సీతారామరాజు జన్మదినం - శతజయంతి. ఆగస్టు 15వతేదీ భారతస్వాతంత్ర్య స్వర్ణోత్సవ దినం. ఈ మూడింటినీ కూడా దృష్టిలో పెట్టుకుని మరొక చైతన్యకవితను రూపొందించ బోతున్నాను.

పూల పరిమళాన్ని గాలి అందరికీ పంచినట్టుగా, శేషేంద్ర కవిత్వాన్ని అత్యంత సుందరంగా ముద్రించి లోకానికి అందించినవారు ఆయన భార్య రాజకుమారి ఇందిరాదేవి ధనరాజగిరిగారు. తన జీవిత సర్వస్వాన్నీ శేషేంద్ర సేవకు, శేషేంద్ర సాహిత్యసేవకు అంకితం చేసిన ఈ అపూర్వ వ్యక్తికి, ప్రముఖ ఆంగ్ల కవయిత్రికి శేషేంద్రసప్తతి సంచికను అంకితం చేయడం అన్ని విధాలా సమంజసంగా ఉన్నదని నేను భావిస్తున్నాను.

"సౌరభ"

బెంగుళూరు - **తంగిరాల సుబ్బారావు**

20-10-1997

## షోడశి (రామాయణ రహస్యములు)

## స్వర్ణహంస

**- శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి**

బ్రహ్మర్షి వాల్మీకి నిర్మితమగు ఆదికావ్యము రామాయణము వేదవ్యాస మహాముని రచితమైన మహాభారతము విద్వత్కవితల్లజుడైన శ్రీ హర్షభట్టుచే నిర్మింపబడిన నైషధీయ చరితము ఈ మూడు గ్రంధములును భారతీయ వాఙ్మయము నందేగాక ప్రపంచ వాఙ్మయములందు గూడ అగ్రశ్రేణికి చెందినవి.

ఏతత్ప్రబంధ రత్నాకరములో సాహిత్య నౌకలను నడుపుచు అందలి అమూల్య భావ రత్నములను వెలికితీసి తెలుగు ప్రజల కంఠహారముగా గూర్చి యిచ్చిన కర్ణధారుడు మిత్రుడు, గుంటూరు శేషేంద్రశర్మ. అంతేకాక అత్యంత కృషి సల్పి ఈ గ్రంధములందు నిక్షిప్తములై యున్న మంత్రయోగ వేదాంత శాస్త్రామృతమును వెలికితీసి బుధులకు పంచిన సాహితీ కర్మయోగీంద్రుడు శేషేంద్రుడు.

"గీర్వాణ వాణీ మకుటాగ్రరత్న త్రయం కషన్ దీప్తిమఖండ భూతలే
సంవ్యాపయత్ కోవిద ముఖ్యఏష శేషేంద్రశర్మా తమిమంస్తువేహం -"

# MEET THE AUTHOR SESHENDRA

*-Prof. Indranath Chowdhury*

**Programme held by Sahitya Akademi, NewDelhi, in "India International Centre" New Delhi, for writers, poets and journalists to meet Seshendra on 5th December 1995.**

**Introductory lecture of Prof. Indranath Chowdhury, secretary, Sahitya Akademi, New Delhi.**

It is our proud privilege to welcome Sri Seshendra Sharma to this meet the author programme jointly organised by India International and Sahitya Akademi.

When Seshendra Sharma first entered in the Telugu poetic world the situation was very grim. The old masters had practically all departed, the popularity of Dasarathi was on the decline, the naked poets were overpowered by their own borrowed ideology Contemporaneity had entered the poetic world as if poetry was a newspaper to be read and forgotten. Some poets talked about revolution and commitment as a result wrote bad poetry Because when you try to change the world, you do not change the world, you just write bad literature. However, poetry is a strange amalgum of the personal and the social. To deny one of these in order to cherish the other is to be denied by both

Seshendra was one of the foremost in Telugu to exhibit this amalgum of values both social and poetical. He kept himself away from the extreme experimentation of the west. He could do so because he always felt a partner to the western writers like Camu, Kafka, T.S Eliot, Rambo and others - not a shishya to be dictated by their western gurus and hence he could write:

"Rambo, all of a sudden, became very pensive and said, Mahakavi Baudliere was the first visionary, king of kings, the true god. Then Seshendra says, I told him, Rambo, look at that, there is the sun rising; the sun also sets there. From this end to the other end these *Trisandhya* (three mystic evenings) are infact the magic of the senses.

To save oneself from this enchantment Valmiki transforms himself into Baudliere and Baudliere into Valmiki all controlled by *Trikala,* the three cosmic time."

A little mysterious but this kind of imaginary conversation in esoteric language is to ge found in abudance in Seshendra's poetry. Seshendra's knowledge of Sanskrit literature and his deep understanding of the Sanskrit poetics have helped him to develop a poetic consciousness which is both modern and traditional, social and individualistic.

Seshendra knows how to create an image which encompasses the time present and the time past, the real and the ideal, the social and the mystical. In one of his poems he says :

*In the window*

*the evening and two birds*

*combine to make an oil painting*

*slowly the birds become two dots and finally*

*a crimson sky is left clinging alone.*

*As darkness thickens*

*a time comes in our beings*

*when all objects become one*

*and the horizontal lines in us*

*rise and stand up as vertical lines.*

*In your world another world rises*

*and in that world yet another world.*

But the thing which intrigues me is that how could such a good poet be equally a good critic. In fact he bagged the Sahitya Akademi award on a book of criticism. This is a rare combination in the field of literature. He wrote a manifesto of the modern poetry - a brilliant piece of critical understanding of literature and gave importance to metaphorical quality of poetry. One of his popular metaphors is tree. In a poem he says :

*Man is a moving tree*
*Whose roots*
*Are his feet*

*Had I remained a tree*
*Then every year*
*I would have enjoyed a Vasanta*
*But ever since I became a man*
*All springs of this earth*
*Have turned away their faces from me.*

Is it a fact? Which book of poetry is his best? Does he believe in any ideology? Is his critical mind a hinderance to his poetry? What were the various milestones in his Kaviyatra? Does he think that literature is slighted today? All these questions, I hope, will be answered by Seshendra and will also present some of his poems in original Telugu and in translation into English and Hindi.

I once again welcome you, Sir, and welcome you ladies and gentleman and thank you for joining us to listen to a great Indian poet who writes in Telugu and for whom poetry comes and does not allow him to breathe.

**Prof. Indranath Chowdhury**
secretary, Sahitya Akademi

NEW DELHI
5th December 1995

***5 December 1995***

**Sahitya Akademi India International Centre**

*invite you to*

# meet the author

Seshendra Sharma

*"Seshendra is not a mere medium of Age*
*but the architect of the spirit of the Age"*

*V. Upadhyaya*

---

Gunturu Seshendra Sharma, poet, critic and scholar was born on 20 October 1927 in Nagarajupadu in the Nellore district of Andhra Pradesh. After graduating from the Andhra University, he did law at the Madras University. He worked as Municipal Commissioner for 37 years under the Government of Andhra Pradesh.

Sri Sharma began his writing career in 1951 with a translation of Sohrab and Rustum with the help of Matthew Arnold's version of the Persian epic Shahnama From then on he concentrated on poetry, ocassionally turning to criticism to fulfil his dialectical urge. The unique credit of having invested Telugu poetry with the life breath of modernity in the late 70s and early 80s goes entirely to him. Even today in the mid-nineties, he is considered q unique poetic voice Seshendra "melted anew the materials of poetry, language, imagery, symbolism and fashioned for himself a forceful poetic instrument which bears the stamp of his personality ".

Sri Sharma's first collection of prose-poems *Seshajyotsna* written between 1968 and 1972 was published in 1972 in bilingual

editions (Telugu and English). This book was the beginning of the new trend in Telugu poetry pioneered by Seshendra It was a decisive moment in his life as all along he had stood at the crossroads unable to decide in what medium he should forge ahead. According to C. N. Sastry, " His emergence is to be hailed as a significant landmark in the history of modern Telugu poetry".

The publication of his *Munday Suryudu* (Burning Sun) and *Rakta Rekha* (Arc of Blood) in 1974 created a stir in Telugu literature constituting a turning point in poetry and criticism. *Rakta Rekha* gives a measure of the poet's intellect and erudition that is varied and profound. The poet has expressed his thoughts with such clarity that *Rakta Rekha* has now become a classic in Telugu literature. In *Munday Suryudu* his intensely felt ideas burst into poetry. The poetic language necessary to handle a revolutionary theme in a poem first found expression in Telugu in this work, an idiom that is being used by one and all today.

In 1975 his magnum opus *Naa Desham, Naa Prajalu* (My Country, My People) brought Seshendra into prominence once again as one of the outstanding poets of our country. Many important critics like Dr Vishwambaranath Upadhyaya, Virendra Kumar Jain and Ali Sardar Jafri hailed it as a landmark in the recent history of Indian literature. For writing theis epic, Seshendra simplified his diction so as to reach his people. Some of the well-known critics have compared this epic poem with T. S Eliot's *Wasteland*. Steeped in the spirit of Indianness and Indian culture which includes qualities of humaneness, patience, sacrifice and

courage, this epic moves with the grandeur of lyric beauty on the one hand and reflects the epic landscape of India on the other

A year latr came *Neerai Paari Poyindi* (Turned into water and Fled Away) in bilingual editions. The poems in this collection were quite different. Their structural skill was dazzling, and in them he propounded a new concept in Indian poetry, that of 'genetic memory'. In 1977 came out *Gorilla* which has been described by a critic as 'pure poetry'

Seshendra's critical commentaries to *Ramayana* entitled *Shodasi* and Harsha's *Naishadhiya Charita* entitled *Swarna Hamsa* are considered monumental.

Seshendra Sharma is the founder member of Kavi Sena Movement, for which he wrote a mainfesto (Adhunika Kavya Shastra). His desire was to educate the new generation of poets and also those already writing, the intricacies of modern poetics

*Kaala Rekha,* his sahitya Akademi award-winning book, is a collection of 25 papers presented in seminars on various subjects like ancient drama, comparative literature, classical poetry and modern writing. This paragon of contemporary Indian literary criticism reflects Seshendras's vast erudition, rare critical insight, fruitful application of comparative poetics and refreshing originality.

Seshendra Sharma has attended International seminars and presented papers held in Greece, Germany, Mauritius,

Madagascar, Kenya, France, Italy and England. He has also published several articles on science, philosophy and history in many important dailies and journals

The many honours and awards Seshendra has received include Subramania Bharati Ekta Award from the Hindi Academy, Calcutta in 1993, the Sahitya Akademi Award and the Rashtriya Sanskriti Ekta Puraskar in 1994. He was also honoured with D. Litt from the Telugu University in the same year.

His irresistible and vibrating style, his vision and voice rule the poetic world of Andhra Pradesh today. He has become the pioneering voice to a rapidly growing new generation of aesthetically and socially aware poets in Telugu. ■



## A Select Bibliography

### Poetry

*Ritu Ghosha* (Cry of the Seasons)

*Champoo Vinodini*

*Pakshulu*

*Seshajyotsna*

*Munday Suryudu* (Burning Sun)

*Neerai Paari Poyindi* (Turned into Water and Fled Away)

*Gorilla*

*Samudram Naa Peru*

*Premalekhalu* (Love Letters)

*Nenu Naa Nemili* (Me and My Peacock)

*Naa Raastha*

### Epic

*Naa Desham, Naa Prajalu* (My Country, My People)

### Short Story

*Vihwala*

## Play

*Mabbullo Darbaru*

## Criticism

*Shodasi* (On Valmiki Ramayana)

*Swarna Hamsa* (On Harsha's Naishadhiya Charita)

*Sahitya Kaumudi* (A re-evaluation of the Classical Poets of Telugu literature of the medieval period)

Relationship of Meghdoot with the Epic Ramayana (English)

*Sita*

*Kavi Sena Manifesto* (On modern poetics)

*Alankara Charcha* (Lectures)

*Vaartika Vimarsha* (Criticism)

On Form and Language in Poetry (Lectures in English)

## Essays

*Narudu Nakshatralu* (Essays on Man and Stars)

*Oohalo* (Collection of essays)

*Vishva Vivechana* (A science dissertation)

**Poet's Note Book**

*Rakta Rekha* (Arc of Blood)
*Kaala Rekha* (Arc of Time)
*Jeevana Rekha* (Arc of Life)

**Letters**

In Defence of People and Poetry
(English)

**Translations**

*Sohrab and Rustum* from the
Persian epic Shahnama (in English)
*Meghdoot* (in English)
*Premalekhalu* (in Hindi)
*Seshajyotsna* (English, Hindi, Urdu)
*Naa Desham, Naa Prajalu*
(English, Hindi, Kannada, Tamil, Urdu)
*Gorilla* (English, Hindi,
Kannada, Urdu)
*Vihwala* (urdu)
*Seshendra Kavya* (Kannada)
*Ritu Ghosha* (English
*Munday Suryudu* (English, Hindi)
*Neerai Paari Poyindi* (English)
*Nenu Naa Nemili* (English)

## A Chronology

| | |
|---|---|
| 1927 | Birth |
| 1949 | Graduated in Law from Madras University |
| 1963 | Published Vishwa Vivechana |
| 1968 | Visited Mauritius |
| 1969 | Visited West Germany |
| 1972 | Published his first colection of prose-poems Seshajyotsna |
| 1974 | Published Munday Suryudu and Rakta Rekha |
| 1975 | Published his epic Naa Desham, Naa Prajalu in Telugu, English, Hindi and Urdu |
| 1976 | Published Neerai Paari Poyindi |
| 1977 | Published Yuga Kavi Seshendra |
| 1979 | Appointed Visiting Professor at S. V. University, Tirupati |
| 1980 | Published Premalekhalu |
| 1987 | Participated in World Seminar on Theatre at Greece |
| 1989 | Participated in the World Conference on Greek Theatre in Greece |
| 1990 | Greek translation of My Country, My People published |
| 1991 | Member of the Jury for Kabir Samman |
| 1993 | Received Subramania Bharati Rashtriya Sahitya Puraskar |
| 1994 | Received Rashtriya Sanskritik Ekta Puraskar |
| | Conferred D. Litt. by Telugu University |
| | Sahitya Akademi Award for Kaala Rekha |
| 1996 | Received Gurazada Award |
| 1997 | Received 'Navakavita Pitamaha' title & Azad Award |

(**Courtesy :** Sahitya Akademi, & India International Centre, Meet the Author, 5 December 1995)

# ఆధునిక మహాభారతము

## ప్రజాపర్వము

- శేషేంద్ర

### ఒకటో సర్గ

లేస్తోంది ఉషఃకాంతుల్లోనించి ఒక హస్తం! ఆ హస్తం కాలం అనే నిరంతరశ్రామికుడి సమస్తం; మనిషి పొలాల్లో ప్రవహించే చెమటలో రక్తంలో మునిగి లేస్తోంది, దూర దూరాలకు సిందూరకాంతులు చిందుతూ ఉంది -

నేను కళ్ళు తురిచి ఆవులిస్తూ లేస్తా; నా చిన్ని కిటికీలోనించే పక్షులకూ మేఘాలకూ సుప్రభాతం చెపుతా, నా కలలన్నీ మీ రెక్కలే అంటూ ఒక నిశ్వాసం విసిరేస్తా. సూర్యడిచ్చిన ప్రియమైన కానుక, నాదినం, వాటితో కలిసి పంచుకుంటా-

నేను ధాన్యంలోనించి పుట్టాను, ధాన్యం కోసమే బ్రతుకుతాను, మరణించి ధాన్యంలోకే వెళ్ళిపోతాను...

నేను శబ్దాల అణువులతో పద్యాలుచేస్తా, ఇసుక రేణువులతో చేసిన గ్లాసుల్లా మధుర ధ్వనులు పలికిస్తా

నా దేశపు స్త్రీలకు, రంగు రంగుల కలలు కనే నూలుతో కోకలల్లి, సీతాకోక చిలుకల్ని చేస్తా, జీవన వనసీమల్లో ఎగరేస్తా

రస్తాలువేస్తా కలల్లోకి, భవనాలు కడతా మబ్బుల్లోకి, ప్రాణాలతో నాదేశపు సరిహద్దుల కుడ్యాలు లేపుతా శత్రువుల గుండెల్లోకి

నావలు చేస్తా, సముద్రాల్లోకి విడుస్తా, నా దేశపు జెండాలెగరేస్తూ పోండని పంపిస్తా

రూపాలిచ్చి గొంతులిచ్చి శిలల్ని నిశ్శబ్దాల్లోనించి విడుదల చేస్తా

నేను మానవజీవిత పొలాలన్నీ దున్నుతా

ఈ చేత్తో నేను ఏ అందాన్ని సృష్టించలేదు? ఏది ఈ భూమి మీద ఈ చేతికిలొంగలేదు? కానీ ఈ చెయ్యి ఖాళీగానే ఉండిపోయింది శాశ్వతంగా!

గడచిన చరిత్రలో నాకు తావులేదు, ఇప్పుడు నడిచే చరిత్రకు నీతిలేదు...

డాము లెందుకు కడుతున్నానో భూములెందుకు దున్నుతున్నానో నాకే తెలీదు.

నా బ్రతుకొక సున్న, కానీ నడుస్తున్నా -

వేళ్ళు కాళ్ళయి నడిచే చెట్టు మనిషి; చెట్టుగా ఉంటే ఏడాదికొక వసంతమన్నా దక్కేది; మనిషినై అన్నివసంతాలూ కోల్పోయాను!

నా బాల్యం నించీ చెట్లు పెరుగుతున్నాయి, రస్తాలు నడుస్తున్నాయి, పల్లెలూ, పట్నాలూ సుందరంగా బంధురంగా పరుగులిడుతున్నాయి.

నేను మాత్రం నడుస్తున్నా రిక్తహస్తాలతో, నాదేశం కాని దేశంలో, నాకేమీలేని ప్రదేశంలో, నా జ్ఞాపకాలు అనుచరులుగా, నా జ్ఞాపకాల ఊరేగింపుకు నేనే నాయకుడ్నిగా,

రగిలే నా ఎర్రకోరికే ఒక జెండాగా!

క్షణాలు కేవలం కాలాన్ని అనుసరించే పరివారం కాదు. కొన్ని క్షణాలుంటాయి యావత్తు మానవచరిత్రనూ మార్చగల మహత్తు ఉన్నవి.

నా చేతులతో నేనే నన్ను ఒక నిశ్శబ్ద సమాధిలో పాతిపెట్టలేను; ఒక పర్వతబ్రహ్మలా కూర్చో ఉండలేను; నన్ను చేయెత్తి పిలుస్తున్న క్షణాన్ని వట్టి నిట్టూర్పులకు వదిలేసుకోలేను.

కొండలతో సముద్రాలతో కలిసి బ్రతికేవాడికి తుపానులొక లెఖ్ఖా! తుఫానులు తుఫానులే ఎగిరిపోతున్నాయి, ఈగల్లా ఎగిరే ఈ క్షుద్ర బాధ లొక లెఖ్ఖా-

చూడు, స్వేదబిందువులు తాగి సూర్యుడు మరింత తేజస్వి అవుతున్నాడు: సుత్తులూ కొడవళ్ళూ లాంటి కిరణాలు మిలియన్ల

మిలియన్ల ప్రదానం చేస్తున్నాడు. గాలులు అధ్యాయాలు అధ్యాయాలుగా వేచే చరిత్రలో నేను వాటి బాహువుల్లో విలవిల కొట్టుకునే కొమ్మలా ఉండిపోలేను.

నీకెందుకింత అశాంతి, నీకెందుకింత ఆవేశం అంటే ఏం చెప్పను? సముద్రాన్ని అడుగు నీకెందుకింత అశాంతి అని, ఝంఝూ మారుతాన్ని అడుగు నీకెందుకింత ఆవేశం అని -

కాలాన్ని నా కాగితం చేసుకుంటా, దానిమీద లోకానికి ఒక స్వప్నం రాసిఇస్తా, దానికింద నా ఊపిరితో సంతకం చేస్తా!

మనిషి కండల్లోనించి ఒక భయంకర రాక్షసశక్తి సృష్టిస్తా; దాన్ని ఒక మహత్తర శిల్పంగా చెక్కి భూమిమీద నిలబెడతా -

నా కోరిక గొంతెత్తి అరుస్తుంది; కాలపు వెన్నెముకని విరగ్గొడుతుంది; దిగంత రేఖల్ని చింపివేస్తుంది; ఒక కొత్త శకాన్ని లోకం మీదికి విసిరేస్తుంది.

మనిషికి అది అశాంతిని విధిస్తుంది, నిదురించే ఊరుల దారుల్లో ఉద్రిక్త రక్తంగా ప్రాకుతుంది.

నా చతుర్భుజ పద్యాలతో ఆ స్పృహ నా దేశానికి నేను దానం చేస్తున్నాను. నేను అడవుల కడుపుల్లో నేర్చుకున్న భాషలోనే ఇక శతాబ్దాలు మాట్లాడుకుంటాయి. నా మాట భావితరాలకు వారసత్వంగా సంక్రమిస్తుంది. నా పద్యాలను పొందే అర్హత భూగోళంమీద జాతులకూ దేశాలకే ఉంటుంది.

నిరుడు వసంతం ఎక్కడికి పారిపోయిందో ఒక నదిలా; అలా అలా వెళ్ళి ఏ తోపుల్లో నిదురపోయిందో నాకు తెలీదు.

మళ్ళీ వచ్చింది... మా దొడ్లో మామిడిచెట్టు వెతుక్కుంటూ - ప్రతిదీ పోతుం దీ లోకంలో. కాని మళ్ళీ మళ్ళీ వస్తూ వుంటుంది అందాన్ని వెతుక్కుంటూ -

కొమ్మల్లో ఆకుల మాటున చూస్తే, అగుపిస్తాయ్ పక్షుల అడుగులు,

నిరుడు ఎగిరిపోయిన నిమిషాల గుర్తులు.

అలసిన నా ప్రయాణంలో ఒక చెట్టు నీడే నా కుటీరం; రాలిన ఒక పువ్వే నా అతిథి!

ఇది వసంతం, సంవత్సరంకన్న మొదటి కల. ఈ కలలో నేను నా దేశపు శరీరంమీద నడుస్తున్నా ప్రభాతపూర్వ స్వప్నంలా...

అడవుల్ని కప్పుకుని, నదుల్ని తలపాగాలుగా చుట్టుకుని, రస్తా ఉత్తరీయంగా వేసుకుని, నడుస్తున్నా -

ఏడుస్తున్న పొలాల్ని ఆడిస్తూ పోతున్నా; రాపాలకోసం నిరీక్షిస్తున్న నా దేశపు పర్వతాల్ని సింహాలుగా ఏనుగులుగా ఒంటెలుగా శ్రామికులుగా ప్రేమికులుగా వాటి మకుటాల్లాంటి ఇతిహాసాలుగా మలచదలుచుకున్నా, మాటలు ఇవ్వదలచుకున్నా.

సూర్యుడు కిరణాల బండ్లు తోలుకుని వస్తున్నాడు.

మొదట నన్ను చూచి కన్నీరు కార్చిన చెట్టు ఇప్పుడు నా కల మీద పూలవాన కురిసింది!

# VERDICT

## "Viswakaveendra Seshendra"

### Justice O. Chinnapa Reddy

*(On the Occassion of the Undela Vijnaana Kalaa Pitham, Hyderabad, honouring the poet Seshendra on 23-8-1995 in Ravindra Bharathi, Hyderabad, with their prestigious award (Rs. 50,000), Justice O. Chinnapa Reddy (Supreme Court) delivered his speech as Chief Guest in the Programme Significant excerpts from his speech are given below)*

*(ఉండేల విజ్ఞాన కళాపీఠము వారు రాష్ట్రేంద్ర శేషేంద్రకు తమ పురస్కారం (రు. 50,000) ఇచ్చి 23-8-95న హైదరాబాదు, రవీంద్ర భారతిలో సత్కరించిన కార్యక్రమంలో జస్టిస్ ఒ.చిన్నపరెడ్డి (సుప్రీంకోర్టు) గారుచేసిన ప్రధానోపన్యాసంలో నుంచి ముఖ్యాంశాలు)*

సభాధ్యక్షులు శ్రీ మల్లెమాలగారికి, పురస్కార ప్రదాత శ్రీమాలకొండారెడ్డి గారికి, సభనలంకరించిన శేషేంద్ర అభిమానులకు, పురస్కార గ్రహీత శేషేంద్ర విశ్వకవీంద్రునికి నా హృదయపూర్వక నమస్కృతులు.

నేను కవిని కాను, పండితుడ్నికాను, తత్త్వవేత్తను కాను. న్యాయశాస్త్రమనే ఎడారిలో జీవితమంతా నలిగిన వాడ్ని. సంగీత సాహిత్యాలకు చాలా దూరపు చుట్టాన్ని. సాహితీవేత్తలు, భాషా ప్రవీణులు, పండితులు ఉన్న ఈ సభలో మాట్లాడే హక్కు నాకు లేదు. అయినా శేషేంద్ర విశ్వకవీంద్రుని సన్మానించి సత్కరించే ఈ సభలో పాల్గొని, వారికి నా గౌరవపూర్వక అభినందనలు (సరియైన తెలుగుపదం దొరక లేదు, "to pay my homage to him" అని నా ఉద్దేశం) తెల్పుకోవచ్చనే కుతూహలంతో ధైర్యంగా మీ ఎదుట నిలుచున్నాను.

మొదట్లోనే అన్నాను, విశ్వకవీంద్ర శేషేంద్ర అని. శేషేంద్రుడు విశ్వకవీంద్రుఢని నా నమ్మకం. శేషేంద్రుని ప్రతికవితా రచనలోనూ నిష్కలుషిత విశ్వమా నవత గోచరిస్తుంది.

శేషేంద్రుడు జాతి మత కుల భాషా ప్రాంతీయ దురభిమానాలకు చాలా దూరంగా ఉంటాడు. శేషేంద్రునిదేశం విశ్వమానవ ప్రపంచం, శేషేంద్రుని జాతి విశ్వమానవ జాతి. శేషేంద్రుని వేదం విశ్వ మానవతావాదం.

కవినిత్యాన్వేషి. కవి అన్వేషించేది మానవుడ్నీ మానవ జీవితాన్నీ. అందుకే సాహిత్యం మానవతా అనుభూతి అంటారు. ప్రపంచ మంతటా ప్రతివ్యక్తి గుండెలోనూ, నిర్మలంగా నిరాటంకంగా స్రవించే ప్రవాహంలో ధ్వనించేక యధార్త నినాదమే మానవత. బూజుపట్టిన జాతి, మత, దేశ దురభిమానాలనుండి విముక్తి నొంది, మానవ జాతికి జీవితానికి అంకితం కావడమే మానవత. విశ్వమానవ కల్యాణాన్ని ఆశించడమే మానవత. మానవ జాతిని ప్రేమించే వారే దేశాన్ని ప్రేమించ గలరు. అందుకే నవయుగ వైతాళికుడు గురజాడ మహాకవి అన్నాడు. "దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషులోయ్." అదీ మానవత. అలాంటి మానవతను ఆశయంగా పెట్టుకొని సాహిత్య సేవ చేశాడు మన శేషేంద్ర. తన రచనల్లో ముఖ్యాంశం మానవత. కవితా వస్తువులు మానవుడూ, మానవ జీవితం, శేషేంద్ర రాసేది రామన్న రహమాన్లను గురించి కాదు; పీలుమలై వెంకన్నలను గురించికాదు; యాదగిరి, సింహాచలాన్ని గురించి కాదు. శేషేంద్రుడు ఒక్క మనిషినే గుర్తిస్తాడు –అతడే మానవుడు; ఒక్కజాతినే గుర్తిస్తాడు–ఆ జాతి మానవజాతి.

"ఆధునిక మహాభారత" మైతేనేమి, "జన వంశ"మైతేనేమి, నా"దేశం నా ప్రజ"లైతే నేమి, "నీరై పారిపోయిం"దయితేనేమి, మరింకో కావ్యమైతే నేమి శేషేంద్రుని మానవతాన్వేషణ ప్రతి వాక్యంలోనూ ప్రతి పంక్తిలోనూ ప్రతిబింబిస్తూ ఉంటుంది. ప్రతిధ్వనిస్తూ ఉంటుంది. "నా దేశం నా ప్రజలు"లో అన్నాడు, " నే నెప్పుడు గొంతెత్తినా నా కోసం కాదు, ఐదుకోట్లమంది కోసం కాదు, యాభై కోట్ల మంది కోసం గొంతెత్తాను. నేను పడుతున్న బాధలే నా దేశం పడుతోంది... కనకనే నా జ్వాలిక నా దేశపునాలిక. ఇదే నా దేశం నా ప్రజలు". ఇంకా అన్నాడు. 'నా దేశం నా ప్రజలు' యుగ యుగాలుగా అనుభవిస్తున్న బాధల గాధలు, నా కన్నుల్ని అశ్రువులతో అలకంరిస్తున్నాయి. నా శరీరాన్ని వ్యధా స్వరఝరీ వేగంతో ప్రతిధ్వనింప జేస్తున్నాయి. కానీ నా రక్తనాళాలు ఒరిసిపారే గంభీర శాంతరసమే నా క్రోధోన్మత్త ఉత్తమాశ్వాలకు కళ్ళెం వేయగలిగింది". తన ఆవేదనను చిత్ర విచిత్రంగా వ్యక్త పరిచాడు -" నీకెందు కింత అశాంతి నీకెందుకింత ఆవేశం అంటే ఏం చెప్పను? సముద్రాన్ని అడుగు నీకెందుకింత అశాంతి అని, ఝుంఝూమారుతాన్ని అడుగు నీకెందుకింత ఆవేశం అని". ఈ రెండు పంక్తులకే ఇవ్వవచ్చు సాహిత్య అకాడమీ అవార్డు. అలా చేస్తే శేషేంద్ర మిగతా రచనలకు ఏమి ఇవ్వగలము?

అవ్యక్తబాధలను కవి ఎలా వ్యక్త పరచాడో చూడండి, "లిల్లీలు పెదవులు విప్పాయి

నీ కథలు చెప్పడానికి, ఆకులుగుసగుసలాడుతున్నాయి, నా చెవుల్లో నీ గుండె వ్యధలు విప్పడానికి..." చదువరులలో ఆసక్తికలిగించి, వారిని ఆశ్చర్యపరచి, వారిలో ఆవేశమూ, ఆహ్లాదమూ కలిగించే ఇలాంటి చిత్ర విచిత్ర కవితలెన్నో ఉన్నాయి మనకవి ప్రతి రచనలోను. కవి, కవిత ఎలా ఉండాలో కవి మాటల్లో విందాము. శేషేంద్ర అన్నాడు ఆధునిక మహాభారతంలో, "నదులు కవులు భూగోళపు రక్తనాళాలు / నదులు ప్రవహిస్తాయి కవితల్లా

పక్షుల కోసం పశువులకోసం మనుష్యుల కోసం /

నదులు కంటున్న కలలు ఫలిస్తాయి పొల్లాల్లో

కవులు కంటున్న కలలు ఫలిస్తాయి మనుష్యుల్లో" –మరొకటి,

"ఒక అందమైన పొయెం అంటే/ దానికి ఒక గుండె ఉండాలి/

అది కన్నీళ్ళు కార్చాలి / క్రోధాగ్నులు పుక్కిలించాలి / పీడితులు పక్షం అవలంబించాలి / మనిషి ఋణం తీర్చుకోవాలి / కాలపు బరువుల్ని మొయ్యాలి / 'బ్రతకడానికి పద్యం ఒక / కోట బురుజు కావాలి / పద్యం మనిషి విజయానికి / ఒక జెండా అయ్ ఎగరాలి"-

మరొకటి - "మనిషి కన్నీరు తుడవడం నీవంతు / శరీరంపోయినా నిలిచేది నీ గొంతు నీ కవిత్వం గాయాలకు దవాఖానా"-

ఇంకొసారి అన్నాడు, "కవిత్వం ఒక మెస్మరిజం / కవి కన్ను ఒక ప్రిజం / నేను సృష్టించిన అలంకారం / నీ అంధకారానికి ఒక దీపం" -

చందురుని అందం నీలినింగిలో పయనించే వెండి ముద్దలోనే కాదు, ముఖ్యంగా అది ప్రసరించే వెన్నెలకాంతుల్లో ఉంది. కవితలో అందం, చమత్కారంగా అల్లిన పదముల దండలోనే కాదు, అలంకారాల గుచ్ఛంలోనే కాదు, ముఖ్యంగా విరిసే భావకాంతుల్లో ఉంటుంది. కవితలో భాష భావం సమన్వితం కావాలి. ఈ భాషా ఔచిత్యం ఈ భావ ఔన్నత్యం ఈ రెంటి సమన్వయం నుండి ఉద్భవించేదే కలకాల ముండే చక్కటి కవిత్వం. భాషపూజకు రమ్మని ఆహ్వానించే గుడి గంటల్లాగాధ్వనించాలి. గుళ్ళో భక్తులు తన్మయత్వం చెందినట్లే, భావం చదువరిలో మానసిక చైతన్యం కలిగించేదిగా ఉండాలి. రెండూ ఉంటేనే కవిత్వమవుతుంది. అంతేకాదు, భావమూ భాషా రెండూ చదువరికి అందుబాటులో ఉండాలి. భావం ఆకాశంలోనే విహరిస్తూ ఉండకూడదు. అట్లని చౌకబారు తత్త్వాలకు దిగజారకూడదు. అలాగే భాష కఠిన పదభూయిష్ఠమై ఉండకూడదు. ఈ నిజాలన్నీ చక్కగా గ్రహించాడు శేషేంద్ర.

దివి నుంచి భువికి దిగి వచ్చినట్లు రాయడు, భువినుండి దివికి ఎగురుతూ తనతో చదువరులను తీసుకుపోతాడు శేషేంద్ర. మచ్చుకు వినండి - "రైతు నాగలి మోస్తున్నాడు / క్రీస్తు శిలువ మోసినట్లు / ఈ దేశపు గర్భగుడిలో/ దేవుడు జీర్ణమై పోయాడు / ఆకలి వేస్తోంది మరో దేవుడి కోసం" - ఒక మాటు అన్నాడు, "రాత్రి నేను కనే కలలు దినాల మీద కట్టే వంతెనలు / నాభాష తన నిండా బాధలు నింపుకుంది / చీకట్ల లాస్యం ఛేదించుకుని / చుక్కలు నా వాక్యాలై సూర్యుడిలో కలిసి పోతున్న / చిట్ట చివరి రాత్రి .../ రోజూ ఉదయాద్రి శిఖరం మీద / రక్త కాంతులు చిందే గుండ్రని పాటని". ఇంకోసారి అన్నాడు, "సముద్రమైన మనిషి నుండి సత్యం ఎండిపోవడం చూస్తే / ధరిత్రిమీద సముద్రాలెండి పోతాయని భయమేస్తోంది / వృక్షాలు పుష్పవతులై నడిచే రోజు రాదని భయమేస్తోంది" - మరో చోట, "చైత్రమాసపుగాలి వీచిందో లేదో / చెట్లన్నీ పూయడానికి నిశ్చయించాయి / పూలు పెదవులు విప్పాయి / పుప్పొడి రహస్యాలు వినిపించడానికి / ఇప్పుడు ప్రతి చెట్టూ ఒక దేవాలయం / పక్షులన్నీ ఎగిరే దేవతలు /" - మరొకసారి, "పోదాంపద ఆ అడవుల్లోకి, ఎక్కడ రాలే హేమంత పత్రాల మీద / సూర్యుడు మనిషి కోసం సందేశాలు రాస్తున్నాడో / ఆ అడవుల్లోకి" - ఇలాంటి రచనలు ఇంకా ఎన్నో చేశాడు శేషేంద్ర. ఏమని చెప్పను! ఎన్నని చెప్పను!

ఒక విషయం గమనించండి. మనం రోజూ చూసే, సూర్యుడు, చుక్కలు, రాత్రి, పగలు, ఆకులు, పూలు, చెట్లు, అడవులు, గాలి, ఎండ, చీకటి, వెలుగు, వసంతము, హేమంతము, - ఇవి శేషేంద్రుని కవితా వస్తువులు; ఉపమానాలు, అలంకారాలు అన్నీ వీటితోనే సృష్టించి తను చెప్పదలచుకున్న ఆలోచనకు ప్రాణం పోస్తాడు. చుక్కలు తన వాక్యాలట, దినాల మీద వంతెనలట, మనిషి సముద్రమట, సత్యం నశిస్తే సముద్రమే ఎండిపోతుందని భయమట, వృక్షాలు పుష్పవతులుకావని భయమట. పూలు పూయబోయే చెట్టును ఎంత సున్నితంగా, కాబోయే పుష్పవతి అన్నాడో చూడండి, చెట్లే దేవాలయాలట, పక్షులు ఎగిరే దేవతలట. మానవతకు, ప్రకృతి పర్యావరణలకు గల దగ్గర బాంధవ్యాన్ని గ్రహించి, ఈ మానవతాకవి ప్రకృతి పర్యావరణలను గురించి గానంచేసి మన గుండెలను స్పృశించి స్పందింప జేస్తాడు.

ఆయన 'కాలరేఖ' ఈ సారి కేంద్రీయ సాహిత్య అకాడమీవారి అవార్డు అందుకుంది. ముప్పయి ఏళ్ళక్రింద రావలసిన అవార్డు ఈనాటి కొచ్చింది. అందువల్ల అదేమంత గొప్ప విషయంగా నేను భావించడం లేదు.

పైపై మాటలు ఏవో నాలుగు మాటలు చెప్పాను. చెప్పగల సామర్థ్యం నాకు లేదు,

చెప్పగల మహానుభావులెందరో ఉన్నారు, వారు చెప్తారు. ఉండేల విజ్ఞాన కళా పీఠాన్ని నెలకొల్పి, మొదటిసారి శేషేంద్ర విశ్వకవీంద్రుని బహూకరించినందుకు అందరితరపునా మాలకొండా రెడ్డిగారిని అభినందిస్తున్నాను. శేషేంద్ర కవి సహచారిణి రాజకుమారి ఇందిరాదేవి శేషేంద్రుని దివ్యావేశప్రేరణ. ఈ మాట చెప్పకపోతే శేషేంద్ర కధ పరిపూర్ణత నొందదు. ఆమెకు నా అభినందనలు.

శేషేంద్ర, ఇంకా ఎన్నెన్నో సార్థక రచనలు, కవితలు చేస్తారని ఆశిస్తూ ఈ ప్రసంగం విరమిస్తున్నాను -

హైదరాబాదు (చేవ్రాలు)
23-8-95 జస్టిస్ ఒ. చిన్నపరెడ్డి (సుప్రీంకోర్టు)

## AMARENDRA

**(Dr C.S. Sastry)**
Principal, J.K.C. College, Guntur

I have gone through kavisena Manifesto very carefully. From the bottom of my heart congratulate you on this rare achievement.

The book is a happy blend of erudition integrating vision, creative insight, crusading zeal and righteous indignation

I am amazed at the sweep and depth of your consummate scholarship. I earnestly hope that this book would stand as a land mark in Poetics Your synthesis of the Eastern and the Western critiques on form, content and function is really commendable. Quotations from Lenin and other Russian critics must serve as eyeopeners to our Marxist critics who extol content at the expense of form.

Reference to Irving Babbit. Johncrowe, Ransom and Allan Tate representing American literary criticism would have enriched your exquisite and exhaustive treatise on Modern Poetics

In some places the tone is too trenchant, I feel. But on the whole the work is very lively by exposing tin-gods with clay feet.

It is a monument of wit and wisdom...

# SCHOLAR AS A MODERNIST

*Seshendra Sarma will turn a septuagenarian come October. A tribute to the poet who is committed to the idea of integral India.*

**By Prema Nandakumar**

"The conception of Akademi of Letters for India was the great dream of Jawaharlal Nehru which finally came into existence as Sahitya Akademis in the states as well as the centre.Looking at the performance of these bodies today we realise that the dream jumped into the funeral pyre of Jawaharlal Nehru and became *sati.*"

When I chanced upon these lines in Seshendra Sarma's 'Rakta Rekha', I was not surprised. One had always known that he is not a poet who makes easy concessions, which is evident in the fact that he never easily consents to include his poetry in any proposed publication. A rare phenomenon in modern Telugu poetry, Seshendra's scholarship rivals the traditional poets whereas his swings of unconventionality leaves us breathless.

'Rakta Rekha' admirably reveals the poet. A bilingual publication containing "the hasty zig-zag scribblings" down the years, the Notebooks from which this volume culled were meant to imrpison a passing thought, idea or experience for future elaboration or sculpture as a poem, a story or a theory. The Notebooks acquired content even as relentless Time kept him tied down, preventing Seshendra from fulfilling the goals he had set for himself. A pity.

Seshendra has not much to say about the past for he is more concerned with the present. What he sees of the present is not, of course, a shower of rose petals. No wonder then, a twanging frustration can be discerned throughout his poetic

collection, or Kavya, 'Adhunika Mahabharathamu'. As he says in the foreword to this remarkable work:

"Vyasa's Mahabharata was born for the citizens of ancient times. This new Mahabharata was born for contemporary citizens. Vyasa's Bharatham was born in North India; the modern Bharatham in the South. The ancient Bharatham was written in the language of scholars.This is written in the idiom of the common man. In olden times Vyasa's Bharatham blossomed as history in 80,000 slokas. The modern Bharatham is born as the history of 'my country, my people' in eight *sargas* . Both battles were fought for gaining control of land. There the nobility battled to gain control; here the common man fights for the same.

Seshendra hopes that a recital of this new version would straighten us up for our knees have been bent hopelessly due to a slavish mentality. The spine that has grown crooked due to saluting in and out of season will become straight as an iron rod. The head that has become shaky as a result of nodding assenting to everything shamelessly will be now firm and fearless. Man will become man and become the axle of the world. Anger, frustration, disappointment, sorrow and an occasional gleam of hope form the moods of Seshendra's modern epic. The poems encasing a gorilla image takes us to the terrible Emergency of 1977.

*"The world is hustling in to the phase of gorilla, into the sinewy period of the mighty ancestor. Do not linger in the back pages of history."*

Born in 1927, Seshendra Sarma graduated from Andhra University and became a Municipal Commissioner. But that was for his livelihood. It was poetry that claimed his prime attention and before long, he had published a Telugu translation of Mathew Arnold's 'Sohrab and Rustum'.His first collection of original poems was 'Seshajyotsna' (1972). Sporting romantic titles ('Ritu Ghosha,' 'Nenu Naa Nemili',

'Samudram Naa Peru'), Seshendra Sarma's later volumes were yet down-to-earth in dealing out whiplashes of satire. Here is a terrifyingly accurate image from "Naa Desam, Naa Prajalu".

*"Men meditated and meditated and created a reptile. They tended and brought up the reptile, feeding it liberally on the grain of votes; and hoped they could live happily ever after in the cool shade of its hood.*

*Now, the reptile lays eggs of laws regularly; and it often eats its own eggs, it multiplies its race.*

*It enjoys and nods its hood at the art of the snake charmer and hisses and uses its fangs when he drops his charms even unwittlingly. Soon spread the tribe of snake charmers in the country with the ever-expanding scope of their profession.In the end, hardly any space is left for the common people in the country; this now is the history of my land."*

An eminent Sanskrit scholar, Seshendra Sarma has written in-depth studies of the Ramayana in 'Shodasi', 'Relationship of Meghdoot with the Epic Ramayana'. Among the many awards he has received are the Subramania Bharati Ekta Award from the Hindi Akademi, Calcutta in 1993 and the Sahitya Akademi Award in 1995.

Seshendra Sarma is an avid reader which makes his 'Rakta Rekha' a book-lover's delight. Seshendra the critic is also the visionary who stands for united India. This is a single nation and it has been so for centuries.With passionate pride he speaks of Mother India's past and her cultural treasures in literature, philosophy, art and architecture.

According to him the different languages have never stood in the way of a united India, as is evidenced by the worlds of the great Telugu poets like Srinatha and Tenali Ramakrishna. Seshendra Sarma proudly asserts, "I am a poet of Indianness". This Indianness is the oneness of man adumbrated from the Vedic Age onwards:

"The Indian Poet springs from the waters of the Vedic Spirit. He sees through the things but not at the things; he sees himself. To reach this state, the knowledge of the I, he passes through the fires of life, the 'tapas', perfects him as the instrument of vision.He is the flute of time, he is the sword of history, he is the eagle of destination. He captures the subtle nuances in the behaviour of words as signs of deeper truth. 'Naanrishihi kurute kaavyam' (one who is not a sage cannot create poetry) is the distilled essence of Indian Poetics and that is what Indianness stands for in poetry." Seshendra Sarma will be seventy come October. Poets like him must be cherished by us with regard and reverence to guard the integral unity of Mother India.

*( Andhra Pradesh Times, Hyderabad, Sunday, August 3,1997)*

---

*Prof. Prema Nandakumar is a famous writer and Professor of English in Tamilnadu. She is a vising Professor in U.S.A., and a renowned name in literature. She was the director of "**Commonwealth Literature**". Prof. Prema is the daughter of Prof. K.R. Srinivasa Iyyangar, who is an erudite scholar in English Literature, a retired Professor and Head of the Dept. of English and Ex-Vice-Chancellor of Andhra University.*

---

## VIBRANT TRENDSETTER

**Chitrakavi Atreya**

Seshendra Sarma, a well-known poet will turn 70 in October this year. His creative and critical writings constitute a bridge between tradition and modernity. His poetry has attained great heights of originality and unrivalled beauty. The Telugu University hailed him as a trend setter and an architect of a new era. As a luminary on the contemporary literary scene. Seshendra has shown the relevance of ancient Indian wisdom to life in the present crisis of civilisation.

Gunturu Seshendra Sarma was born on October 20, 1927 in Nellore Distrct. He studied Sanskrit unter Neti Krishna Sastry and communism under G.Padmanabhaiah. He also studied Tarka Sastra and Upanishads. He did his law at Madras Law College, joined the State Government as Deputy Panchayat Officer in 1949 and rose to the position of Municipal Commissioner.

Seshendra's first poems, strictly conforming to Telugu prosody, depicting Sankaracharya's encounter with a Dalit on the banks of Ganga were published in a college magazine in 1946. In 1948, he wrote 'Sorabu', a padya Kavyam. 'Ritu Ghosha" (cry of the seasons) another poetry volume which reflects his anguish at the sufferings of the down trodden. 'Sesha Jyotsna' (1968) is his collection of free verses. After writing 'Champoo Vinodini' (extempore poems) and 'Pakshulu', he published 'Mande Suryudu' (Burning Sun) and 'Rakta Rekha' (Arc of Blood) in 1974. 'Rakta Rekha' is considered a classic in Telugu literature.

In 1975, Seshendra's magnum opus 'Naa Desam, Naa Prajalu' ( My Country My People) brought him into prominence once again as an outstanding poet. A year later, came 'Neerai Paari Poyindi" (Turned into Water and Fled Away) in bilingual editions followed by 'Gorilla'.

Seshendra's monumental work 'Shodasi' is a refreshingly original attempt at a reinterpretation of Valmiki Ramayana in terms of *Tantra Sastra* in general and *'Sreevidya'* in particular. Similarly, his *'Swarna Hamsa'* is an eminent *Tantric* commentary to the *'Naishadhiya Charitam'* of *Harsha Bhatta.*

Seshendra Sarma is the founder member of 'Kavisena Movement' for which he wrote a manifesto *"Adhunika Kavya Sastra'*, which presents a synthesis and a comparative study of global modern poetry. This book has widely influenced the contemporary criticism in Telugu literature. Many of his books have been translated into English, Hindi, Urdu, Tamil, Kannada and Bengali and his 'My country My people' was translated into Greek in 1991.

In 1993, he received Subramania Bharathi National Award after he published a revised edition of his *'Adhunika Mahabharatam'*. He received *'Rashtrendu Puraskar'* after he brought out *'Jana Vamsam'* which consists of five of his books including *'Ritu Ghosha'* in 1994. He also wrote a humurous play *'Mabbullo Darbar'* and a story volume *'Vihwala'*. He got the Central Sahitya Akademy Award for his book *'Kala Rekha'*. In 1996, he received the Gurajada Award from Sahridaya Sahithi, Visakhhapatnam.

Seshendra who has been hailed as *'Yuga Kartha'* (architect of new era) and *'Mahakavi'*, lives in his own world of poetry. With his latest publication *'Sahitya Darsini'* he has proved frank and fearless in expressing his opinions on literature and litterateurs.

*(From The Hindu, Friday, August 22, 1997).*

# వెన్నెల జెండా

**- తంగిరాల**

ఒక మనోజ్ఞ ఉషస్సు
ఒక మధ్యాహ్న మహస్సు
బంగరు రంగుల
సాయం సంధ్యా తపస్సు
కలల చందమామ పడి
కరగిపోయిన
నిర్మల హంసోదకాల
మానస సరస్సు !

తరణి కిరణాలతో పులకించే
తామరపూల మడుగు,
రక్తవర్ణ కాంతులు విరజిమ్మే
'వనజ్వాల' నిప్పుల గొడుగు !
కొమ్మల చేతులతో
పూల బూరాల నూదే పచ్చని చెట్లు,
తోట తోటనంతా
తమ చిరురెక్కలపై మోసుకుపోయే
బుల్ బుల్ పిట్టల
జిలిబిలి పాటల
వెన్నెల మెట్లు !
గుండెలనిండా అల్లుకున్న
ద్రాక్ష తోటల రసవత్తర స్వాగతాల
మెత్తని మత్తు.

నీ మహత్వ కవిత్వ మంత్రశక్తితో
తుఫానుల క్రూర శక్తి చిత్తు,
తాటి తోపుల్లో తలదాచుకొనే ఎత్తు !

నీలి సరోవరాలలో తేలియాడే 'స్వర్ణహంస'లు
చీకటి రాత్రుల్ని వెలిగించే 'షోడశ' కళలు
చల్లని శరజ్జ్యోత్స్న' నీవే
భగ్గున 'మండే సూర్య' ప్రభా నీవే
పద్యమనే పది అంతస్తుల
అందమైన అద్దాల మేడ మీంచి
అమాంతంగా దూకేసే దేవదాసు, మజ్నూ, రోమియో, ఎడ్వర్డ్
దేశదేశాల ప్రేమ పూజారు లందరూ నీవే !
'రక్తరేఖ'లు దాటి
'కాలరేఖ'లు మీటి
మౌన ధ్యానంలో గడ్డకట్టిన నీవు
క్షణంలో 'నీరై పారి పోతావు'
మరుక్షణంలో 'గొరిల్లా'గా మారి పోతావు
ఆక్రోశంతో
అకవిత్వం పై ధ్వజమెత్తి
'నా దేశం - నా ప్రజ' లంటూ
వేదంలా ఘోషిస్తావు!
సుకవిత్వపు వెన్నెల 'రాస్తా' పై
'కవిసేన' దండయాత్ర కొనసాగిస్తావు!!

ప్రజల అశాంతి సముద్రం
నీ కాళ్ళ దగ్గర కూర్చుని

కుక్క పిల్లలా మొరుగుతుంది;
బాధల భయంకర తుఫాను
నీ ప్రక్కన జంటకట్టుకొని
మెత్తని గొంతుతో
'చిత్తం! చిత్తం!' అంటుంది ;
ఎత్తైన హిమాలయ పర్వతం
నువ్వెదురు పడితే
వంగి సలాం కొడుతుంది !
ఎందుకో తెలుసా గురూ ?
ప్రాచ్య పాశ్చాత్య సాహిత్య ఝరులన్నీ
స్వాహా చేసిన
ఒక సువిశాల మానవతా మహాసాగరం
నీ పేరు కాబట్టి !!
ఒక పువ్వును చూస్తూ నీవు
శతాబ్దాలు గడపగలవు కాబట్టి!
నీ "ఆకాశపు ఆలోచనల్లో
చంద్రుడొక కన్నీటి చుక్క" కాబట్టి
నీ అమృత కవితలు పానం చేస్తూ
జనత 'మమ ఖేలతి మద చేతసి'గా
మారిపోతారు కాబట్టి!!

ప్రతి వాడూ ఒక పిడికెడు మట్టి కావచ్చు
చరిత్ర వాడి పేరు చెప్పక పోవచ్చు
కవులంతా స్మరించదగిన వారు కారు
సకల సత్కారాలకూ తగరు
తెలుగు నేల మీద
కలమెత్తిన నీవు మాత్రం-

వినీల గగనసీమల
స్వేచ్ఛా వాయువుల్లో తేలియాడే
అధర్మంపై బుసలు కొట్టే
అసత్యాన్ని మట్టు పెట్టే
వసుధైక కుటుంబ పతాకంలో
గూడు కట్టిన పొగరు !
అవును
ఇది
డెబ్బది శరత్తుల పున్నమి చంద్రుని
వెన్నెల జెండా పొగరు !!

*(20-10-1997 నాటి శేషేంద్ర సప్తతికి గుర్తుగా.....)*

**డా. నండూరి రామకృష్ణమాచార్య**
మాజీ అధ్యక్షులు, అధికార భాషాసంఘం
సికింద్రాబాదు

## ప్రియమహోదయా

*24-8-1993 పద్య కవి సమ్మేళనంలో*

తమ సందర్శన సౌభాగ్యం సంప్రాప్తించినది. సంతోషం.

"కోడె కోకిలమ్మ - గుంటూరు శేషేంద్ర
శర్మ - నవ్య సుకవి చక్రవర్తి,
పద్య మల్ల గలడు - విద్యుల్లతలు పేని
వ్రాయగలడు తరళ గేయ కృతులు"

30-8-1993

# యుగభానుడు

- గింజల నరసింహారెడ్డి

ఒక ఇనుడు ఒక విధుడు ఒకటి స్వర్వాహినియు
ఒక హిమధరశ్రేణి ఒకటి శివతాండవము
ఇట మహేంద్రక్షోణి విస్ఫురించెను - ఇదే
కవితా మహాగతిగ కదలి శేషేంద్రచే!

వర్షసప్తతి జటావనినొక మహాయుగపు
ఉరుగంగదాల్చు నవశంభుడీ శేషేంద్ర
హాలహాల జిహ్వాలెడవీడి అమృతమె చింద
కవిత సంద్రము మధించిన మందరక్రీడ

బంధురాశ్వాసమ్ము క్షుద్రుజార్త ప్రజకు
ప్రజ్వలచ్చైతన్య కేతన మహారధము
ముఖరస్నవత్వ కల్పిత శుభాధ్వవ్రజము
ఆంధ్రవాగ్ధాత్రి శేషేంద్రాత్త కవనమ్ము

వైదుష్య డిండీర వేగవాగ్నిర్ఝరిణి
స్మేర సౌదామనీ హారవాఙ్నరదము
హిత సౌరభోల్లసిత ముక్తి మధువనవీథి
ఇది - అహో ప్రధిత శేషేంద్ర కవితాజగతి!

స్వర్ణ రత్న ద్రవ్యచయ ఘన పురస్కృతుల
నతని నభిషేకించు టన్య సంతృప్తికే -
రసగాంగపదు డతడు రత్నహేమోక్తి నిధి
శేషేంద్ర సాహిత్య శిఖర ధాత్రీదీప్తి!

# శేషేంద్ర

-ముదివర్తి కొండమాచార్యులు

శ్రీ గుంటూరు కులాబ్ధి కౌస్తుభమణీ! శేషేంద్ర శర్మాహ్వయా!
భోగీంద్ర ప్రతిమాన వాగ్విభవ! అంభోరాశి గంభీర! మీ
యోగక్షేమము లాలకింప హృదయం బుత్కంఠచెందున్ మహా
భాగా! నిస్తుల సంస్కృతాంధ్ర కవితా ప్రాగల్భ్య పద్మోద్భవా!! 1

పదమునందు మీకు చదివింపగా మంచి
పద్దియములు రెండు పంపు మంచు
చిత్రకవి కులీను డాత్రేయ నను వేడ
సిగ్గ బరువు తోడ శిరము వంగె. 2

ఘుసృణ పంకమట్లు గుమగుమల్ రేపెడు
కవన మల్లు మేటి కైసరుండు
నేటి తెలుగు గడ్డ నిన్ను మించెడువాడు
లేడు నిక్కువముగ లేడు లేడు! 3

శేషేంద్ర

" వాగ్దేవీ కరుణా కటాక్ష మహిమా విఖ్యాత వాక్ శోభితం
సాహిత్యాది కళానిధిం, కవివరం, గుంటూరు వంశోద్భవం
సౌజన్యాభరణం, విమర్శక మణిం, శేషేంద్ర చంద్రం సదా
పాయత్ క్షీర పురస్థిత స్సభగవాన్ శ్రీ రామలింగేశ్వరః"

(16-3-1997 నాడు పాలకొల్లు సన్మాన సభలో ఒక శ్రోత చెప్పిన శ్లోకం)

# అమృతవార్త

-గింజల నరసింహారెడ్డి

మహాకవీంద్రులు శ్రీ గుంటూరు శేషేంద్రశర్మగారికి

ప్రణామం

'ఉండేల విజ్ఞాన కళాపీఠం' వారి సారస్వత పురస్కారం మీకు అందజేయ బోతున్నారనే అమృతవార్త 24.8.'95 నాటి 'ఆంధ్రప్రభ' దినపత్రికలో చూచాను. అహో! 'ఉండేల విజ్ఞాన కళాపీఠం' ధన్యం! ఆంధ్రులకు కృతజ్ఞతా పాత్రం! ఆనందపరవశుణ్ణైనాను. ఆనందబాష్పవారి కురిశాను.

మారిన మీ ఫోన్ నెంబరు నాకు తెలియక పోవటం చేత ఫోన్ చేయలేకపోయాను.

ఉండేల మాలకొండా
రెడ్డి, ఎమెస్ రెడ్డి భుజా!
కవితా సౌష్ఠవోద్భోధ
క ప్రౌఢసుహృద్వితయా! 1

ఓహో శరచ్చంద్రికా ధవళశీత మృదు!
ఓహో నటత్ సుందరాకృతి తుహినబిందు!
మధురవాక్సింధు! రమ్యోహల జగద్బంధు! 2

నీకో అవార్డు నీచే అవార్డు కవార్డు
ఊహాపక్షాల అతిలోకగీతిక బర్డ్ (bird)!
జగతి అచ్చెరువువడు! 3

ఝంఝా ప్రభంజనాల్, నిర్ఘాత ఘాతాలు -
ధూతాల్ హృతాల్ మృతాల్గా చేసి దుష్టతల
నీ కవన రణ గణాల్ రిపుతతి క్షతి చణాల్ 4

హితవాటికా కుసుమ పటలి ద్యుతి ధాటిగా
కలుషతా దుర్గంధ తతి నణచు మేటిగా
సుమనోమణీ! ఘృణీ! ప్రథమ సంధ్యా ధ్వనీ! 5

పటు విమర్శనముచే స్ఫుటిత హృజ్జలజమా!
వాదిత మనోముదజమా! స్వప్నమా, నిజమ?
ఆనందమానవత ఐన ఒక భంగిమా! 6

ఓహో శరచ్చంద్రికా ధవళ శీత మృదు!
ఓహో నటత్ సుందరాకృతి తుహిన బిందు!
మధురవాక్సింధు! రమ్యోహల జగద్బంధు! 7

అమృతమహోత్సవమ్మిది మహాకవి చంద్రుని కర్పూరీతిగా!
సుమతికృతోత్సవమ్మిది రసోజ్జ్వలవార్ధులు పొంగువారగా!
ద్యుమణిగ తారకావన విధుప్రభగా మృదు గంధవాహ సాం
ద్రము దివసోదయమ్ముగ నదత్కవితా జగదాకృతీ! నమః! 8

*(25.8.1995)*

# యుగకవితా శేముషి

–డా॥ వేదుల శ్రీరామశర్మ (శిరీష)

అభివ్యక్తి అపూర్వ ప్రయోగమవడం
కవిత్వానికది కొత్త జీవం పోయడం మాటలు కాదు.
జీవితమే కవిత్వమై, కవిత్వమే జీవితంగా
కాలం కాన్వాసుపై కదలాడే అక్షర రూపమవడం,
ఆధునిక సాహిత్యానికి విప్లవ భాషా విధాతవడం
''అభినవ కవితా యుగకర్త''కు మాత్రమే సాధ్యం
వివేచనతో సాహితీ విలువల శేముషీ సంపన్నుడే
కవితా ప్రపూర్ణుడై ''ఆధునిక మహాభారత'' రథికుడౌతాడు.
అలా ఈ శతాబ్ది కవిత్వానికి అంతర్ముఖుడైన కావ్యశిల్పి
అభ్యుదయ కాల ప్రతీకై నిలిచే కవీంద్రుడు....శేషేంద్రుడు.
జెండా లెగరేయక కవిత్వ ఎజెండాయై రెపరెపలాడే
రసజన పీఠ విద్వాంసుడు, మండే సూర్యుడు!
తెలుగు వాఙ్మయానికి వెలుగు బాటైన యుగకవి
'' నా దేశం - నా ప్రజలు'' అన్న అపూర్వ భావ కవి.
రంగుల భావ విహంగమై అంతరంగం దోచి
''ఋతు ఘోష'' వివరించిన సహృదయ కవి
దేశపు కాంక్షలు కాగడాలై ఊరేగాలంటూ
కాలం ప్రతీకలై కవులు పూల గుత్తులు కావాలనే
కలం యోధుల కవిసేనాధిపతి....శేషేంద్ర !

**(ప్రఖ్యాత కవి డా. శేషేంద్ర నేడు సాహిత్య సభలో అభినందన అందుకుంటున్న సందర్భంగా, 18-3-1997, కాకినాడ.)**

# సుహృల్లేఖ - 1

## 'ఆంధ్రబిల్హణ' శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

హైదరాబాదు

విద్వత్కవయే శ్రీమతే శేషేంద్ర శర్మణే వితీర్యంతే భూయాంసి నమాంసి.
మన్యే భవంత స్సర్వేపి కుశలినః . ఆంధ్ర ప్రభాయాం ధ్వని ప్రశస్తి ప్రఖ్యాపినం భవతాం లేఖం దృష్ట్వా మహానంద భరిత స్సంజాతోహం.
బహోః కాలాత్ సిద్ధం న స్సమీహితమితి భృశం సంతుష్యామి భవత్సరస కవితాను రసితం లేఖం విలోక్య. ఆనంద తుంది లాంతః కరణో Z హ మర్పయామి కావ్య సుమాంజలిం భవచ్చరణ నలినయోః, స్వీకృత్య మాం ధన్యం కుర్వంత్యనుయాచే -

"అతి భాసుర వాక్చమత్కృతిం రసభావై స్సమలంకృతాం తథా।
మృదు చిత్ర విలాస విస్ఫురత్ పద విన్యాస సుశోభినీం కవే!-॥

భవదీయ కరార్పితాం స్పృశన్ కవితా ప్రౌఢ నితంబినీం దృశా।
సకలేంద్రియ తృప్తి మధ్యగాం హృదయం మే ప్యహరత్ ధ్రువంహిసా॥

అధునాహ మితీహ భావయే సులభం త్వ చ్చరణం కదానుమే।
నమ ఏవ కృతజ్ఞతాన్వితం కవి శేషేంద్ర సమర్పయామితే -॥

నిష్ణాత శ్శబ్ద తంత్రే నిరుపమ ధిషణః కోమలే కావ్యమార్గే
నిస్సీమో రాజ్య తంత్రే నిరుప హతగతి ర్దుర్గమే తత్త్వమార్గే।
ప్రాక్ ప్రత్యగ్గి స్సముద్ర ప్రథిత మణి గణాకర్ష ణేయం నదీష్ణః
శ్రీమచ్ఛేషేంద్ర శర్మా జగతి విజయతే మండనం పండితానాం -॥"

## నౌమి నవ్యకవితా పితామహమ్!

- బులుసు వేంకటేశ్వర్లు

సారభూత రసవాక్య బంధురం
నవ్యమార్గ గమనాత్త వైభవమ్।
కావ్యభావ పరమార్థ చింతనమ్
నౌమి నవ్య కవితా పితామహమ్॥

పూర్వకావ్య కవితా మహోదధౌ
నిత్యమగ్న హృదయోపి నై కథా।
నూత్న కావ్య రచనాభిశోభితం
నౌమి నవ్యకవితా పితామహమ్॥

సర్వ కావ్య సుకవిత్వ బాంధవం
విప్లవాత్మక కవిత్వ భూషణమ్।
మానవత్వ కరుణార్ద్ర మానసం
నౌమి నవ్యకవితా పితామహమ్॥

## NIKHEPHOROS VRETAKKOS
(Renowned Greek Poet)

*(శేషేంద్ర విరచిత 'నాదేశం నా ప్రజలు' అనేఆధునిక ఇతిహాసానికి ఏథెన్సు నగరంలో ప్రచురితమైన గ్రీకు అనువాదానికి భూమిక వ్రాస్తూ అందులో జగద్విఖ్యాత గ్రీకు కవి 'నికిఫోరస్ వ్రిత్తాకోస్' ఇలా అన్నారు)*

*Excerpts from the preface to 'My Country, My People', Greek translation by Georgia Alexiou - (Original : Seshendra Sharma).*

"It wasn't only Tagore and Gandhi who crossed the frontiers of their country and reached the wider world and achieved universality. Seshendra's epic poem 'My Country, My People' is an evidence."

".......Seshendra's epic is interlaced with the symbols of his country's life and landscape. This is very natural; otherwise, a literary work could not be linked with the place or the soil on which it is born and consequently takes its place in the world. Truthfulness of facts makes narration real."

"Some of the well-known critics have compared this epic poem with T.S.Eliot's 'Wasteland' and 'L'Ascension' by St.John Perse. Personally I would compare the pain and anguish of the poet with the one of Lautremont in his lyric 'Mald Aurore'. The difference is that Seshendra's protest is not made in the void (emptiness). Seshendra walks firmly on his soil."

"One can find in the poet a wild whirlwind which attains incredible oratorial heights, creating terrific images ..... whirling within him is the idea of strength, of life that is fighting the dark powers which want to take away its freedom and bread ....... At times we observe in the poem a Biblical and prophetic tone that attracts us."

## DENA ANAXAGOROS (CYPRUS)

Letter of Dena Anaxagoros translator of the preface of Nikiforos Vrittakos. She was in Mysore University taking a course of Indian Literature.

MYSORE 20th June,1990.

Shri Seshendra,

Thanks to Mr.Sundaram, I had the unique chance of reading some of your poetry which has been a revelation to me. What I felt, reading "My Country, My People", some months back was too strong.

All the images you were depicting, all men were just emerging out of the poem. A mere eruption ! My emotion was so strong that I couln't even continue and I never finished the book.

May be it was the feeling of being "guilty". Whatever was taking place inside the poem was surrounding me in the everyday life of India. But till then I was looking only at the "surface" of India, I was like the prisioners in Platon's cave who used to look at the shadows and believed that this was the real light (+life). From the little that I managed to read, your poems have withdrawn the curtain of the illusion and showed me the other side of India, the real India, of the "Suffrance", of the suffering. Your pain made me compare your poetry to the one of Octavio Paz, whose Mexico is so distant and at the same time similiar to the way people perceive pain, love and life. In one of his poems called "MUTRA" which he started writing in India, I found this feeling that possessed me reading your poetry. And Octavio Paz's experience of India was as well so strong that he never managed to complete this poem though he tried many times since. Your poetry has elevated INDIA to me and gave me this feeling that I cannot stand for long in front of the beauty, just as we cannot stand

for long looking at the sun.

And the real beauty is walking side by side with the despair and the pain. The same pain+despair are the one which give birth to Art and its beauty.

Albert Camus said :

("if the greeks attained beauty and whatever oppressive, maintain, its only through despair")

I felt India like "mine", I felt it next to Greece and my own reality, inspite all the differences.

The tragedy you are living inside you by watching the tragedy that takes place every moment and every hour around us, I have even felt it walking to so many places of India. It became more conscious to me, with the help of your poems.

The mythe of Sisyphe is nowhere else more alive than in India. And seeing man who is living with the hope of —— the hope, I even realized the big difference between your country and mine. In India Gods are still alive and they will never die. They are in every corner, every flower every where in this country. In Greece Gods have died thousands years ago and man has only broken Temples and rocks which remind him the ancient glory.

I want to read your poetry again but I'm afraid, especially as in a few days + hours I will be in Cyprus and I have to face the "void", this emptiness of time and distance thinking of having experienced the great "experience" of India and though I have left nothing behind me, I have given nothing to its people. I have just walked and walked and I will have to walk to other foreign countries, like Oedipus who was walking blind. The same way I will have to walk and try to see the light inside me.

In page 62 of the photocopies, a fragment of one of your poems is possessing me. I haven't even read the whole of the poem but in these few lines that I read many a times since that afternoon - each time the images that I have just seen - are

painted ın other colours, everything takes new dimesnsions and I find myself walkıng in new paths.

"I received the big message that I became MAN".

"Aripunos", which is the answer to all our questions. Thıs Aripunos,this Man we are searching is "ARIADNE" who is giving us the thread to come out of the dark labyrinthe of Time. ARIADNE is love and it's her name that Nietzsche was calling desperately through his madness.

And "Man" was the answer to the enigma solved by Oedipus. That's where the tragedy begins !

This tragedy taking place all around us. We have chosen to be the Heros and not mere spectators, so we have to play our role tıll the end and endure all the pain and agony.

Shri Seshendra, I find myself unable to stop even though I know that I'm writing non-sense. I even forgot the reason I started writing to you. I wanted to tell you that I'm sorry about my translation but my englıgh is very poor and I'm even running out of time as I'll be leaving Mysore in one or two days.

With warmest regards as well as to your "Arıadne" from Dena Anaxagoros.

*(Written after readıng the Greek translation of "My Country, My People" published in Athens - Greece)*

**శ్రీ డి. శ్రీనివాసదీక్షితులు,**

ఎం.ఏ., సాహిత్య విద్యా ప్రవీణ, పి ఓ ఎల్.

సంస్కృతోపన్యాసకుడు, నరసరావుపేట.

"మహాకవిం మహోదాంతం మహాచార్య మహోదధిం।
మహానగం మహోన్నతం మహోజ్జ్వల మహామణిమ్॥"

"నమామి మనసా రమ్యం రసరాజ్య విభుం చ తం ।
శేషేంద్ర కవిశేఖరం శేముషీ విభవం గురుమ్॥"

# SESHENDRA : THE POET, MY HUSBAND

**- Indiradevi Dhanrajgir**

Seshendra is sitting on the marble terrace in Gyan Bagh Palace, silently looking out towards the massive lawn. A statute of white marble Hercules stares back at him. Moon floats over the silvered leaves of the garden leaving imprints of light on the distinguished forehead of my husband. His dark powerful eyes are lit with a burning fire; through them I seee his blood surge. The moon has confirmed him in his individuality. I know.

Through so many similar evenings I have watched him fretting for his country and his people. This pain strolls with him like a silent companion, at times even into the night. The mystery of this feeling is what the poet in him unravels time and time again. A weight of centuries comes to settle in the blood of the poet and forever he must remain in this everlasting pain for his people and his country until he can lead them to the gateway of dawn.

I have not seen another man to whom his country is one long obsession, though sleep, through dream, through wakefulness. His emotional creative and spiritual life only pulsate with this consciousness. When he chose the title 'My Country, My People' for his modern Epic, it was but natural, for poetry to him is also a dialogue with his people. His people are not the 5 crore Telugu speaking people but as he says 'I write for 55 crores of my people'. Every line of his poetry reflects his deep rooted Indian ego, a feverish passion for his nation. Patriotism is too inadequate a word to describe his condition of mind.

I remember of an occassion when he read about 'genocide' in Vietnam and had to take a sleeping tablet to sleep that night. He is ultra sensitive to people, and situations. One

minute he melts into a sea, another he stands solid like a hill, silent. And at yet another moment blows like a violent wind. Never remains at the same point like a river. I know I have married a great storm. Where does he want to go? What does he want to do? His thoughts are too massive and the surroundings are too small to contain him. He is like a whale in a tub.

One of the thing which began to develope on his contours after our marriage was a gradual look of healing which spread over his face. It seems as though he has achieved a deep inner grace of happiness.

The moon shifted, again the skies went dark. There was a vibration on the poets face the glinting look of moment ago was replaced with a furious magnificence. A new voice was coursing in his eyes. He had ventured forth from the world of common day into a region where poems take birth, I knew this by experience. I must wait for him to return from this mysterious adventure with a power to bestow on things around him a renewed hope. That night the poem 'boats & sails' was born. At difference occasions other poems took their birth in the same house.

The hills and mists of the Niligiris have contributed many symbols to his poetry and have brought new images to modern Telugu verse. On the hot roads that led us to Kurnool every weekend during February to April 1974 many poems took their contours and shapes and finally became living entitles. His inspiration for Seshajyotsna was mainly from Gyan Bagh, Italy, Paris, Greece, Germany, Brij Bhoomi. I am left with little doubt that in his own time he has originated a school of expression unknown to Telugu before. His writing is a flame which will awaken the sleeping spirit of the people.

His lines echoe Man's resurrection from this present death. This poets flashing and limitless depth and range of

thinking has come through a profound and ordered scholarship, his being is nourished from his Indian nativity and he knows that a poet can only stand beside the great masters of literature by virtue of an informed consciousness. When a poet reaches this watermark of seasoned command over his medium and a clarity of expression he weaves on the looms of his imagination the tapestries of 'epics', from where once again truth rises out of the shadow like the most powerfull sun.

Poetry streams from Seshendra's person, otherwise he would not have been a poet of such great calibre. I can tell you his mind is trained and mobile with which he creates Works that conquer death and age for him.

## కవిసేన మేనిఫెస్టో

- శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

"కవిసేన మేనిఫెస్టో ప్రాచీన సంస్కృతాలంకారిక సిద్ధాంత సారమంతా ఏకత్ర ఘనీభూతమై, సులభగ్రాహ్య శైలిలో జిజ్ఞాసువులకు అలంకారశాస్త్ర, సిద్ధాంతాలను కరబదర సమానంగా అందించునదిగా ఉన్నదనుటలో సంశయలేశము కూడా లేదు. కవిసేన మేనిఫెస్టో గ్రంథమును సమగ్రంగా, పరిశీలన దృష్టితో, విశేషించి అందలి అలంకారశాస్త్ర విషయాలను అధ్యయనం చేసే భాగ్యం నాకు కలిగింది. ప్రాచీన సంస్కృతాలంకారిక మూర్ధన్యులైన భామహాదుల సిద్ధాంతములను, ఆధునికరీతులలో మృదుమధుర శైలిలో ఇంత శ్లాఘనీయముగా అందించిన పుస్తకం తెలుగులో లేదని ఘంటాపథంగా చెప్పవచ్చును. పేరు కొత్తగా ఉన్నను అందులో వివరింపబడిన విషయములు ప్రాచీన సైద్ధాంతికములూ, విద్వదనుమోదకరములునై ఉన్నవి.

శ్రీ శర్మగారు సమస్తాలంకారశాస్త్ర వైశారద్యమును గడించి, నవీనయుగ నిర్మాణదక్షత సంతరించుకున్న సాహితీద్రష్ట. ఈ కవిసేన మేనిఫెస్టో అనేకులకు కనువిప్పు కలిగించి జోహారులర్పింప జేయునదిగా ఉన్నది.

## SYMBOLS IN THE POETIC JOURNEY OF SESHENDRA - Indira Devi Dhanrajgir

A writer has two lives, one is the physical life he is forced to lead through the many vissicitudes of daily routine and, the other is his conscious inward journey on the level of his psychic world. His ultimate struggle lies in the constant process of harmonising the two worlds. There is also for every indiviudal the outward and the inward journey is more pronounced and forms the most important aspect of his living and thinking life which frequently supercedes the limitations of his physical existence.

This process modifies the poets entire being and makes him stand apart from the rest of manking. A poet's thought undergoes a total transformation under the mandates of his inner world. He has in him an entire rebirth of curiosity and like a child reborn he leaves no object of creation unlooked, unfelt and untampered to assimilate. It is this second childhood that rises like a child sun and throws new lustre on objects which now look to him in their essential being. He is then living in the world of essential beings which are called in the common jargon of literature symbols.

To me symbols are like mythological episodes, for instance child 'Hanuman' tried to clutch at the rising sun and attempted to eat it thinking it is a fruit.

All Mythology was born only this way through the fresh childlike vision of the sage and imp who transformed their inner worlds to invite upon themselves fresh births of great meanings which were woven into simple stories to be deciphered later by generations to come.

The inward poetic journey of Seshendra began quite early, somewhere when he was twenty odd years, from then to now one can easily decifer them as his distinct periods of creativity and expression. Each major writer or poet has different

periods of time in his creative journey. There is an early period of blossoming, then the period of achievement and sense of a spring time, then the mature period of wisdom and poetic excellence combined with the eternal mental harvest, and finally if the poet is fortunate enough to live a complete cycle of life then come his poems of vision and farewell... this I call a total cycle of a poet's journey, a total blossoming of a deep mental process, a symbolic journey which finds its fulfillment in complete creativity. A journey which has an abundance of gathering of symbols.

All through Seshendra's life man and nature have been the most provocative inspiration. These have vibrated in him at difference levels of his consciousness and given birth to some fascinating symbolic pictures.

As a person so close to Seshendra I shall take you into his creative world. Into the mysteries of the birth of his symbols. We were driving through the Bandipur forest by evening everything around was still, not even the footsteps of birds were heard. Overwhelmed by the cool solitude of the moment between approaching dusk and day he wanted the car to be stopped. The whale like black Mercedes swiming along the distance of the road came to a halt as if suspended in waters. Seshendra eagerly came out feeling the space of the forest with all his senses. He was there like one of those teak-wood trees endeavouring to grab the total experience of being in the forest. He looked like having grown leaves and branches to lick the inconceivable taste and feeling of the sky and the forest at that moment. He hardly realised how much time flew but when the first evening star appeared in the sky I touched him to pull him out of his reverie and remind him that we had a long way ahead of us and night was approaching.

I had only to touch him when he bursted into a narration punctuated by silence. We could hear a soft cooing of a bird and the notes of a stream trickling down the mountain. The

bird and the trickling stream solved the agony which was consuming him. He said he was trying to touch and feel the contours of the experience of joy of being in a forest and to bring it down to the measure of physical existence which was all the time elluding the grasp of his senses. Therefore he had to become a tree, grow leaves and branches and realised that with the chirping of the bird and the notes of the mountain brook the total experience of a forest could be measured. And the lines came :

*"I measure the forest with the song of a bird or with a meandeing stream".*

I was thrilled at the idea of his becoming a tree to grasp the experience of the forest with the fingers of his third eye. I asked him to record these lines in the compendium of his poetry notes which travel with us always like one of his limbs. For quite some time even later he felt actually like a tree and the symbol of a tree dominated his creative world for a period. I understand from his ways of thinking that he passes through different periods of domination. He was once before that under the domination of the symbol of Sun. Perhaps this happens in the case of all creative intellectuals as we see in the case of Picaso's the orange, pink and white periods.

One day he bursted a surprise upon me by saying that *"his people are beautiful wild animals that tear the flesh of the fruits with their teeth"*. The episode he narrated was interesting. It appears he was lunching with a few friends at a Restaurant. One of them picked up an apple and dug his wide teeth into the flesh of the fruit and the apple creaked with pain, Seshendra felt. His friend had a plump face and his eyeballs were hidden in layers of fat, and his entire face showed lines of the animal in man. Then he thought 'the animal in man is cruel'. Now perhaps coming along the way he must have chewed the whole scene:

*"Where my people wander on the sandy beaches in gay abandonement tear the flesh of fruits with their teeth and prowl like beautiful wild animals".*

There are certain things I shall always remember. One morning clouds had touched Paris somberly, the trees down the road of Arc de Triomphe were as if racing away to catch up with everybody's dreams. We walked into the Louvre and were confronted with a large figure of Venus de Melo in the middle of an arch with light flooding onto her face, stripping her nudity to the very edge of her skin. Her looks so deep and engulfing that Seshendra stood before her catching up recollections.

His face was lighted with surprise, his eyes looked for those gems which must have been embedded into them once and wondering what colour could they be? Brown, green or blue? He remained in a half daze the whole day. He remarked.

*"It isn't as if only we have sculpture. The story of the human race who knows began from where but the effort of man is strewn all over the earth, over dumb rocks and white marble, on the walls and in the plaster, in sheets of handwritten paper scrolls and finely moulded jewellery, in the most brilliant brocades and lyrics, songs, poetry and the Epics. To see these and know oneself is another way of lining oneself to the glories of human past, the present and future".*

From this emerged the glorious poem 'You' of Seshajyotsna.

A poet in the moment of the birth of a symbol is in a state of mind where his physical world and his dreamy-world into which he lapsed keep playing over each other overlapping each other and when they finally melt into each other the symbol rises like a Venus from the depth of the poets inner sea. I can easily fancy this is what happened to Seshendra the poet as he stood before the sculptured marble of Venus de Mello loosing entirely the pair of his dreamy eyes. on her........

*"Those supreme eyes, your eyes shimmer as two pieces of broken sky, two blue birds, two blue black sapphires about to take wing"*

(Seshajyotsna poem 'You')

It was another such moment, a long way from Paris, in Italy. The sun was setting between the old arches on Via...near the Hotel Excelsior where we stayed. Rome had gone a beautiful blurred mauve. The evening light was so diffused that it seemed like a blush on the city. The weather was cold and the sun was red as a Plum. The arches grew darker and darker. The trees faded out along with the avenues and the Sun just hung there like a red lantern. He looked at me and I smiled. That moment is immortalised in the same poem 'You'.

*"O Roman sun, in your murderous red blood Michael Angelo dipped his vibrant brush. Don't you hear the cries? Rome still weeps an agony of colour?"*

At times I feel he has an obsession a Beaudelainan storm rages in his inner most depths not translucent to others except to those who know him. I hear him frequently mentioning the far off islands in the pacific full of waving coconut groves and feel Sommerset Maughams The Moon and Sixpence an adolecent dream that still digs deep into his subconscious. Therefore he once wrote a line in his exuberence of loving and said investing his soul.

*'where I, the storm fled away from the oceans, take shelter in the coconut groves of your bosom.'*

(My Country, My People, Canto II)

It is not without excitement and freshness of a wonder that you go into his experience as a miner probes into the tunnel of a mine to find dazzling deposits of precious ore.

The first lines of his modern Epic 'My Country, My People's rose out from the coils of his mind like a full hooded

cobra hissing out the total power of a dawn; the lines see the glorious image of the eternally toiling human hand in the ever rising orb of sun, both combining the steady rise of mankind into great civilisations and culture through the sanctity of labour. This was the one Everestian symbol from which his entire stream of consciousness flows down and floods the pages of his Magnum Opus with a plathora of images and living pictures. The birth place of this interesting symbol was a room overlooking the Dam at Krishnaraja Sagar Hotel, Mysore. Seshendra was still in bed drinking the dawn with his half awake eyes. He was preoccupied with the idea of civilisation and it was waiting to catch the most striking symbol from where he would unfold his inner theme of culture, civilisation, time and man. So it came to be that one morning, one sacred morning :

*"A hand rises out of the dawn, the hand of the toiler of time, it is raised dipped in the blood and sweat of human fields "*

There are a hundred incidents like this which could go on narrating exposing his mental journey to you but that will have to be in the form of a book which I hope to write one day. Here I give you just a few glimpses into the poetic journey of Seshendra how he captures these ellusive symbols for his works. These instances will reveal to you but only limitedly the process through which a mature poet lives and how this living poetry is made. Living poetry is not made by taking a great line of another poet or writer. It is not worthy of a real poet for he has not lived it, it has been lived by somebody else. The real poet excavates poetry out of his environment, he chisells it with the tools of his mind and gives it to you like a special gift carved out of his being.

Creativity is a unique moment in a poet's life. A poet's life ultimately is only stringing these intensely lived moments and, the rest one can say, is not his real life.

# A WILD WILLING VICTIM OF BEAUTY

**- Utpal Borpujari.**
(New Delhi)

HE CALLS poetry an adventure and believes multiplicity of languages in India is the root of all social evils.

In fact, for immensly-respected Telugu poet, critic and scholar Gunturu Seshendra Sharma, love for poetry and nature, and concern for the problems in society have been the driving forces in his nearly five-decade-long literary career.

"I am a victim of beauty - it chases me like a hunter chases a wild animal. But I walk into its trap willingly as I experience a strange pleasure in it incomparable to any other," the Sahitya Akademi award-winning poet says about his inspiration for writing poetry.

Widely-travelled poet Sharma is credited with the revival of modern Telugu poetry, and his *Munday Suryudu* (Burning Sun), *Rakta Rekha* (Arc of Blood) and the magnun opus *Naa Desham, Naa Prajalu* (My country, My people) are treated as bench-marks of modern Indian poetry.

"The unknown beckons the searcher with its beauty, but it is doubtful whether he is successful in capturing it fully though it exists everywhere." Mr.Sharma, a former Civil Servant, says about his source of inspiration.

"If you do not seek anything and do not sharpen your eye, you will be left gorging only the famılarities," he told a audience at a Sahitya Akademi programme recently.

Relating how he draws his inspiration from the mundane, Mr.Sharma says, "Once while going to the airport in Madras I saw a woman dressed in rags with a naked child in her arms, begging on the roads. And I wrote: the child in the womb / better it remains in the womb in our country / otherwise, if it cries of hunger / people will show it the way to the footpath and not to the fields."

His love for nature and corresponding concern for the deteriorating environment is reflected in another of his poems, written, once again, during a journey through a forest by road.

It says,"Chased by the human bazaar, silence fled to the hills....I measured the forest with the song of a bird and the melody of a meandering brook."

Called a rare combination of a poet and a critic, Mr.Sharma was born on October 20,1927 at Nagarajupadu in the Nellore district of Andhra Pradesh.

Mr.Sharma's birth as a poet took place in 1951, when he translaed Mathew Arnald's version of the persian epic *Shahnama* into *Sohrab and Rustum.*

His first collection of prose-poems, titled *Seshjayotsna,* came out in 1972 in Telugu and English bilingual editions.

Then, in 1974, came *Munday Suryudu* and *Rakta Rekha,* which created a stir in the Telugu literary world for their erudite and pro-found expressions. Both are now considered classics of modern Indian poetry.

The next year he came out with *Naa Desham, Naa Prajalu* which has been hailed as landmark by poet-critics like Ali Sardar Jafri, Virendra Kumar Jain and Dr. Vishwambaranath Upadhyaya.

He won the Sahitya Akademy award in 1994 for *Kaala Rekha* (Arc of Time), which, incidentally, is not a poetry collection but comprises 25 critical papers presented in seminars on topics like ancient drama, comparative literature, classical poetry and modern writing.

Upadhyaya once described Mr.Sharma thus, "He is not a mere medium of the age, but the architect of the spirit of the age."

While another litterateur-critic C.N.Sastry said, "His emergence is to be hailed as a significant landmark in the history of modern Telugu poetry."

Sharma, who has visited many countries including Greece,

Germany, Mauritius, Madagascar, Kenya, France and Italy, believes, "Poets want to cross the barrier of languages. I cannot tolerate to be referred to as a Telugu poet - a poet is a poet in any language."

Incidentally, Sharma is a proponent of one common language in India, which once spoken by all, he believes, will solve most of the socio-political problems of the country.

"Why so many languages. Select one language for the country," he says in his poetic innocence, and refers to the biblical story of the Tower of Babel. "Unfortunately, in our country people are too much in love with their respective languages."

"Man is superior to language, but he now is being dominated by the latter," he says adding "but do not misunderstand me."

*(From "The Pioneer" ,Delhi*
*Wednesday, - 14th December,1996)*

**Prof. Kethavarapu Ramakoti Sastri** (Head of Telugu Dept., Kakatiya University, Warangal)

మొత్తం మీద యాభైఏడు లక్షణ గ్రంధాలనుండి ప్రామాణికమైన మద్దతు చూచుకుంటూ గుంటూరు శేషేంద్రశర్మగారీ మేనిపెస్టోను రచించారు.

'నాదేశం నా ప్రజలు' అనే ఆధునికేతిహాస రచనవల్ల అభ్యుదయ కవితాధ్వమున స్వరూపమును త్రోసి రాజని స్వభావమునుబట్టి కావ్యత్వమును స్థాపించిన గుంటూరు శేషేంద్రశర్మగారు, ఆధునికాంధ్ర, సాహిత్య విమర్శనాధ్వమున ఈ మేనిపెస్టో రచనచేత ఒక విశిష్ట సమన్వయాభ్యుదయ దృక్పథాన్ని ప్రతిపాదిస్తున్నారని చెప్పవచ్చును.... (విమర్శిని, జనవరి 1978, కాకతీయ యూనివర్సిటీ )

# నా దేశం - నా ప్రజలు

విఖ్యాత తెలుగుకవి శ్రీ శేషేంద్రశర్మ తన దీర్ఘ కవిత ''నా దేశం -నా ప్రజలు'' ఇతిహాసం అన్నాడు. ఈ సందర్భంలో నాకు టి. యస్ ఇలియట్ వ్రాసిన ''Waste Land', ఫ్రెంచికవి సెంట్ జాన్ పెర్స్ వ్రాసిన 'అనబాసిస్' అనే కావ్యాలు జ్ఞాపకం వస్తున్నాయి, ముఖ్యంగా అనబాసిస్. ఎందుకంటే యూరోపీయ మహాద్వీపాన్ని గురించీ, దాని శ్వేత జాతుల ప్రపంచాధిపత్యాన్ని గురించీ అందులో జయగానం చేయబడింది. శేషేంద్రజీ కూడా తన కావ్యంలో తన భారతదేశాన్ని గురించి, ఆ దేశ ప్రజల్ని గురించి సంబోధించాడు. కానీ ఈ రెండు కావ్యాల్లో ఒక ప్రాథమిక విభిన్నతఉంది. అనాబాసిన్ ఒక విజయ గాథ. అది విజయగరిమ, పరాక్రమోద్ధతి, ఇంకా ఒక బలిష్ఠమైన జాతి గడించిన ఒక గొప్ప ఉపలబ్ధి ఇత్యాది విషయాల్ని గురించి చెప్పడంతోనే సమాప్తమవుతుంది. కానీ శేషేంద్ర కావ్యంలో భారతీయ ఆత్మయొక్క లాక్షణిక అభివ్యక్తి ఉంది - అంటే ఏది మూలతత్త్వదృష్ట్యా చూస్తే, ఒక నమ్రత ఒక ఉదారత మలచిన చేతన ఏదో అలాంటి చేతనా; ఏ జాతి చరిత్రలో మాటి మాటికీ పరదేశీయులచేత ఆక్రమింపబడినప్పటికీ సౌందర్య మహిమయొక్క ఉదాత్తగీతం అవిచ్ఛిన్నంగా గానం చేయడంలో క్లాంతి చెందలేదో, అలసి పోలేదో, ఏది విజయ గర్వంతో ఎప్పుడూ విర్రవీగలేదో, ఏది సమర్పణైక శీలంచేత సదా నమ్రంగా ఉందో, కానీ ఎప్పుడూ నిరవధిక అనంతత్వాన్ని ఆరాధిస్తూ వచ్చిందో, అలాంటి జాతీ, ఆ చేతనా ముఖ్య లక్షణాలైన భారతీయత యొక్క అభివ్యక్తి ఉంది శేషేంద్ర కావ్యంలో.

వైజ్ఞానిక, యాంత్రిక విజృంభణ పెరిగిన ఈ కాలంలో మానవ తత్త్వంలోనే విశ్రాంతికి సంబంధించిన స్పృహ అంతరించింది. ఒక పృథుల కళేబరం కలిగిన ఇతిహాసం చదివి అందులో నిమగ్నం అయ్యేంత వ్యవధి ఎవరికీ ఈ రోజుల్లో లేదు. ఆ కారణంచేత ఈ కాలంలో ఇతిహాసం తన పరిమాణంలో విస్తార ఆకారాన్ని పరిత్యజించి, హృదయంలో మాత్రం ఒక విశ్వవైశాల్యాన్ని మహత్వాన్నీ సంక్షిప్తం చేసుకుంటుంది. అందు చేతనే అది అతి సంశ్లిష్టమై జటిలమై అమూర్తమై తన

లఘు కళేబరంలోనే, అంటే తన సూక్ష్మ శరీరంలోనే, ఒక ఇతిహాసపు వైశాల్య లక్షణాన్ని అభివ్యక్తం చేస్తుంది. Waste Land, Anabasis లు ఆధునిక ఇతిహాసాలకు చక్కటి ఉదాహరణాలు.

శేషేంద్రజీ ఎక్కడ తన ఎపిక్‌ని అంటే ఇతిహాసాన్ని ఒకవైపు లిరిక్ తత్త్వంతో నడిపించాడో, అక్కడ రెండోవైపు విశాల భారత విరాట్ స్వరూప దర్శనం సమర్పించి కోట్లాది భారత ప్రజలతోనూ భారతీయ ప్రాకృతిక సౌందర్యంతోనూ తాను తాదాత్మ్యం పొందాడు కానీ ఇది కేవలం రొమాంటిక్ సౌందర్యగానం కాదు. ఇందులో ఈ నాటి భారత ప్రజాకోట్ల బాధాసర్వస్వం ఒక తీవ్రమైన జ్వలంతమైన అభివ్యక్తి పొందింది. ఈ నాటి మన ఆత్మిక కాన్సర్‌కు, మన వికృత ముఖానికి, శేషేంద్రజీ ఒక మూర్తి ఇచ్చాడు. ఆధునిక కావ్యచేతనా స్థాయిలో మూర్తవస్తువును అమూర్తము, అమూర్త వస్తువును మూర్తము చేసే ఆధునిక కావ్యతంత్రాన్ని ఆయన తన సొంతమార్గంలో ఒక విలక్షణ ప్రయోగం చేశాడు.

నాకు ఈ కావ్యం అందుచేత ఇంత బాగానచ్చిందంటే దీని పునాది బౌద్ధికంకాదు; కానీ హార్దికమూ ఆత్మికమూ. ఇది కేవలం మస్తిష్కాన్ని ఉద్వేజితం చేసి వదలి పెట్టదు; అంతకంటే ఒక గంభీరమైన వేదన చేత ఒక సంవేదనచేత మనల్ని లోలోపలే కరిగించి వేస్తుంది. ఇక్కడ, ఇది మన దేశము మన ప్రజలలో మనకు ఒక ఆంతరిక సంవాదం కల్పించే రంగభూమి మీదికి తెచ్చి నిలబెడుతుంది మనల్ని.

– వీరేంద్రకుమార్ జైన్

అగ్రశ్రేణి హిందీ కవి, విమర్శకుడు, నవలాకారుడు

# శేషేంద్రచే నూత్న కవితా ప్రారంభం

*("శేషేంద్రజాలం" నుంచి)*

-ఆవంత్స సోమసుందర్

తన కాలం వరకూ ఉన్నదాన్ని పూర్తిగా ఆకళించుకుని తన కాలంనాటికి లేనిదాన్ని సృజించి అభివృద్ధి చేయడమే అచ్చమైనకవి సాధించే వినూత్నశక్తిగా పరిగణన పొందుతుంది.... ఆనుపూర్వికంగా వస్తున్న సమకాలీన భాషనుంచీ అభివ్యక్తి విధానాలనుంచీ తనకు ఉపయుక్తమైన భాషను ఆవిష్కరించుకొని నూత్న ఓజస్సును సంతరించుకున్నాడు శేషేంద్రశర్మ. తన ఇటీవలికావ్యాలు శేషజ్యోత్స్నలోగానీ మండే సూర్యుడులోగానీ ఈ నూతనోజస్సును సాధించాడని నిస్సంశయంగా వివరించడానికే పైన అంతగా చర్చ చేయవలసి వచ్చింది

ప్రాచ్యరంగా చలామణిలో ఉన్న సమకాలీన జీవద్భాషలోనుంచీ సమకాలీన కవితా పరిభాష నుంచీ మాత్రమేగాక తన సృజనాత్మక కృషిలో గత ఇరవై ఏళ్ళుగా తనకవితా హృదయాన్ని రూపొందిస్తున్న స్వీయకవితా పరిభాషనుంచీ (Poetic idiom) పలుకుబడినుంచీ ఈ స్వేచ్ఛను సాధించాడు. (పు. 9,10,11)... కవులు కవితారచనకు సద్యః స్ఫూర్తిగా ఉద్యుక్తులవడమే గాక సమాధి నిష్ఠలైక్షిణత్వంనుంచి ఆధునిక కవిత్వాన్ని సముద్ధరించగలిగే పద్ధతుల్లేవా అన్న గవేషణాయత్తచిత్తులు కావలసిన అవసరం ఉన్నదన్న చైతన్యంతో అతను నూత్న కవితా సృజనోత్సవానికి ప్రారంభం చేశాడు.

సమీప గతంలో ఆంధ్ర కవితా రంగం సకల కల్లోల భూయిష్ఠమైంది. దాని నుంచి విముక్తిని సాధించడానికి అందరూ తమకు తోచిన మార్గాలు సూచించ నారంభించారు. ఈ అన్వేషణలో కొందరు తమ సిద్ధాంతరాద్ధాంతాలను తిరగదోడి విమర్శ్యాసాలకు ఉపక్రమించారు. ఈ వైమర్శిక పరిశోధనలో సైతం శేషేంద్ర అత్యాధునిక విమర్శ మార్గాలను ఎంత పటిష్ఠంగా పరిశోధించాడో తెలుసుకుందుకు అతని 'రక్తరేఖ' ఎంతో సహాయపడుతుంది.... ఇట్టి నూతన విశ్వాసమూ నవీన సంవిధానమూ కలవారిలో నేడు ఉజ్జ్వలమైన కవితలు వెలార్చి "మండే సూర్యుడు"గా మనముందు నిలువెత్తు వ్యక్తిత్వంతో నిలిచినవాడు శేషేంద్ర! (పు. 16, 17) ... ఉత్తమ కవిత్వం గతాన్ని జీర్ణించుకుని వర్తమానంలో పుట్టిన సమకాలీన చైతన్యాన్ని గర్భీభూతం

చేసుకుని ఆగతం వైపుగా సామాజికులను నడిపించాలి. సరిగ్గా ఈ లక్ష్యలక్షణ సమన్వితమైన ఉత్తమకావ్యం శేషేంద్ర 1974లో విడుదల చేసిన "మండే సూర్యుడు". ఆ కావ్యం తన ఉన్నిద్ర తేజంతో, రాగల ఇరవయ్యొకటో శతాబ్దికి తన చూపుడు వేలు నిగిడిస్తోంది. ఆ కావ్య పరనమే ఈ రచయితకు ఉత్తేజమిచ్చి ఈ కవి పూర్వాపరాలను సమీక్షిస్తూ ఇంత సమాలోచనా రచనకు కారణభూతమైంది. ఆ కావ్యంలో వినూత్న కాంతులతో ప్రచలితమైన నూతన అభివ్యక్తులు సమకాలీన కవులపై విశిష్టమైన ప్రభావాన్ని కలిగించడమే ఆ కావ్యశక్తికి నికషోపలం.

'మండే సూర్యుడు' అనే కవిత 2-10-74న హైదరాబాదు రేడియోకవిసమ్మేళనలో మొదటిసారి ప్రసారమయింది. అప్పుడే గొప్ప సంచలనం రేపింది. ... అంతే కాదు శ్రీ శేషేంద్ర శేషజ్యోత్స్నలోని కవితలను ఆంధ్రప్రభలో ప్రచురిస్తున్నప్పటినుంచి యువతరం కవుల కవిత్వ రచనా మార్గం కొత్త పుంతలు త్రొక్క నారంభించింది. "మండే సూర్యుడు"లో యువతరం పూర్తిగా ప్రజ్వలితమైందని విస్పష్టంగా చెప్పడానికి ఎన్నో దాఖలాలున్నాయి.

ఉత్తమ కవితాకంఠం అర్భకులలో ప్రతిధ్వనులీనడం సాధారణమే. కానీ లబ్ధ ప్రతిష్ఠులు కూడా ఆ ప్రభావం నుంచి తప్పించుకోలేక పోయారంటే ఆ కవితాకంఠం ఎంతటి శక్తి సంపన్నమో వేరే చెప్పనక్కరలేదు. (పుటలు 23,24, 25, 26).

... శ్రీ శేషేంద్ర తన కవితల బయళ్ళ హొయళ్ళను విస్తృత పరుస్తూ పోతూఉంటే వాటిపై నడిచి వెళ్ళే సహృదయం ఆగి ఆగి, తూలుతూ త్రుళ్ళుతూ పడుతూ లేస్తూ ఉంటుంది. ఈ కవి అలవోకగా విసిరిన పదచిత్రాలవలలకు అడుగడుగునా తన పాదాలు చిక్కువడి వెలికి రాక తన్నుకోవలసి వస్తుంది. ఆగి చిక్కులు విడదీసుకుని ఆలోచనా పారమ్యంతో స్వాస్థ్యం పొందితే తప్ప ముందుకు సాగలేని అశక్తతకు లోనవుతుంది. ... జాగృతీకారకమైన ఋతుపవనాలు శేషేంద్ర కవితనిండా క్రిక్కిరిసి తమ పనిలో తాము నిమగ్నమై వెళ్ళిపోతున్నంత నిరాడంబరంగా సాగిపోతుంటాయి. ... తా మతి వీరశైవుల మని చెప్పుకుంటూ వీలయినప్పుడల్లా గుళ్లనీ గుళ్ళలో లింగాలనీ గుటకాయస్వాహా చేసే అప్రతిభ కబంధులు సాధించలేని ఉత్కృష్ట విజయాలను శేషేంద్ర కవిత సునాయాసంగా సాధించగలుగుతుంది. కేకలూ పెడబొబ్బలూ లేకుండా బాజాలు భజంత్రీలు లేకుండా కవిగా అతను "రెండు ముక్కలు చెపితే అవే రెండు రెక్కలై ఊహా విహాయసంలో కెగిరిపోయే" సిద్ధిపొదిన వాడు. (పుటలు 63,64,65). అడుగడుగుకీ అపేక్షించే అద్భుతావహ కవితా

మాధుర్యాలు శ్రీ శేషేంద్ర "శేషజ్యోత్స్న" నిండా నిబిడీకృతమై ఉన్నాయి. ఎన్నో ప్రతీకలు ఎన్నో పదచిత్రాలు అమూర్తభావనలను మూర్తిమంతంచేసి స్థూల దృష్టికి సైతం విస్పష్టంగా కనిపించే తళుకులెన్నో శేషజ్యోత్స్నలో చల్లని కిరణాలను క్రుమ్మరిస్తాయి. (పు. 70) ... సెసిల్ డెలెవిస్ ఇలా అన్నాడు, "Let logicians analyse the hive, our concern is with the honey". అల్లాంటి కవితా మధువును తనివితీరా గ్రోలదలచిన ఆధునిక కవితా ప్రియులకు ఈ "మండే సూర్యుడు"లో ప్రదర్శితమైన శేషేంద్ర జాలం అపార సంతృప్తి నిస్తుంది. కేవలం సంతృప్తినే కాదు, పారవశ్యాన్నే కలిగిస్తుంది. ఈమండే సూర్యుడు సహస్ర ముఖాలుగా దర్శనమిస్తాడు. శ్రమైక జీవన సౌందర్యానికి ప్రతీకగా నిలుస్తాడు. శ్రామిక జన విప్లవ సందోహానికి ప్రతినిదిగా దర్శనమిస్తాడు. పీడిత జన ముఖరేఖలలో విజృంభించే విస్ఫులింగాలకు మూర్తీభావంగాసాక్షాత్కరిస్తాడు. మండే సూర్యుడులోని కవితలలో ఎక్కడా సమాసాల ఆర్భాటం కనిపించదు. శబ్దాల వెర్రిమోత వినిపించదు. ఒకే నిడివిగల మాటల పేర్పుడు ద్వారా సాధించే నేలబారు శాబ్దిక సౌందర్యం కనిపించదు. కేవలం అల్పమైన అతిసామాన్యమైన పదాలద్వారా అనల్పమైన, అసామాన్యమైన భావసాంద్రతను కవి సాధిస్తాడు. నిబిడీకృతపదచిత్రశోభను వెలారుస్తాడు. (పుటలు 90, 91, 92)

...శ్రీ శేషేంద్ర శర్మ వినూత్న కవితా ప్రయోగంగా పదచిత్ర ప్రధాన సంవిధానంతో వెలువర్చిన "మండే సూర్యుడు" ఒక శక్తిమంతమైన ధ్వనిగా తెలుగు నేలలో అశేషప్రకంపనాలకు అవకాశమిచ్చింది. ధ్వని శక్తిమంతమైనప్పుడు ప్రతిధ్వనులు అసంఖ్యాకంగా ఉండడంలో అబ్బురమేమీలేదు. ... సమకాలీన సమష్టి స్వరూపంలో ప్రతిధ్వనులు నిందార్హాలుకావు. ఈ'మండే సూర్యుడు' కొత్తగా కలంపట్టిన యువకవులలో అసంఖ్యాక ప్రతిధ్వనులు కలిగించింది. అంతతో ఆగక పటిష్ఠులై సోదరకవులను కూడా ప్రభావితంచేయడం ఆ కావ్యంలో గల విశిష్ట విద్యుత్తేజానికి తార్కాణం ...మరీ విడ్డూరమైన సంగతి మరోటి మనవి చేస్తాను. "ఎండల జెండాలు" అనే శేషేంద్ర కవిత 'మండే సూర్యుడు'లో సంకలితమైంది (పు. 70). అందులో ఈ పంక్తులు చాలా చాలా ప్రఖ్యాతమయ్యాయి. "ఎన్నాళ్ళోపెంచి/పోగుచేసిన వాళ్ళు/ ఎండల తలపాగాలతో/ వెళ్ళి పోతూ ఉంటే /మిలియన్ల గొంతులెత్తి / ఏడుస్తున్నవి ధాన్యపురాసులు" (పుటలు 117, 120) ... "చీకటీ నిశ్శబ్దమూ పెనవేసుకున్న / ఈ అద్వైతంలో నిద్రలేస్తోంది నా మనస్సు /... ఫుట్‌పాత్ మీద కూర్చొని కన్నుల్లో కలల్ని

/ గిన్నెల్లో హిమలేహ్యంలా /చెంచాల చుంచువులతో ఆస్వాదిస్తున్నాను." ఈ కవిత ఆధునిక కవితల్లో కూడా ఒక విభిన్న సాంప్రదాయాన్ని తనకు తానుగా ప్రతిష్ఠించుకుంటోంది. ఈ కవితలో పాదాల మధ్యలో వాక్యాలు పూర్తయి కొత్తవాక్యాలు ప్రారంభమవుతాయి. ప్రతిపాదంలోనూ పదచిత్రాలు అనేకమై పాఠక హృదయానికి ఉత్తుంగ లంఘనం కలిగించే సంవిధానం తెలుగు కవితకింకా కొత్తదినుసు.

ఇలాంటి మనోహర అభివ్యక్తులు చదువరి పంచేంద్రియాలను ఏదో మాయాజాలంతో కట్టి ఒక ఐంద్రజాలిక స్ఫూర్తిని కలిగించడం శేషేంద్ర కవి సాధించిన సంవిధానం.

శ్రీ శేషేంద్ర అచ్చమైన కవితా హృదయంతో తెలుగు భాషకు చేకూర్చిన అతినవీన కవితాలంకారాలకు "మండే సూర్యుడు" ఒక రత్న మంజూష. నేటి అంతర్జాతీయ కళా ప్రపంచంలో అతి నవీవ సంవిధాన వాదాలైన పదచిత్రవాదమూ (Imagism) ప్రతీకవాదమూ (Symbolism) అభివ్యక్తివాదము (Expressionism) వంటి సకలధోరణులనూ చక్కగా ఆకళింపుకున్నాడు. ఆధునిక యూరోపియన్, అమెరికన్ కవితా వాహినిలో క్షుణ్ణంగా జలకాలాడేడు. నేటి తెలుగు కవులలో కొందరీ ఆధునిక ధోరణులను జీర్ణం చేసుకోలేని అతిపేదలై అరిగీ అరగని అనుకరణలను దింపుతున్నారు.

ఇలాంటి వారందరికీ శేషేంద్రకవిత ఒక శక్తిమంతమైన దీపస్తంభం. శక్తి రాహిత్యానికి ప్రతివాదం. ముమ్మూర్తులా ఆధునికత్వానికి తెలుగు కవితా రంగంలో డుసరి ప్రతినిధి "మండే సూర్యు"డే. (పుటలు 131, 133, 138, 139).

...ఆయన కొకలేఖ వ్రాశాను. "నాకు శేషజ్యోత్స్న గొప్ప ఆమెత చేసింది. ఇప్పుడీ "మండే సూర్యుడు" మరింత గొప్పవిందు. నేను చాలా కాలంగా మంచి కవిత కోసం శూన్యంలో వెదుకుతున్నాను.... నా అన్వేషణ శూన్యంలోనే మిగిలిపోతూ వచ్చింది. అలాంటి నాకు ఒక తీయని గమ్యాన్ని ప్రసాదించింది మీ కవిత - ఒక హాయినిచ్చే చలివేంద్ర! మీ కవితలు చదువుతూంటే నా గుండెల్ని నేనే విప్పి చదువుకుంటున్న అనుభూతి పొందాను... తెలుగు కవితా సౌరభోపేతమైన ఇమేజిస్టు పూలచెట్లు వేళ్ళ మీద లెక్కింప దగినంతగా కొద్దిగా మాత్రమే ఉన్నాయి. అందులో మీ కవిత సింహాచలం సంపెంగ చెట్టు! ... ఉప్పాడ సముద్రంలో పాతికేళ్ళ క్రితం మనం ఇసుకలో పారవేసుకున్న కలల్ని అప్పుడప్పుడూ ఇంకా వెతుకుతూనే ఉంటాను. .. ఆఖరికింత కాలానికి మీరు "మండే సూర్యు"డై సాక్షాత్కరించి అక్షర జలధి నుంచి ఆవిర్లు పీల్చుకుని నా హృదయంపై అమృతాన్ని వర్షించారు...." అంటూ ఆనాటి

లేఖలో ఒక రేఖగా మలచిన నా తొలి ఆనందాన్ని ఈ వ్యాఖ్యద్వారా ఆవిష్కరించి కొంతయినా కృతార్థుడ్నయ్యానన్న సంతృప్తితో నా ఈ సమాలోచనను ముగించబోతున్నాను. ... ఒక మాట చెప్పాలని ఉంది. శేషేంద్ర శర్మ నాకు జగన్నాథ పండిత రాయల పోలికలతో పుట్టిన ఆధునిక కవితావతారంగా దర్శనమిస్తాడు... జగన్నాథ పండిత రాయల వలెనే శేషేంద్ర పండిత కవి కూడా ఆధునిక లక్ష్యలక్షణ సమన్విత ప్రాయమన దగిన కావ్య నిర్మాణ సామర్థ్యం ప్రదర్శించాడు. ఆయన వలెనే ఈయన కూడ ఒక కవితా యుగానికి మంగళవాచకాన్ని ఆగామి కవితాయుగానికి ఆహ్వాన గీతికను ఏకదేశంగా ప్రతిష్ఠించాడు. మూడు పాతికలు గడిచి నూతన శతాబ్దికి అంగలారుస్తున్న ఆధునిక యుగంలో నూత్న కవితా అధిష్ఠానంగా తన శేషేంద్ర జాలాన్ని ప్రదర్శిస్తున్నాడు. జగన్నాథ పండిత రాయలవలెనే ఈ ఆధునిక యుగంలో ఆత్మవిశ్వాసవ్యగ్రతతో కవితా పతాక నిలుపుతున్నాడు. ... జగన్నాథుని మాటలతో శేషేంద్రుని ... "మనన తరితీర్ణ విద్యార్ణవో శేషేంద్ర కవిపండిత నరేంద్రః" అని అభినందించడానికి ఎవరూ సందేహించనక్కరలేదు. (పుటలు. 146, 157, 153, 154)

(Excerpts from "Seshendrajalam" authored by the renoqwned Progressive Poet Sri Avantsa Somasundar, Kalakeli Publications, published in 1976).

## "21వ శతాబ్దపు ఉషస్తార" శేషేంద్ర

(డా॥ మిరియాల రామకృష్ణ రచిత "సోమసుందర్ పరిణామక్రమం" గ్రంథంనుంచి పుటలు 132, 133)

అయితే వారిని గురించి అధ్యయనం సాగిస్తూ నోట్సులు రాసుకుంటూ కులాయంలో ఉండగానే మరొక చారిత్రక విశేషం జరిగి, తానీవలికి రావలసి వచ్చింది.

ఆ విభాతంలో ఒక కొత్త గొంతు కోకిల లాగా తెలుగు కవితా నందనంలో కుహూరాగం తీస్తోంది. అది అపూర్వశ్రుతిలో రాగమధురంగా ఉంది. అయితే గొంతు పాతదే. స్వరమే కొత్తది. ఈ పరిణామం సాధించిన ఆ కవి తనకు చాలా కాలం నుంచీ పరిచితుడే! చాలా దూరం తనతో నడిచినవాడే!

ఇంతకూ అతడు గుంటూరు శేషేంద్ర శర్మగారే. ఒకప్పుడు పిఠాపురంలో ఉద్యోగరీత్యా ఉండి వెళ్ళిన శేషేంద్ర ఇప్పుడు పద్య కవిత్వం వదిలేశాడు.

1974లో శేషేంద్ర 'మండే సూర్యుడు' అనే తన కొత్త కావ్యాన్నీ, 'రక్తరేఖ' అనే డైరీని తనకు పంపాడు. వాటిని చదివితే ఒక సొంత గొంతు వినిపించింది. వెంటనే అతని కవిత్వాన్ని విశ్లేషించాలనిపించింది... అడ్డేముంది?

ప్రతీకవాదం, పదచిత్రవాదం, అభివ్యక్తివాదం అనే పాశ్చాత్య సంవిధానాల్ని సరళీకరించుకుని తెలుగులో ఒక మౌలిక దోరణిలో మార్క్సిస్టు దృక్పథంతో రాస్తున్నారు శేషేంద్ర. అది తనకు నచ్చింది. 150 పేజీల్లో తన స్పందనని గ్రంథస్థం చేశారు సోమసుందర్. దానిపేరే శేషేంద్రజాలం! అప్పటికే తిలక్, నారాయణబాబుల కవిత్వాల గురించి తాను రాసిన పరిశీలనలు పత్రికల్లో వచ్చేశాయి. అయితే అవియింకా పుస్తక రూపం ధరించలేదు. శేషేంద్రజాలం పుస్తకరూపం దాల్చడానికి అవకాశాలు కలిసివచ్చాయి ముందుగా. ఒక దశాబ్దం తర్వాత తాజాగా వచ్చిన ఈ పుస్తకంతో సోసు తిరిగి రంగావతరణం చేశారు. ఒక ఆధునికుడి ఖండికల్ని సూక్ష్మాతి సూక్ష్మంగా పరిశీలించి వివరించే క్రమానికి నాందిగా శేషేంద్రజాలం (1976) భాసించింది.

అష్టాధ్యాయిగా ఆవిర్భవించిన 'శేషేంద్ర జాలం'లో శేషజ్యోత్స్న నుంచి మండే సూర్యుడుగా ఆకవి ఎలా పరిణామం చెందాడో వివరించడానికి సోసు శ్రమ ఫలించింది. ప్రపంచ విఖ్యాత విమర్శకుల నందరినీ ఆ గ్రంధం ద్వారా తెలుగు వీథుల్లోకి దింపగలిగాడు సోసు. ప్రమాణాలు మారాయి.

"మండే సూర్యుడు" లో ఉన్న కవితల్ని పారప్రవచనం చేసే తీరులో వ్యాఖ్యానం సాగించడం వల్ల ఆధునికతకు మంచి రోజులొచ్చాయి. ఆర్చిబాల్డ్ మెక్లీష్ సి.ఎం.బౌరా, స్టిఫెన్ స్పెండర్, ఎలిజబెత్ డ్రూ, టి.ఎస్. ఇలియట్, జీన్‌పాల్ సార్త్ర్, గెథే, రాబర్ట్ ఫ్రాస్టు, మలార్మే, ఆడెన్, పాల్ వేలరీ, హెవలాక్ ఎల్లిస్, క్రిష్టఫర్ కాడ్వెల్లు. డిలాన్ థామ్సన్, కాల్‌రిడ్జి, సిసిల్ డెలెవిస్, మయ కోవస్కీ, ఎజ్రాపౌండు, పాబ్లో నెరూడా వంటి మేధావుల విడిదిగా ఆ గ్రంధం భాసించింది. ఇంచుమించు తానూ శేషేంద్ర కూడా ఈ మేధావుల్ని అధ్యయనం చేసినవారే.

'21వ శతాబ్దపు ఉషస్సార'గా శేషేంద్రని గుర్తించడం సోసు ఉదారబుద్ధికీ స్నేహానికీ సహనానికీ మేలి గురులుగా ఈ గ్రంథంలో మిలమిలలాడాయి.

*రచన : 25–09–1995*

*(డా॥ మిరియాల రామకృష్ణగారి సౌజన్యంతో)*

# మహాకవి

# శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మగారికి తెలుగు విశ్వవిద్యాలయం డాక్టరేట్ ప్రదానం చేసిన సందర్భంలో ఇచ్చిన ప్రశంసాపత్రం

అధ్యక్ష మహాశయా!

తెలుగు సాహిత్యంలో మహాకవి శేషేంద్ర ప్రవేశమొక జాజ్జ్వల్యమానమైన నూతన్న శకాన్నిఆవిష్కరించింది. ఆయన కావ్య ద్రష్టృత్వం మానవీయ భవిష్యత్తును, గమ్యాన్ని ఎప్పుడు స్పృశిస్తుందో అప్పుడంతా ఒక ఉదాత్త గంభీర స్వరంలో దాన్ని ఆవిష్కరిస్తుంది.

ఆయన వ్రాసిన 'నా దేశం - నా ప్రజలు' అన్న ఆధునిక మహేతిహాస గ్రీకు భాషానువాద పీఠికలో విశ్వ విఖ్యాత గ్రీకు మహాకవి నిఖిఫోరస్ వృత్తాకోస్ ఇలా అన్నారు.

Personally I would compare the pain and anguish of the poet with the one of LOUTRE -MONT ( The founder of surrealism) in his lyric 'MALD-AURORE' The difference is that Seshenra's protest is not made in the void. He walks firmly on the soil. At times we observe in his poem a biblical and prophetic tone which attracts us'.

ఇలాగే హిందీ, ఉర్దూ, బంగ్లా అనేక భారతీయ భాషల్లోకి అనువదించపబడిన శేషేంద్ర కావ్యాలను చదివిన ఆయా భాషా కవి విమర్శకులు అపార ప్రశంసా వర్షాలను కురిపించారు

ఈ శతాబ్ది సప్తమ దశకం భారతీయ సాహితీ చరిత్రలో చాలా మహత్వపూర్ణమైనది. శేషేంద్ర వ్రాసిన 'నా దేశం - నా ప్రజలు' అన్న మహేతిహాసం మన భాషలోనే కాక ఇతర రాష్ట్రభాషల్లో కూడా ఒక కొత్త మలుపును సృష్టించింది. ఆయన వ్రాసిన మండేసూర్యుడు, గొరిల్లా, నా దేశం - నా ప్రజలు అనే కావ్యాలు శ్రీశ్రీ తెచ్చిన నూత్న కావ్య వస్తువునకు ఆనాడు లేని కావ్యభివ్యక్తిని తొలిసారిగా 40 ఏళ్ళ తరువాత సంఘటించాయి. ఇదొక చారిత్రాత్మక సంఘటన. ఆయనకు పూర్వం తెలుగులో కవిత్వం పేరుతో నడుస్తున్న కావ్యాత్మకతా రహిత కావ్య రచనాధోరణి ఆగిపోయి ఈ కావ్యాల మూలంగా మొదటిసారిగా తెలుగులో కావ్యాత్మక రచనా శైలి సృష్టించబడింది. ఈ నూత్న కావ్యాభివ్యక్తే నేటి రంగంలో ప్రవర్తమానంగా వుంది. కనుకనే ఆధునిక సాహితీ యుగంలో ఒక వినూత్న మార్గస్రష్టగా మహాకవి శేషేంద్రకు స్థానం ఉంది.

శేషేంద్ర రచిత శ్రామిక - ప్రేమిక తత్వాలు పరిమళించే మహేతిహాసం, భావ కవితా ఉద్యమం నుండి అభ్యుదయోద్యమం దాకా భారతీయ సాహిత్యం చేసిన ఒక మహోజ్వల యాత్రకు సంకేతంగా దాన్ని ప్రముఖ భారతీయ విమర్శకులభివర్ణించారు. 20-10-1927 నాడు నెల్లూరు జిల్లాలో జన్మించి నాల్గుదశాబ్దాలకు పైగా ఈ మహాకవి సృజించిన 40 గ్రంథాలు ఆయనను ఒక మహాకవిని, విమర్శకుణ్ణి చేశాయి. ఆయన శాస్త్ర వైదుష్యం నుండి పుట్టిన 'షోడశి' వాల్మీకి రామాయణంలోని సుందరకాండకు ఒక నూత్న తాంత్రిక భాష్యము. అలాగే హర్షభట్టు విరచిత నైషధీయ చరితకు తాంత్రిక వ్యాఖ్యానంగా వచ్చినది 'స్వర్ణహంస'. ఈ రెండూ పండిత లోకాన్ని ఆశ్చర్యచకితం చేశాయి

ప్రాచీన భారతీయ కావ్యశాస్త్ర సిద్ధాంతాలను, ఆధునిక పాశ్చాత్య విమర్శను, గ్రీకు - రోమన్ కావ్యశాస్త్ర సంప్రదాయాలను మార్క్సిస్టు విమర్శ పంథాను తులనాత్మక పరిశీలన చేస్తూ రచించిన 'కవిసేన మేనిఫెస్టో' అన్న ఆధునిక కావ్య శాస్త్ర గ్రంథం నేటి వర్తమాన విమర్శను మరొక మలుపు తిప్పింది. ఆయన ప్రతిభా వైదుష్యాల కీర్తి దూర విదూర ప్రాంతాలకు వ్యాపించి తత్ఫలితంగా 1970లో జర్మనిలో 'గొటెంజెన్' నగరంలో వున్న ఇండోలాజికల్ రీసెర్చ్ యూనివర్సిటీ

వారిచేత అహ్వానింపబడి అక్కడ పండిత సదస్సులో 'కాళిదాసు మేఘదూతానికి వాల్మీకి రామాయణానికి వున్న సంబంధం' అన్న సిద్ధాంత వ్యాసాన్ని సమర్పించారు. 1986లో ఉజ్జయనీలోని కాళిదాసు అకాడమీ వారిచే అహ్వానింపబడి 'ఇద్దరు ఋషులు - ఒక కవి' అనే శీర్షికతో వాల్మీకి, వ్యాస, కాళిదాసుల కవిత్వానుబంధాలను వివరిస్తూ ఒక పరిశోధనా పత్రం సమర్పించారు. 1979లో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం(తిరుపతి)లో విజిటింగ్ ప్రొఫెసర్‌గా ఆహ్వానించబడ్డారు. ఐరోపా సాంస్కృతికకేంద్రం, డెల్హీలో (గ్రీస్) ఏర్పాటయిన అంతర్జాతీయ సాహిత్య గోష్ఠికి అహ్వానితులై 'ప్రాచీన గ్రీకు నాటకం - భారతీయ సంస్కృత నాటకం' అన్న విషయం మీద ప్రసంగించారు.

భారత ప్రభుత్వ హోం శాఖకు సంబంధించిన అధికార భాషా కమిటీ పక్షాన కలకత్తాలో 1994వ సంవత్సరంలో నిర్వహింపబడిన అఖిల భారత భాషా సమ్మేళనంలో ఆయనను భారతీత సాహిత్యానికి నూత్న దిగ్దర్శనం ప్రసాదించాడనీ యుగ ప్రవర్తకుడనీ శేషేంద్రను భారతేందు హరిశ్చంద్ర వంటి మనీషుల సమక్షంలో చేర్చాలని ప్రశంసిస్తూ పశ్చిమ బెంగాల్‌రాజ్యపాల్‌చేత ''రాష్ట్రేందు'' బిరుదు ప్రదానం చేయబడింది

అలాంటి అద్వితీయ ప్రతిభావంతులైన శ్రీ శేషేంద్రగారికి ఈ గౌరవ డాక్టరేట్ పట్టానిచ్చి సత్కరించడం ఆంధ్రభాషను గౌరవించటంగా ఈ విశ్వ విద్యాలయం భావిస్తున్నది.

వారికి తెలుగు విశ్వ విద్యాలయం పక్షాన గౌరవ డి లిట్ డిగ్రీ ప్రదానం చెయ్యవలసిందిగా ఛాన్సలర్‌గారిని ప్రార్థిస్తున్నాను.

**4వ స్నాతకోత్సవం**

**తెలుగు విశ్వ విద్యాలయం**

**అక్టోబరు 27, 1994.**

# గురజాడ అవార్డు - 1996

# శేషేంద్ర ప్రశస్తి

అశేషపాఠక హృదయ పీఠికల నధిష్ఠించిన యుగకవి శ్రీ శేషేంద్రకు యుగకర్త, మహాకవి గురజాడ పురస్కారాన్ని సమర్పిస్తున్న షోడశవత్సర సహృదయ సాహితీ కన్యధన్య. తెలుగు సాహిత్యంలో శ్రీ శేషేంద్ర ప్రవేశం జాజ్వల్య మానమైన ఒక నవ్య శకాన్ని అవిష్కరించింది.

శేషేంద్ర వ్రాసిన ''నా దేశం నా ప్రజలు'' అన్న మహేతి హాసం ఆధునిక మహాభారతమై తెలుగు నాడును వెలుగు నాడుగా చేసి భారతదేశ మంతటా ఆ కాంతులను ప్రసరింపజేసింది. ఆయన కావ్యాలు 'మండే సూర్యుడు' 'గొరిల్లా' 'నా దేశం - నా ప్రజలు' శ్రీ శ్రీ తెచ్చిన అధునాతన కావ్య వస్తువునకు ఆనాడు లేని కావ్యాభివ్యక్తిని తొలిసారిగా నలభై ఏళ్ళ తరువాత సంతరించాయి ఇదొక చరిత్రాత్మక సంఘటన. ఈ నూతన కావ్యాభివ్యక్తే నేటి కవితారంగంలో ప్రవర్త మానంగా ఉంది.

కవి సమ్రాట్ శ్రీ విశ్వనాథ, మహాకవి శ్రీ శ్రీల్లాగ సమకాలీన తెలుగు సాహిత్యంలో నిశ్చయంగా శేషేంద్ర ఓ జీనియస్. బహుముఖ ప్రతిభాశాలి శేషేంద్రలాగ అంతర్జాతీయ భావనను రాజకీయేతర స్పృహతో సాహిత్యంలో సంస్థాపించి, సుస్థిరంచేసిన సమకాలీన కవి మరొకరు లేరని సాహితీవిమర్శకుల అమూల్యాభిప్రాయం. ఆధునిక సాహిత్య స్పృహకు అపర భగీరథుడాయన. కాలాన్ని మలచిన, కాలం మరవలేని మహాకవి శేషేంద్ర. జనవంశమైన హరివంశం శేషేంద్ర. శేషేంద్ర విరచిత శ్రామిక, ప్రేమిక తత్వాలు పరిమళించే కావ్యకుసుమాలు. భావకవితా ఉద్యమంనుండి అభ్యుదయోద్యమం వరకు భారతీయ సాహిత్యం చేసిన ఒక మహోజ్వల ప్రస్థానానికి అవి నిలవెత్తు సంతకాలు, సమున్నత సంకేతాలు.

ప్రాచీన భారతీయ కావ్య శాస్త్ర సిద్ధాంతాలను. ఆదునిక పాశ్చాత్య విమర్శను , గ్రీకు రోమన్‌కావ్య శాస్త్ర సంప్రదాయాలను మార్క్సిస్టు విమర్శ పంథాను తులనాత్మక పరిశీలన చేస్తూ శేషేంద్ర రచించిన 'కవిసేన మ్యానిఫెస్టో' అన్న ఆధునిక కావ్య శాస్త్రగ్రంథం నేటి వర్తమాన విమర్శను మరవురాని మలుపుతిప్పింది.

ఆయన అపార శాస్త్ర వైదుష్యంనుండి పుట్టిన 'షోడకి' వాల్మీకి రామాయణంలోని సుందరకాండకు ఒక వినూత్న తాంత్రిక భాష్యము. అలాగే హర్షభట్టుని నైషధీయ చరితకు మంత్ర, తంత్ర , యోగ వేదాంత దీపిక వారి 'స్వర్ణహంస'.శేషేంద్ర పద్యకావ్యం ఋతుఘోష ఆయన ఆత్మఘోషగా వాసికెక్కింది. ఈ గ్రంథాలు విశ్వనాథ శ్రీశ్రీ వంటి కవి పండితులను ఆశ్చర్యచకితుల్ని చేశాయి

కవిత్వానికి నిర్వచనం శేషేంద్ర. ఆత్మ విశ్వాసానికి ఆలంబనం శేషేంద్ర.
''నేనింతా ఒక పిడికెడు మట్టేకావచ్చు కానీ కలమెత్తితే నాకు ఒక దేశపు జెండా కున్నంత పొగరుంది''

అనడంలోనే ఆయన అభివ్యక్తి ఔన్నత్యం ఉంది.

'ధరిత్రిని హలం దున్నితే అప్పుడవుతుంది అది ఒకదేశం
ధరిత్రిని కలం దున్నితే అప్పడు అవుతుంది అది ఒక ఇతిహాసం'

ఇలాంటి శేషేంద్ర పసిడి పలుకులు ఎన్నో ఎన్నెన్నో!

''పుట్టిన నాటి 'శేషభట్టు' - ఈ నాటి విశేష కవిత్వపుగట్టు''

శేషేంద్ర పద్యంలోనే ఆయన విశిష్ట మూర్తిమత్వం రూపుకడుతుంది.

''అదియొక ధర్మదీక్ష పరమార్థమహోన్నత శృంగసంతతిన్
బ్రతుకు నపేక్ష విశ్వ సమరమ్ము జయించుట కాత్మశిక్ష ఆ
మధుహృదయప్రసూన కుహరీ విహరీకృత వహ్నికీల తా
నదరదు, దేనికిం బెదర దారదు మారదు హోరు గాలికిన్''

అందరూ ఇంటిగెలిచి రచ్చగెలిస్తే, శేషేంద్ర రచ్చగెలిచి ఇంటగెలిచారు.

ఈ మండేసూర్యుడికి, పున్నమి జాబిల్లికి. కవితారంగవల్లికి, యుగకవికి. యుగ వ్యాఖ్యాతకు. యుగ భాష్యకారునికి ఆయన చేసిన సాహిత్య సేవకు ప్రస్తుతిగా ఈ ప్రతిష్ఠాత్మక గురజాడ పురస్కారాన్ని సమర్పిస్తున్నాము.

సహృదయ భవన్
విశాఖపట్నం- 12
21-9-1996

ఇట్లు
**సహృదయ సాహితి**

**ఆధునిక వాగనుశాసనుడు శ్రీ శేషేంద్ర**

"గుంటూరు శేషేంద్ర శర్మ నా దేశం నా ప్రజలు (1975) ఆధునిక ఇతిహాసంగా చెప్పబడింది. అభివ్యక్తిలో, ఆలంకారికతలో, వస్తు విన్యాసంలో కవి తనదైన వ్యక్తిత్వాన్ని ముద్రించుకున్నాడు. విప్లవభాషా విధాతగా పేరుగన్నాడు. ఈయన కవిసేన మేనిఫెస్టో (1977) పేరుతో ఆధునిక కావ్యశాస్త్రాన్ని కూడా రచించి నేటి యువతరాన్ని ఆకర్షిస్తున్నాడు. పద్యాల్లో, వచన కవితా ప్రక్రియలో కావ్యాలనేకంగా రచిస్తూ సమకాలిక కవితారంగంలో శిఖరాయమానంగా వెలుగుతున్నాడు. కొంగ్రొత్త ప్రయోగాలతో కావ్యభాషా స్వరూపంలో మార్పుతెస్తున్న ఆధునిక వాగనుశాసనుడు శేషేంద్ర."

**ఆచార్య పేర్వారం జగన్నాథం**
సంపాదకుడు
అభ్యుదయ కవిత్వానంతర ధోరణులు, (ప్రచురణ 1987)
(మాజీ వైస్ ఛాన్సలర్, తెలుగు యూనివర్శిటీ)

# अखिल भारतीय राजभाषा सम्मेलन के अवसर पर

## 24–25 फरवरी 1994, को
## 'राष्ट्रीय सास्कृतिक एकता पुरस्कार' से सम्मानित
## 'राष्ट्रेन्दु' महाकवि शेषेन्द्र शर्मा

हमारे देश की राष्ट्रीय सस्कृति की वाहक होने के आलोक मे हिन्दी इसकी भौगोलिक ही नही वरन् ऐतिहासिक राजनैतिक, साहित्यिक–धार्मिक अर्थात् सर्वागीण सास्कृतिक एकता की कड़ी है, एक ऐसे सूत्र के समान है जो समस्त भारतीय भाषाओ को माला का स्वरूप प्रदान करता है। साहित्य समाज को दिशा निर्देश देता है। इसमे सत्य, अनुभव, जीवन और उपदेश होता है। साहित्यकार समाज का शलाका पुरुष होता है।

आन्ध्र प्रदेश के नेल्लुर जनपद के तोटपल्लि गुडूर मे श्रीमती अम्मायम्मा एवम् श्री सुब्रमण्यम् शर्मा के घर 20 अक्टूबर 1927 को जन्मे श्री शेषेन्द्र शर्मा ने स्थानीय विद्यालयो से शिक्षा आरम्भ कर मद्रास विश्वविद्यालय से विधि स्नातक की उपाधि अर्जित की।प्रान्तीय सेवा मे रहते हुए हैदराबाद नगर के म्युनिसिपल कंमिश्नर पद से सेवा निवृत हुए। राष्ट्रीय साम्य और सारल्य से प्रतिबद्ध महाकवि शेषेन्द्र शर्मा ने काव्य मे आधुनिक महाभारत, सौन्दर्य शास्त्र. कवि सेना मैनिफैस्टो, अनुसन्धान शास्त्र मे षोडशी जैसी लगभग 40 कृतियो के माध्यम से इन सभी क्षेत्रो मे नये कीर्तिमान एव मानदण्ड स्थापित किये। सर्वहारा एव वाम के पक्षधर होते हुए भी श्री शर्मा ने उस युग मे राष्ट्रीयता का पक्ष लिया जब इसका नाम तक लेना दकियानूसी माना जाता था। वैचारिक एव लेखकीय विरोधो, प्रतिरोधो के होते हुए भी इनसे टक्कर ले कर शेषन्द्र शर्मा ने भारतीय साहित्य

को नयी दिशा दी। युग प्रवर्तक शेषेन्द्र को भारतेन्दु हरिश्चन्द्र जैसे मनीषियो के समकक्ष रखा जा सकता है। देश के एक मात्र ऐसे चिन्तक जो 'कविसेना' की परिकल्पना प्रस्तुत कर एक भरा पुरा आन्दोलन खडा कर देते है। 'राष्ट्रेन्दु' शेषेन्द्र आरम्भ से ही द्विभाषीकरण के पक्षधर रहे हैं तभी तो इनकी अधिकाश कृतियो के प्रथम सस्करण द्विभाषी ही प्रकाशित हुए। तेलुगू -अग्रेज़ी, तेलगु-हिन्दी आदि।

सर्व कार्य सेवक होते हुए भी शेषेन्द्र अपने लेखन, अध्ययन और व्यवहार मे सत्य पर अडिग रहे। इनके हृदयकी अग्नि कही 'आधुनिक महाभारत के 'मेरी धरती मेरे लोग' पर्व के रूप मे प्रस्फुटित होती है, कहीं 'खेतों की पुकार' बनती है और कही वह 'गुरिल्ला' का रूप धारण कर लेती है। देश काल की सीमाओ से परे इनके साहित्य का अनुवाद हिन्दी, तमिल, मलयालम, बगला, उर्दू जैसी अधिकाश भारतीय भाषाओ के साथ-साथ अग्रेजी, ग्रीक और फ्रेच मे हो चुका हैं।

विश्व के अधिकाश अचलो का भ्रमण कर चुके शेषेन्द्र प्रत्येक दृष्टि से किसी भी मानदण्ड के आधार पर हमारी राष्ट्रीय सस्कृति के सेतु है और इन्हें सम्मानित कर यह सम्मेलन अपने आपको गौरवान्वित अनुभव करता है।

*(नगर राजभाषा कार्यान्वयन समिति, कलकत्ता)*

తెలుగు అనువాదము

అఖిల భారతీయ రాజభాషా సమ్మేళన సందర్భంలో

24-25 ఫిబ్రవరి 1994

## "రాష్ట్రీయ సాంస్కృతిక ఏకతా పురస్కార్" "రాష్ట్రేందు" బిరుదుతో మహాకవి శేషేంద్ర శర్మకు సన్మానము

మనదేశపు జాతీయ సంస్కృతికి వాహకమైన కారణం చేత హిందీ కేవలం భౌగోళికంగానే గాక, చారిత్రిక రాజకీయ సాహిత్య మత సంబంధ, అంటే సర్వాంగీణ సాంస్కృతిక ఏకతను బంధించే గొలుసు. సమస్త భారతీయ భాషల్నీ ఒక్క మాలగా అల్లే దారము హిందీ. సాహిత్యం సమాజానికి దిశా నిర్దేశం చేస్తుంది. అందులో సత్యము, అనుభవము, జీవనము, ఉపదేశము ఉన్నాయి. సాహిత్యకర్త సమాజానికి వెన్నెముక అవుతాడు.

ఆంధ్రప్రదేశ్ నెల్లూరు ప్రాంతంలో తోటపల్లి గూడూరు గ్రామంలో జననీ జనకులైన శ్రీమతి అమ్మాయమ్మ శ్రీ సుబ్రహ్మణ్య శర్మలకు 20-10-1927న శ్రీ శేషేంద్ర శర్మ జన్మించాడు. స్థానిక విద్యాలయాల్లో విద్యాభ్యాసం ముగించి మద్రాసులో లాకాలేజీలో లా డిగ్రీ ఆర్జించాడు. స్థానీయ రాజ్య సర్కారు సర్వీసులో పనిచేస్తూ హైదరాబాదు కార్పొరేషన్లో మునిసిపల్ కమీషనర్గా రిటైరయ్యాడు. జాతీయత, సామ్యవాదాలకు ప్రతిబద్ధుడైన మహాకవి శేషేంద్ర శర్మ కావ్యాల్లో ఆధునిక మహాభారతము, కావ్యశాస్త్రాల్లో కవిసేన మేనిఫెస్టో అనే ఆధునిక కావ్యశాస్త్రము, వ్యాఖ్యా గ్రంథాల్లో "షోడశి" లాంటివి సుమారు 40 కృతులు వ్రాసి ఆయాక్షేత్రాల్లో ప్రామాణిక మానదండాలను నెలకొల్పిన కీర్తి గడించాడు. పీడిత ప్రజల పక్షము వాడైనప్పటికీ, జాతీయతను విడనాడలేదు. వైచారికంగానూ రచయితగానూ సమాజంలో విరోధ ప్రతిరోధాలున్నప్పటికీ వాటిని ఎదుర్కొని భారతీయ సాహిత్యానికి నూతన దిశాప్రదానం చేశాడు. యుగప్రవర్తకుడైన శేషేంద్ర భారతేందు హరిశ్చంద్రలాంటి మనీషుల సమకక్షలో చేర్చదగినవాడు. కవిసేన అనే భావ పరికల్పన చేసి ఒక గొప్ప ఉద్యమాన్ని నడిపిన శేషేంద్ర దేశంలో అద్వితీయ వ్యక్తి. "రాష్ట్రేందు' శేషేంద్ర మొదటి నుంచీ ద్విభాషీకరణ పద్ధతి అవలంబించాడు. అందుచేతనే తన

కావ్యకృతులను మూలభాష అనువాద భాషలతో ద్విభాషాకృతులుగా ముద్రించాడు. అంటే తెలుగు - ఇంగ్లీషు, తెలుగు - హిందీ, ఇలా.

సర్కారు సర్వీసులో ఉన్నప్పటికీ, తన అధ్యయనము తన రచనా వ్యాసంగము ఇత్యాది వ్యవహారాల్లో సత్య నిష్ఠుడై నిలిచాడు. ఈయన హృదయాన్ని ఒక చోట "ఆధునిక మహాభారతం"లోని "నాదేశం నా ప్రజలు" గా ప్రస్ఫుటితమైతే, ఒక చోట "ఖేలోంకీ పుకార్" (పొలాల పిలుపు) అవుతుంది. మరొక చోట "గొరిల్లా" రూపాన్ని ధరిస్తుంది. దేశ కాలాలకు అతీతమైనక ఆయన సాహిత్యం హిందీ, తమిళము, మళయాళము, బంగ్లా, ఉర్దూ లాంటి అనేక భారతీయ భాషల్లోకి, ఇంగ్లీషు, గ్రీకు, ఫ్రెంచి లాంటి విదేశీయ భాషల్లోకి అనూదితమయింది.

ప్రపంచంలో అనేక దేశాలు పర్యటించిన శేషేంద్ర ఏ దృష్టితో చూచినా ఏ మానదండంతో కొలిచినా మన దేశ సంస్కృతికి సేతువు. అలాంటి వ్యక్తిని సన్మానించి ఈ సమ్మేళనము తనని తాను గౌరవించుకున్నట్లు భావిస్తోంది.

*(నగర రాజభాషా కార్యాన్వయన సమితి , కలకత్తా)*

**కవి సమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు 'షోడశి' గురించి వ్రాసినది -**

ఏది ఎట్లున్నను శ్రీ శర్మగారు చేసిన పరిశోధనగాని వారి మేధావిశేషము గాని ఆశ్చర్య జనకములుగానున్న వనుటకు సందేహములేదు.

శ్రీ శర్మగారు త్రిజటా స్వప్నమును గాయత్రీ మంత్రములోని పాదముల సంఖ్యయు నక్షరముల సంఖ్యయు తీసికొని అది గాయత్రీ మంత్రమునకు నొక విధమైన వ్యాఖ్యయని నిరూపించుట మిక్కిలి యూహాస్ఫోరకముగా నున్నది; వారి శ్రద్ధను నిరూపించుచున్నది. ఇది పారాయణము చేయ నెంచెడి వారికి శ్రీ శర్మగారు చేసిన యుపకార మింతయని చెప్పరాదు.

మొత్తము మీద నొక్కటిని నిస్సంశయముగా చెప్పవచ్చును. వీరి పాండిత్యము చాల లోతుగలది. వీరి శ్రీ విద్యా రహస్య వేతృత సర్వంకష్టమని చెప్పుట కభ్యంతరముండకూడదు. భారత రామాయణములను కలిపి వీరు చదివినట్లు చదివిన సంఖ్య లేదనియే చెప్పవలెను. మహామేధావులైన వారితో నిండియుండిన యీ ప్రపంచములో లేరనుటకు వీలు లేదుగాని యున్నచో భారతదేశమున నొకరిద్దరుందురేమో!

వారీ గ్రంధము వ్రాసినందుకు తెలుగువారే కాదు, భారతీయు లందరును కృతజ్ఞులుగా నుండ వలసిన విషయము.

# AKHIL BHARATIYA RAJ BHASHAA SAMMELAN

(All India Language Commission, Home Ministry, Govt of India)
24-25 February, 1994.

## *Rashtriya Saamskritik Ekta Puraskaar*
## *"Cultural Unity of the Nation Award"*
*i.e.,*
## "*Rashtrendu*".

Shri Seshendra Sharma was born on 20-10-1927 to Smt. Ammayamma and Shri G. Subrahmanyam Sharma in the village of Thotapalligudur of Andra Pradesh. Starting his education in the local educational institutions he studied law in the Madras Law College Working in State Government Service, he retired as Municipal Commissioner in Hyderabad. Committed to National Unity, Mahakavi Seshendra Sharma produced Audhunik Mahabharat in poetry, Wrote Kavisena Manifesto in Kaavya Saastra, and Shodasi in Criticism. All the works put together are nearly more than forty. Through these significant works he established new standards in the respective fields Though Shri Sharma is a leftist and is on the side of the oppressed peoples of the world, he accepted Indianity, Inspite of conflicting trends in the intellectual and socio-economic fields, Seshendra Sharma faced them with undaunted courage and gave a new direction to the Indian literature Seshendra, the architect of a new era, can be placed on a par with the great

intellectuals like Bharatendu Harishchandra. The only one thiker of the kind like him in the Country, he conceived of Kavisena and generated a great movement. Rashtrendu Seshendra has been from the beginning, on the side of bilingual policy and therefore most of his books have appeared in bilingual editions, like Telugu-English, Telugu-Hindi, etc.

Despite being in Governement serbice, Seshendra in his life and literature, has been quite unflinching in the matter of truthfulness. The fire inside him sometimes explodes in the form of the Canto of My Country My People of Andhunik Mahabharat, sometimes in the form of kheton ki pukaar and sometimes it takes the shape of Gorilla. Superceding the boundaries of time and country he has spread in many directions through translation into Hindi, Tamil, Kannada, Malayalam, Bangla & Urdu besides into foreign languages like English, Greek and French.

Widely travelled in many parts of the world, Seshendra is India's cultural bridge with the outside world, by any standard of assessment or from any point of view.

So the commission feels it their proud privelege to honour him, with the title " **Rashtrendu** ".

Sd/-
**Dr.Om Prakash Sharma**
Secretary.

Sd/-
**B. T. SRidharan,**
President

(The City Official Language Commission Committe, Calcutta)

# राष्ट्रीय हिन्दी अकादमी

रूपाम्बरा

22 बी, प्रतापादित्य रोड, कलकत्ता - 700 026

## प्रशस्ति - पत्र

मान्यवर कविवर शेषेन्द्र शर्मा,

आपने तेलुगू साहित्य जगत मे अपने मौलिक कृतित्व तथा सघर्षशील चिन्तन द्वारा मानव के प्रति प्रतिबद्धता, आस्था कविता मे नये इतिहास का सूत्रपात किया। आपने कविता, निबध, आलोचना के क्षेत्र मे नये शिल्प, नई भाषा, नये भावबोध एव प्रगतिशील विचारो द्वारा रचनात्मक उत्कृष्टता प्राप्त की। आपकी कविताओ के अमर छन्दो ने न सिफ तेलुगू साहित्य वरच समकालीन भारतीय साहित्य परिदृश्य को भी प्रभावित किया तथा राष्ट्रीय अस्मिता को गौरवान्वित किया। इस महत्वपूर्ण उपलब्धि के लिए राष्ट्रीय हिन्दी अकादमी आपके प्रति आदर और श्रद्धा व्यक्त करती है तथा तमिल के महाकवि सुब्रमण्यम् भारतीय राष्ट्रीय साहित्य पुरस्कार से सम्मानित करती है।

स्वदेश भारती

अध्यक्ष

छठा अखिल भारतीय राजभाषा सम्मेलन

गोवा, 2 अक्टूबर - 1993

## రాష్ట్రీయ హిందీ అకాడమీ

రూపాంబరా
22-బి, ప్రతాపాదిత్యరోడ్,
కలకత్తా - 700 026

# ప్రశస్తి పత్రము

మాన్యవరులైన శేషేంద్ర శర్మగారు,

మీరు తెలుగు సాహిత్య జగత్తులో మీ మౌలిక కృతిత్వము సంఘర్షశీలమైన చింతన ద్వారా మానవుడి పట్ల ప్రతిబద్ధత ఆస్థ, కవితలో నూతన చరిత్రను సృష్టించారు. మీరు కవిత, వ్యాసము, విమర్శ క్షేత్రాల్లో నూతన శిల్పము నూతన భాష, నూతన భావబోధ, ప్రగతి శీల విచారధార ద్వారా సృజనాత్మక ఉత్కృష్టతా ప్రాప్తి పొందారు. మీ కవిత యొక్క అమరచ్ఛందములు పంక్తులు సమకాలీన తెలుగు సాహిత్యాన్నేగాక సమకాలీన భారతీయ సాహిత్యాన్ని కూడా ప్రభావితం చేశాయి. తద్వారా భారతీయ విశిష్టతను గౌరవాన్వితం చేశాయి. రాష్ట్రీయ హిందీ అకాడమీ మీరు సాధించిన ఈ మహత్వ పూర్ణ ఉపలబ్ధి కారణంగా మీ పట్ల ఆదరము శ్రద్ధ వ్యక్తం చేస్తోంది. దానికి చిహ్నంగా తమిళ మహాకవి "సుబ్రహ్మణ్యం భారతీయ రాష్ట్రీయ సాహిత్య పురస్కారం"తో మిమ్మల్ని సన్మానిస్తోంది.

స్వదేశ్ భారతి
అధ్యక్షుడు
6వ అఖిలభారతీయ
రాజభాషా సమ్మేళనము,

గోవా, 2 అక్టోబరు, 1993.

## RASHTRIYA HINDI ACADEMY

Rupambara,

22-B, Pratapaditya Road, Calcutta - 700 026.

## CITATION

Respected Great Poet Seshendra Sharma,

Through your Poetry of high quality and through your defiant intellectualism, you created in the world of Telugu literature, a commitment to humanity and deep involvement in poetry and consequently a new history has been created by you. you achieved supreme creative quality in Poetry, Essay and Criticism through your new techniques, new language and new cognition. The immortal lines of your poetry have influenced not only Telugu literature, but also the contemporary Indian literature. In this way your work in literature has enchanced the prestige of our Nation. For this great achievement, Rashtriya Hindi Academy expresses their respect and admiration to you. And you are hereby honoured with the presentation of Mahakavi Subrahmanya Bharathi Award.

Sd/-

**Swadesh Bharathi**

President.

6th All India Language Commission,
Goa, 2nd Oct., 1993

## శ్రీ కలచవీడు శ్రీనివాసాచార్య, అనంతపురం

మహోదయ! సాదరం గృహ్యాతామిదం, నస్తుతి
పరం, పరంతు యధార్ధకధనమ్ -
శ్రీ మద్గుంటూరు శేషేంద్రశర్మా నల్పార్థ సార్థ
విత్ వక్రోక్తి భూషణః కావ్య సామ్రాజ్యాధ్యక్ష శేఖరః -
వర్ధతామార్ష కావ్యార్థ సౌభాగ్యోద్ధార దీక్షితః
కవితాభాస రాద్ధాంత నిరాసన కృతే క్షమః-
రసభావ మర్మవేత్తా పూజ్యస్త్వం సత్యవేది సంఘుస్య
సర్వదాతస్య హృదయే వర్తతే భావతః పదమ్ -
హితంచ పధ్యం వచనం భవద్భ్యః
కాంక్షామహే సత్కవి తల్లజ! స్ఫురత్
భవత్ సువర్ణ ప్రతిపాదనక్షమా
సులేఖినీ గ్రంధ శతాయ కల్పతాం -

*(Excerpts from the Preface of Shri N. Ramesan I A.S., Education Secretary, Govt., of A.P., written for "Shodasi")*

"The author's erudite scholarship and keen sense of research are evident through out the work. The book is an original attempt at a reinterpretation of Valmiki in a new light and all Deviupasakas would gladly and gratefully welcome this. The book is so thought-provoking and so well written that it deserves to be translated into English and several other Indian Languages."

# प्रकर

## शब्द इस शताब्दी का
## (तेलुगु से अनूदित मूल तेलूगु पाठ सहित)

समीक्षक · डॉ. श्यामसुन्दर घोष

इस शताब्दी का शब्द या सच अनेक कवि लिख रहे है। लेकिन तेलुगु कवि शेषेन्द्र की कविता को पढ़कर ऐसा लगता है शताब्दी के शब्द को ऐसी तेजस्विता, ऐसी भगिमा, ऐसी भास्वरता सब नही दे सके हैं, सब नहीं दे सकते। यह अच्छा हुआ कि भारतीय ज्ञानपीठ ने उनकी चुनी हुई कविताओ का एक छोटा सा सकलन, मूल और हिन्दी अनुवाद के साथ, तेलुगु और हिन्दी पाठको के लिए सुलभ करा दिया, जिसमे उनके सभी प्रतिनिधि काव्य-सकलनोकी चुनी हुई रचनाए आ गयी है: प्रारम्भ मे "मै और मेरा मयूर" शीर्षकसे कवि की भूमिका है, और परिशिष्ट मे डॉ. रणवीर राग्रा द्वारा कवि से लिया गया साक्षात्कार भी सकलित है।

शेषेन्द्र अपने को 'धान्य-जन्मा' कवि कहते है। उन्होने धनियोके अणुओ से कविताए रची है, स्वप्नोमे पथ बनाये हैं और मेघोमें भवन उठाये है, मानवीय जीवनके प्रत्येक क्षेत्रको उर्वर बनाया है (पृ.४५), वे मनुष्य मे से एक महान् राक्षसी शक्ति को निकालकर, उसे शिल्पित कर के ससार के समक्ष खडा करते है (पृ.४६)। वे अपनी कविताओ को 'चतुर्वाही' कहते हैं। थकी यात्रा मे वृक्षकी छाया उनकी मधुशाला है और गिरा हुआ पुष्प अभ्यागत हैं (पृ. ५३)। भाषा उनके लिए प्रकाश की एक लपट है जो लोगो के पथों को आलोकित करती है। चरण ऐसे बलशाली सिह है जो घने बीहड जगलो मे भयरहित विचरते है। वे अपने को न्यायसगत रोष का सैनिक

कहते है। उन की आवाज मे सत्य का प्रचड प्रपात गूँजता है (पृ.६२)। "जब उठाते हैं कलम/तो उनमे उतना अहम् होता है जितना एक देश के फहराते ध्वज मे होता है"। (पृ.१०७)। कविता शेषेन्द्र के लिए तपस्या है। वे कहते है – "मेरी कविता मे से टपकती नही मधु से भीगी सध्याए। और उदित नहीं होते बालकनी से झाकने वाले चन्द्र बिम्ब।" (पृ.११३)। उनके काव्यमे स्वेद मे मुकुट पहने देवता धूपस्नान करते है। एक पक्षी के गीत से वे अरण्य की थाह पा लेते है। वे भूमि और आकाश को मिश्रित करके गाते है। शेषेन्द्र की कविता नये चेहरो के साथ नये काति मडलो को धारण कर के उचलती, कूदती, नाचती, गाती आती है... प्रत्येक कविता युद्धके लिए एक बन्दूक है और प्रत्येक पक्ति शत्रु पर चोट करने के लिए एक तोप (पृ.६७)। वह अपने को 'रक्त प्रवक्ता' कहते है। वे अपने लिए भयभीत होने की बात नही करते, अपने राष्ट्र के लिए चितित हैं। वे पूछते है – "इस विराट् विनाश लीलाके बीच तुम कैसे खा और सो सकते हो? 'उनके लिए खूबसूरत कविता का अर्थ है– "कि उसके पास एक दिल हो/और वह टपकाये आसू/क्रोधकी अग्नि ज्वालाए उगले/और पीड़ित वर्गके पक्ष मे खडी होकर/ऋण चुकाये मानवता का/ कविता बुर्ज है एक किले की/मनुष्य की विजय के लिए लहराये झडा बनकर (पृ.१०६)। शेषेन्द्र कविता को मेसमेरिज्म भी मानते है और कवि की आख को एक प्रिज्म (पृ.११५)। कविको वे 'विप्लवका ध्रुवतारा' मानते हुए आह्वान करते हैं – "ओ कवि, अपनी कविताओ को/युद्धोतर अस्त्रो की तरह/मत टागो दीवारो पर ... आनेवाले इतिहास के लिए माँजो अपने शब्दो को/तलवारो की तरह।" वे स्थितियो का आकलन इस प्रकार करते है – "हालाकि पाव जजीरो से जकड़े है किन्तु आकाश

मे लाखो ध्वज लहरा रहे है।" (पृ.६६)। वे कवियों से आशा करते हैं कि वे शब्दो के गर्द–गुबार झाड देगे। उनकी दृष्टिमे "जो बलवान है ज्यादा जीवन से/वही/मात्र वही/दे सकता है आकृति शब्द से शताब्दी तक को (पृ.१०७)। यही कही शेषेन्द्र स्वय को सीधे सम्बोधित करते है– "घाव–स्वर्णपदको को धारण किये वीर पुरुष हो तुम"। गीता की कथन–शैली मे वे कवियो का वर्णन इस प्रकार करते हैं– "इग्लैड में तुम्हारा नाम एडवर्ड है, इटली मे तुम्हारा नाम रोमियो, अरेबिया मे मजनू और इण्डिया मे तुम्हारा नाम है देवदास (पृ.१५३)।

शेषेन्द्र की कविता मे जन–मानस को उद्वेलित करने वाले भाव और विचार प्रचुर परिमाण मे है। वे कवि से आशा करते हैं कि "तुम्हारी आवाज़ तुम्हारे अपने गीत को निर्वासित करे, और जनता के गीत को जन्म दे।

तुम अपनी युद्धाग्नि को देश की अग्नि से मिला दो। तुम्हारी मुट्ठी भर जिन्दगी के लिए आखिर कितना प्यार चाहिये?" वे आशा करते हैं कि लोग जैसे–जैसे विद्यालयो, विधान सभाओ, अकादमियो से बाहर आयेगे बाहर देखेगे कि समय की हवाओ मे सदिया उडी जा रही है। (पृ.६६)। जनवादिता के साथ शेषेन्द्र की कविता में किसानी सस्कार इस प्रकार रसे–बसे है कि स्थान स्थान उसकी छटा देखते ही वनती हैं। कवि आशा करता है कि बच्चों को पिता द्वारा प्रदत्त गुडियाओ और सचित्र पुस्तकों के स्थान पर खेत और कारखाने मिले। शेषेन्द्र भारत के बच्चो से कहते है – "अब तुम महाविद्यालयो मे जाते हो/तो खेत तुम्हारी ओर अश्रुपूरित नेत्रो से देखते रहते है।" केवल यही नही, वे तो यहा तक अनुभव करते है – "जब अपनी स्लेट और पुस्तके लिए तुम चलते हो/ तो मुझे अनुभव होता है कि बालक ईसा मसीह की भाति/प्रत्येक

बच्चा अपना सलीब खुद उठाये चल रहा है (पृ.६३)। शेषेन्द्र मनुष्य के स्वतत्र और अदम्य विकास के इच्छुक कवि हैं। वे स्पष्ट कहते है· "यदि तुम उगो/तो छू नही पायेगी तुम्हारे धुटनो तक को भी/ये विधान सभाए/ये महल/ये अकादमिया (पृ.१०२)। वे युवको को हमारी परेशानियो के जगलो को काटनेवाला आरा कहते हैं। उनकी दृष्टि मे एक देश की सम्पदा/न तो नदी है, न खनिज और न अरण्य किन्तु स्वप्नो के खनिजो से निर्मित युवा ही है। देश की सम्पत्ति है (पृ.५३)। देश और समाज के नारे मे कवि की चिन्ताएँ बहुमुखी है। देशके दोनो ही रूप– उसका शक्तिपूर्ण, सम्भावनाशील रूप और लिथडता घिसटता ह्रासशील रूप, उन के ध्यान मे है। कही वह क्षुब्ध और दु·खी है यह देखकर कि "इस देशके कवियो और शब्दोको लग गया है दीमक... छोड़ दिया गया है विश्वके मानचित्रपर/मेरा देश अगूठेकी एक छाप बनाकर... लेकिन यही लगे हाथो कवि का यह सकल्प भी व्यक्त होता है– "अब कोई भी बाध नही सकता मुझे/ पशुकी भाति खूट से /तोड नही सकता ससार मुझे/ बुझा नही सकते सवत्सर।" (पृ. १०६)।वह केरल की वृक्षावलियो से, ब्रजभूमि की बास की झाड़ियो से, राजस्थान के रेगिस्तानो से, मध्य भारत के घने जगलो से, लोगो से आह्वान करता है– इन शब्दोके साथ अपने हृदय को धड़कता रहने दो/ किन्ही शाखाओ को चीर कर फूल निकलने ही वाले हैं (पृ.२१४३)। कवि की सवेदनशीलता कही कही इतनी प्रखर है कि – "चलते हुए मेरा एक हाथ पुष्प से छू गया। मैने पूछा क्या तुम जख्मी हो गये? मुस्कराकर पुष्प ने उल्टे पूछा – मै या तुम" (पृ.१२६)। कवि शरीर मे से डरपोक हृदयको उखाड़कर फेक देने को कहता है। उसके लिए दुःख हमारी खोज में हमारे द्वार पर आये ऋषि

है। वह मानता है कि आखो की कोर में जब आसू खडा रहेगा तभी जिन्दगी हमसे दिल खोलकर बात करेगी (पृ. १२७)। वृक्ष, चन्द्रमा, सूर्य, आकाश, हवा आदि न जाने प्रकृति के कितने रूप और रग शेषेन्द्र की कविता मे अपनी बाकी छवि लेकर आते हैं। वृक्ष कही ससार को देखनेवाला एंटिना है। कही वह पट्टाभिषेक के बाद सम्राट् बनकर तप्त धरती को शीतल छायाओ की राजसी भेट प्रदान करता है। कही वृक्ष की एक नग्न शाखा, जिसने अपने पत्ते विसर्जित कर दिये हैं, हजारो वसन्त तपस्या करके भी उसके सौदर्यको नही पा सकते। ... 'एक चन्द्रमा ठीक कर सकता है/ उन घावो को जिन्हे बनाया है कई चाँदनी रातो ने ... कही चन्द्रमा लक्स सोप जैसा है/ स्वामी है सब नक्षत्रो का/और निपुण है आकाश नौकायनमे ... सूर्य छलाग लगाकर आनेवाला है/ हजार खड्गोसे चीरता हुआ/ यह समस्त शिखरो पर रक्त क्राति वाले ध्वज स्थापित करेगा... कही सूरज समन्दरो पर झुककर जलपान करने वाला अश्व है/ और आकाश नगरो पर झुककर गर्जने वाला सिह/आकाश सूर्य का मदिर है ... हवा चोर है खुशबुओ की/इन थोड़ेसे उदाहरणो से भलीभाति समझा जा सकता है कि शेषेन्द्र को कविका रूप-रग और अन्दाज क्या और कैसा है।

वर्णनों और विवरणो की दृष्टि से शेषेन्द्र की कविता इतनी समृद्ध और पैनी है कि वह किसी भी भारतीय भाषा की कविता से टक्कर ले सकती है। वृक्ष कही गाल फुलाकर दो शाखाओ से एक पुष्प पकड़ कर शहनाई बजाता है (पृ.३६), कही प्रातःकाल एक कमल स्नान कर के समस्त ताल को सुगधित कर देता है (पृ.३६), कही दराती चन्द्र-रेखकी तरह उदित हुई इस शताब्दीपर (पृ. ६६), कही उम्र उड़ जाती

है एक पछी की तरह ... कही गगा नदी कारखानो का शौचालय, नगर एक चम्बल वैली और गाव देश का कुली है (पृ.५७), कही बूढा देवालय खासता है, उनके ईंट पत्थर निकल आये इधर-उधर दातोसे (पृ.५७), कहीं साजिश कर के मानव जाति को वे टुकडो मे चीर डालती दूकानो मे कोधती तमाम वस्तुए हैं (पृ. ६१) पैसे जेब मे अगडाई लेते है, बरखा हजारो हाथो से दरवाजे पर दस्तक देती है, गुण्डा हवाओ के हाथो कॉपती गली की शाखाए है, बादलो के रथ पर आसीन वापस जाती बरखा है, धान्य सैन्य बनकर भूख पर आक्रमण करने चल पडा है (पृ.१३५), मौसम्बिया डालो पर लेटकर सो गयी है मासूम बच्चो की तरह। बाल मैना चकोर और तोते बनकर उड़ गये हैं। ऐसे न जाने कितने स्थल है जहॉ पाठक ठहर-ठहर जाता है और कवि की प्रतिभा से चमत्कृत होता रहता है।

शेषेन्द्र की कविता मे रोमाटिक और क्लासकीय दोनो ही अन्दाज है। वह एक अधीत कवि भी है। उसने देश-विदेश का श्रेष्ठ साहित्य पढा, गुना और समझा है। वह लोर्का और दडी, बालजाक और लुडविग का एक साथ उल्लेख करता है। वह दडी के समाधि सिद्धान्त को आज की अर्थदृष्टिसे जोड़ता है। समाधि उसकी दृष्टि मे एक व्यक्ति का 'कान्सेट्रेटमूड' है जिस मे व्यक्ति को अर्थदृष्टि मिल जाती है। वह भारतीय काव्य सिद्धान्तो को पाश्चात्य धारणाओ से जोड़कर देखता और परखता है।

ऐसे प्रमुख तेलुगु कवि का परिचय देकर भारतीय ज्ञानपीठ ने एक उपयोगी कार्य किया है। कविताओ के अनुवाद मे ओम्प्रकाश निर्मल को सफलता मिली है।

# एक निराला व्यंक्तित्व

**डॉ. ए. भवानी**

## राष्ट्रेन्दु शेषेन्द्र : अशेष आयाम

डॉ. वसिष्ठ की दूसरी समीक्षात्मक कृति है – 'राष्ट्रेन्दु शेषेन्द्र: अशेष आयाम', जो इनमे निहित समीक्षात्मक प्रतिभा के नवीन आयाम उद्घाटित करती है।रहबर पर विश्रान्त की कृति पहली और अतिम रही, हर्षनाथ पर भी इनकी कृति के बाद किसी ने न लिखा। शेषेन्द्र पर कई आचार्यो ने अपने विचार प्रस्तुत किये है। प्रस्तुत किताब मे शेषेन्द्र के व्यक्तित्व एव कृतित्व को एक साथ प्रस्तुत करने का सफल प्रयास विश्रान्त जी ने किया है।

यह रचना आध्र प्रदेश के पश्चिम उदयगिरी मे जन्मे डॉ. शेषेन्द्र शर्मा की काव्य–प्रतिभा, उनकी सगठन–शक्ति और चिन्तन–शीलता का समीक्षात्मक विचार प्रस्तुत करती है। शेषेन्द्र की रचनाए देश काल की सीमाए पार कर चुकी है। विश्रान्त जी के शब्दो मे – 'कविसेना आन्दोलन के सूत्रधार, गुरिल्ला और मेरी धरती मेरे लोग, जैसी अमर कृतियो के उत्स, साहित्य अकादमी द्वारा सम्मानित, युवा क्रातिकारियो के चहेते गुण्टूरू शेषेन्द्र शर्मा के रूपको और प्रतीकोकी तुलना आदि कवि वाल्मीकि और कालीदास से की जा सकती है।' शेषेन्द्र के आत्मीय स्वभाव मे सयम और शाति का योगदान रहा। साथ ही वे साहसी और धैर्यवान भी है। इस सबध मे एक घटना का यहा औचित्य है – उन दिनो, सरकार द्वारा एक राजा से भी कर वसूल करने का आदेश शेषेन्द्र को मिला। बार–बार तग करने पर ही महाराज ने कर का पैसा दो लाख अपनी गाडी से बाहर फेकते हुए कहा, 'कुते' और चैक को कार

की खिड़की से दूर फेक दिया। उनके इस व्यवहार पर जब जनता ने विरोध किया तब बडे सयम के साथ शेषेन्द्र ने कहा 'नही, हमारा काम कर वसूल करना है। यदि हमे राशि मिल गई तो ठीक है। क्रुद्ध होने की आवश्यकता नही है, आप लोग चलिए, हमारा काम हो गया है। डॉ. विश्रान्त को लगा कि ऐसे सयत और शाति प्रिय विचार वाले शेषेन्द्र शर्मा की काव्य प्रतिभा एव रचनाओ एव लेखो पर विचार प्रकट करना उनका कर्तव्य बन जाता है। अपनी 'पूर्व पीठिका' मे डॉ. विश्रान्त ने लिखा है– शेषेन्द्र मे अपने आभिजात्य के बावजूद सारल्य है। वशानुगत आभिजात्य और प्रकृति से सरलता। है न अनूठी बात! क्या कलम उठाने के लिये एक कारण नही हो सकता? 'पाश्चात्य काव्य शास्त्र मे कहा गया है कि कवियो को समाज मे नही रहना चाहिए क्यो कि वे समाज का रू–ब–रू स्वरूप प्रस्तुत करते हैं। युग–प्रवर्तक शेषेन्द्र के काव्यो मे भी समाज का वास्तविक चित्रण मिलता हैं। कुछ इन्ही कारणो से उनके विरोधी भी पैदा हुए है। शेषेन्द्र की मान्यता है कि 'यदि किसी सत्य के सार्वजनिक करने मे झिझक हो रही हो तो वह कार्य अनैतिक है। सत्य चाहे जितना भी कड़वा क्यो न हो, साफ–साफ कह दिया जाना चाहिए। उसका परिणाम चाहे जो भी क्यो न निकले।' शेषेन्द्र तटस्थ कवि हैं, उन्होने कभी किसी दल या समूह का पक्षपात नहीं किया। सत्य की गरिमा से आवेष्ठित आवेश ने बल दिया और परिणामस्वरूप 'गुरिल्ला' और 'मेरी धरती: मेरे लोग' कृतियॉ उद्भूत हुई। उन्होने मुक्त छन्द की कविताए भी लिखी जो 'पक्षुलु' सकलन मे 1968 मे प्रकाशित हुई। इनमे शेषेन्द्र जी के छायावादी एव प्रगतिवादी विचार–धाराओ का अद्भुत सगम है। अपने देशप्रेम की भावना उनके हृदय से यू निकलती

है – जब परिवेश जल रहा हो। देशवासी तड़प रहे हो तो कवि हृदय क्लान्त कैसे नही होगा? यह तो स्वाभाविक प्रक्रिया मात्र है। महलो मे रह कर जन साधारण के लिए तडप, उनकी माग और आवश्यकता की पूर्ति की ओर जब नजर गई तो उनका क्रोध प्रबल रूप धारण करके 'गुरिल्ला' मे उगलता गया। जहा एक ओर 'वीर तुम बढे चलो, धीर तुम बढ चलो।' का शोर था वहा शेषेन्द्र की कविताओ मे भावात्मकता झलकती थी:

यदि भूकम्प भीआए,
तो नही हिलूगा रच–मात्र भी
उस स्थान से
जिसे मै प्यार करता हू।

देश काल की सीमाओ से परे इनकी रचनाओ का अनुवाद हिन्दी, तमिल, मलयालम, बगला, उर्दू जैसी अधिकाश भारतीय भाषाओ के साथ साथ अग्रेजी, ग्रीक, और फ्रेच मे हो चुका है।

ऐसे प्रतिभाशाली व्यक्ति की रचनाओ पर समीक्षात्मक विचार प्रस्तुत करके डॉ. विश्रान्त वसिष्ठ ने वास्तव मे तेलुगु और हिन्दी साहित्य के बीच सेतु का कार्य किया, जो सराहनीय है।

इस कृति को पढ़कर प. श्यामसुन्दर आचार्य ने विश्रान्त जी से कहा था, 'अदभुत शैली है। इससे मै दो व्यक्तियो को समझ सका हूँ। एक आपको और एक शेषेन्द्र को।' 'शेषेन्द्र: अशेष आयाम' जीवनी लिखने की एक नवीन शैली है, जिसे हिन्दी मे अपनाने से व्यक्ति और उसके कृतित्व को साथ–साथ समझा जा सकता है।

# జాబిల్లి నవ్వుల్లో జలకాలాడుదాం - నాతో వస్తారా !

సూర్యుణ్ణి ఎటునుంచి చూసినా సూటిగా కిరణమే గుచ్చుకొంటుంది.
శేషేంద్రను చదివినా అంతే! ఆయన కవిత్వపు కిరణం బాణంలా దిగుతుంది.
ఆకాశాన్ని పసిపిల్లాణ్ణి చేసి ఊయ్యాలలో జోల పాడే జోదు నెరుగుదురా! ... మీరు?
మలయానిలానికి మందగమనాన్ని నేర్పే నాగరకుణ్ణి ఎరుగుదురా !
అనలానికి ఉత్సాహాన్నిచ్చేఅగ్ని వేశుణ్ణి,
జలపాతాల గుఱ్ఱాల మీద స్వారీ చేసే ఆశ్వికుణ్ణి ఎరుగుదురా !
అతడే ''విప్లవ భాషా విధాత'' - ''కవిసేన మేనిఫెస్టో'' ప్రణేత – శేషేంద్ర!
ఇంద్రధనుస్సుకు రంగులద్దే చిత్రకారుడాయన
మెరపు తీగకు లాస్యం నేర్పే నాట్యాచార్యుడు
మాటల నుండి మకరంద ధారలను పిండే దోహనుడు.
సీతాకోకచిలుక కట్టుకున్న చీరకు
''మ్యాచింగు'' నేర్పే ''బ్యూటీషియన్''
అతడే ''శేషేంద్ర''!

షోడశ కళా పరిపూర్ణుడైన రాకా శశాంకుని ''షోడశి''ని భూలోక వాసులకుచూపించిన మంత్ర శాస్త్ర రహస్య రసపట్టు ... శ్రీ శేషభట్టు! చింతామణీ మంత్ర తపస్సిద్ధుడైన శ్రీ హర్షుని ''స్వర్ణ హంసి'' ని మనకు చూపించిన మహా తాంత్రికుడు శ్రీ శేషేంద్ర శర్మ!
రాళ్ళు పగిలే రోహిణీ కార్తెలో,
మిట్ట మధ్యాహ్నం మండుటెండలో రోళ్ళు చెక్కడం ఎంత కష్టమో...
చంద్రకాంత శిలలు కరిగే శారద రాత్రిలో రాకానిశాకరుని కౌముదీ శీకరంలో జ్యోత్స్నావిహారం చెయ్యడం కూడా అంతే కష్టం!
అందుకే... ''మండే సూర్యుడు'' ''శేషజ్యోత్స్న'' రెండూ ఆయనే !
పూల బరువు మొయ్యలేని సుకుమారుడాయన.

జీవితంలో వంచనా శిల్పం తెలీని పక్షుల్లా, పువ్వుల్లా బ్రతికే "ఋతు ఘోష" ఆయన. ఇంద్ర ధనుస్సును ఎక్కుపెట్టి స్వప్నాలను బాణాల్లా సంధించే మహాస్వాప్నికు డాయన.

వసంతంలో పూచిన ఈ చెట్ల పూలన్నీ .. తుపాకులై పేలితే ఎంత బాగుండను! .. అని విప్లవ భావాన్ని వెలిగ్రక్కిన నోటితోనే, పిడికెడు వసంతాలను అందరికీ భిక్ష పెట్టమని ప్రభుత్వాన్ని, ధనాఢ్యులను వేడుకొంటాడు.

"సముద్రం ఒకడి కాళ్ళ దగ్గర కూర్చుని మొరగదు, తుఫాను గొంతు చిత్తం అనడం ఎరగదు, పర్వతం ఎవడికీ వంగి సలాం చెయ్యదు. నేనింతా పిడికెడు మట్టేకావచ్చు, కానీ కల మెత్తితే నాకు ఒక దేశపు జెండా కున్నంత పొగరుంది" (జనవంశం)

అదీ శేషేంద్ర వ్యక్తిత్వం...

"కర్ణాట క్షితిపాల మౌక్తిక సభాగారాంతర స్వర్ణస్నాన జగత్ప్రసిద్ధ కవిరాట్టు" నని గర్వంతో పలకిన శ్రీనాథుడూ; "మృద్వీకా మధ్య నిర్యన్మసృణ మధు ఝరీ మాధురీ భాగ్యభాజాం, వాచామాచార్య తాయాః పదమనుభవితం కోస్తి ధన్యోమదన్యః" - అని ఆత్మ విశ్వాసంతో పలికిన పండితరాజ జగన్నాథుడూ పురిటిల్లైన తెలుగు గడ్డ మీద మమకారంతో మళ్ళీ పుట్టేరు!

ఒక శేషభట్టుగా - ఒక శేషేంద్ర శర్మగా

వేయి సంవత్సరాల ఆంధ్రసాహితీ పరిమళ నందనోద్యానం అతడే!

"సహస్ర సాహితీ శేష కౌముది" శేషేంద్ర!

స్వస్తిః ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేన మార్గేణ జనరాజ్యతంత్రాః
శుభమస్తు పశుపక్షి వృక్ష కీటేభ్యః
లోకాః సమస్తాః సుఖినోభవంతు. .

- ఇతి శమ్-

**'నవ కవితా పితామహ' బిరుదప్రదానం-కాకినాడ కవి పండిత సంఘం**

కాకినాడ — ఇట్లు

18-3-1997 — ఆహ్వాన సంఘం

# శ్రీ రామరాజ భూషణ సాహిత్య పరిషత్ (రి)

## భీమవరం

# యుగకవి శ్రీ శేషేంద్ర శర్మ

సాహితీ సతీ ద్వితీయా।

ఆంధ్ర సాహితీ రససౌరభ ప్రాంగణంలో మాన్య మహోదయ శ్రీ గుంటూర్ను శేషేంద్ర శర్మగారి పేరు వినని రసలుబ్ధులు లేరనడంలో అతిశయోక్తిలేదు. శ్రీ శర్మగారి శర్మదాలైన వాక్ ప్రసూన మంజరులతో గుబాళించని సాహితీ సదస్సు అందాల చందమామ చందాల విందులేని వినీలాకాశవు తమస్సు. ఒక పద్యం హృద్యంగా పలకాలన్నా, ఒక గేయం ఉపాదేయంగా వ్రాయాలన్నా, ఒక చమత్కారిక హృదయ కవాటానికి చేరికగా విసరాలన్నా, ఒక వ్యాసం సరస్వతీ పదవిన్యాసంగా రచించాలన్నా శర్మగారిని పోలగల వేత్తృతా శిఖామణులు సకృత్తుగావున్నారు. అలాంటి శర్మగారి సాహిత్య విన్యాసం మన భీమవరం పట్టణానికి లభించడం మన శ్రీ రామరాజ భూషణ సాహిత్య పరిషత్తుకు అదృష్టంగా భావిస్తూ రసజ్ఞులైన తామందరినీ సభకు సకాలంలో విచ్చేయమని మనవి చేసుకుంటున్నాము.

అందరూ ఆహ్వానితులే

భవదీయులు

| | |
|---|---|
| గన్నాబత్తుల పెదతాత | చుక్కన గంగరాజు |
| అధ్యక్షుడు | కార్యదర్శి |

(సందర్భం: సన్మానం, 15-3-1997, భీమవరం)

# 'నవకవితా పితామహ' శేషేంద్ర శర్మ

ప్రముఖ కవి గుంటూరు శేషేంద్ర శర్మ కీర్తికి మరో రెండు బిరుదులు తోడయ్యాయి. తెలుగు సాహిత్యంలో ఆయన ఎన్నో ప్రక్రియలను చేపట్టి తనదైన ప్రత్యేక శైలిని చాటుకున్నారు. 'శేషేన్...శేషేన్ నీ పోయమ్స్ చూసేన్.....బహు పసందు చేసేన్......' అని శ్రీశ్రీ సైతం గుంటూరు శేషేంద్ర శర్మను హృదయపూర్వకంగా ప్రశంసించారు. పద్యమైనా వచనమైనా గంభీరంగా ఆయన కలంలో ముందుకు సాగుతుంది. పదాల కోసం వెతుక్కున్నట్టు ఎక్కడా అన్పించదు. ఆధునిక మహా భారతంలో అయినా, ఋతుఘోషలో అయినా ఆయన శైలి హృదయాన్ని కదిలిస్తుంది. ఒక రకంగా ఆయనకు రీతి కవి శ్రీనాథుడు ఇష్టమని ఆయన పద్యాలు చెప్పకనే చెబుతాయి. పదాల ఎంపికలో శబ్దం పదే పదే మనసును వెంటాడేలా వుండడం ఓ ప్రత్యేకత. సామాన్యుడి సంఘర్షణ ఆయన కావ్యాల్లో స్పష్టంగా వెలుగు చూస్తుంది. నేల విడిచి సాము చేసిన పద్ధతిలో వస్తువు ఉండకపోవడం విశేషం.

దశాబ్దల పాటు తెలుగు సాహిత్యంలో తనదైన ముద్రను కాపాడుకున్న గుంటూరు శేషేంద్ర శర్మకు ఇప్పటికే ఎన్నో అవార్డులు వచ్చాయి. ఇటీవల పాలకొల్లులో పెద్దిబొట్ల బ్రహ్మయ్య స్మారక రసధుని సాహితీ పురస్కారం ఆయనకు అందజేశారు. పాలకొల్లులోని లయన్స్ కమ్యూనిటీ హాలులో వేదమంత్రాల మధ్య శేషేంద్ర శర్మను ఘనంగా సన్మానించి రసధుని పురస్కారం అందజేశారు. ఈ సందర్భంగా శేషేంద్ర శర్మ కవిత్వాన్ని వ్యక్తిత్వాన్ని పలువురు కవులు, విమర్శకులు వివిధ కోణాల్లో ప్రస్తావించారు. శేషేంద్ర శర్మ వైదిక, లౌకిక సాహిత్యాల్లో ఆమూలాగ్రమైన అధ్యయనంతో వెలుగుతూ ఆధునిక విశ్వనాథగా పేరుపొందారని ఆచార్య బేతవోలు రామబ్రహ్మం ఈ సభలో పేర్కొన్నారు. రసధుని అధ్యక్షుడు లక్ష్మీనారాయణ సంస్థ కార్యక్రమాలను వివరించారు. ప్రతీ యేటా ఒక మహా పండితుణ్ణి సన్మానించాలని సంస్థ భావించిందని ఆ మేరకు గుంటూరు శేషేంద్రశర్మను ఉచిత రీతిని సన్మానించినట్లు ఆయన పేర్కొన్నారు.

సన్మానానంతరం శేషేంద్ర శర్మ ప్రసంగించారు. ఈ సన్మానం తనకు కాదని తను కొలిచే సరస్వతీ మాతదనీ అన్నారు. అంతరాత్మ జాగృతంగా వుంటే అప్పుడు మనిషిలో నుంచి సంస్కృతి, నాగరికత వెలుగు చూస్తాయని శర్మ అన్నారు. ప్రతి

మనిషికీ ఎంతోకొంత అహంకారం వుండాలని - అది లేనట్టయితే వ్యక్తిత్వం కోల్పోతారని ఆయన పేర్కొన్నారు. దినదినాభివృద్ధి చెందే నాగరికతలో కవుల పాత్ర వేరు చేయలేనిదని ఆయన వివరించారు.

కాకినాడలో గుంటూరు శేషేంద్ర శర్మకు వివిధ సాహితీ సంస్థలు 'నవ కవితా పితామహ' బిరుదు ప్రదానం చేశాయి. ఈ సందర్భంగా జరిగిన సభకు ప్రముఖ సాహితీవేత్త జానకీజానీ అధ్యక్షత వహించారు. వివిధ సాహితీ ప్రక్రియల్లో ప్రభావ వంతంగా కవిత్వాన్ని ఆవిష్కరించిన శేషేంద్ర శర్మకు నవ కవితా పితామహ బిరుదు సమంజసమైనదని ఈ సందర్భంగా వివిధ సాహితీ సంస్థల ప్రతినిధులు పేర్కొన్నారు. ఈ కార్యక్రమంలో గొర్తి శంకరభాను, పి.ఎస్.ఆర్.కె.తిమ్మారావు, సహస్రావధాని గరికపాటి నరసింహారావు, తటవర్తి శ్రీనివాసరావు, అద్దేపల్లి రామ్మోహన్‌రావు, శివలెంక ప్రకాశరావు, వేదుల శ్రీరామ సూర్యనారాయణ సోమయాజులు, డాక్టర్ మిరియా రామకృష్ణ తదితరులు కూడా పాల్గొని శేషేంద్ర శర్మను ప్రశంసించారు.

అనంతరం తనకు జరిగిన సన్మానానికి శర్మ వివిధ సంస్థలకు కృతజ్ఞతలు తెలుపుకున్నారు. కవిత్వం ఒక వశీకరణ విద్యలాంటిదని ఆయన పేర్కొన్నారు. సమాజం మార్పుకు ఈ వశీకరణ విద్య ఉపయోగపడుతుందని ఆయన వివరించారు.

భీమవరం రామరాజభూషణ పరిషత్ గుంటూరు శేషేంద్ర శర్మను ఘనంగా సన్మానించింది. భీమవరంలోని ప్రముఖ సాహితీవేత్తలు ఈ సభలో శర్మ కవిత్వాన్ని విశ్లేషించారు. ఇటీవల అనేక సాహితీ పురస్కారాలు అందుకున్న నేపథ్యంలో ఆయనను రామరాజభూషణ పరిషత్ సన్మానించింది.

*(ఆంధ్రభూమి దినపత్రిక, మంగళవారం, 25 మార్చి 1997)*

# TRENDSETTER OF A NEW ERA

- *K. Venkateswarlu*

"Life kindles the flame of poetry, the poet being the wick that burns to shed warmth and light. The sun can show visible objects like buildings, trees, rivers, birds, hills, people and so on. Poetry shows, on the other hand, life with its joys and sorrows, its secrets, problems and finally its solutions. Wisdom is given in capsules of metaphors, the basic units of poems".

That was Gunturu Seshendra Sarma, Telugu poet, critic and scholar, after winning the Sahitya Akademi's award. No wonder Seshendra's genre of poetry, characterised by lengthy poems, reflects human suffering, agony and deprivation of the poor.

If a poet is one who has intense emotional feelings, Seshendra personifies them all. Sitting cross-legged in a period settee, in the palatial Gyan Bagh Palace, belonging to his better half, Indira Devi Dhanrajgir's aristocratic ancestors, he brought forth all his emotions, during an interview. "My personal experiences which moved me into intense emotional levels took shape as poems".

Easily one of the best known Telugu poets in the Hindi belt of North India, his works translated into different languages have come in for liberal appreciation by litterateurs like Ali

Sardar Jafri, Dr. Viswambarnath Upadhyaya, Veerendra Kumar Jain and Prof. Indranath Chowdhury. He renders poetry and literary criticism with equal felicity. These features fetched him the Sahitya Akademi's award both as a poet and a literary critic. The award was for his work, *"Kaala Rekha"*. a collection of essays on comparative literature, laced with poetic passages full of metaphors.

"Symbols and metaphors visit only those who have prepared themselves as the medium to receive them The difference between an ordinary soul and a poet is that the latter cultures himself by going near and getting involved in life and literature. By such a process of involvement one ceases to be the ordinary individual and becomes too sensitive and, therefore, susceptible to the invasion of life on him. He is like a fiddle with strings drawn to the final limit and even a whiff of wind can knock out a note of melody from the vibrant strings. At this point the individual is called poet", he says.

Seshendra has authored over 40 books mostly of poetry, a play, a short story and many essays and shot into fame with the modern epic', *'Naa Desam, Naa Prajalu'* (My Country, My People) published in 1975, widely hailed as a 'turning point' for its significant contribution not just to Telugu literature but to Indian literature as a whole. It was soon rendered in English, Hindi and Urdu, the last by Akhtar Hussain with a foreward by the Urdu poet, Ali Sardar Jafri. The Greek translation had a foreward by Nikiphorus Vrattakos Widely travelled, his depth

in understanding of Telugu, Sanskrit, Hindi, English, French and German literatures, appears to be rarely matched.

Along with "*Naa Desam, Naa Prajalu', 'Munday Suryudu'* (Burning Sun), his second long poem and *'Gorilla'*, 'gave for the first time a genuine poetic expression to the revolutionary content, introduced into Telugu poetry by Sri Sri, four decades ago', as the Telugu University acknowledged in the citation presented to him while conferring on him the D. Litt degree in 1994.

"This is a historic event in the annals of Telugu poetry. From then, the non-metaphorical writing that was prevailing for over years in the name of poetry, before Seshendra, came to a halt; and metaphorical writing became the order of the day. The same new poetic idiom created by Seshendra is even now in vogue having been adopted by all. For this reason, Seshendra has a unique place in Telugu literature, as a trendsetter and architect of a new era. The emergence of Mahakavi Seshendra Sarma in Telugu literature ushered in a dazzling new era. Whenever his poetic vision touches the destiny of mankind, it had unfolded in a lofty and stentorian voice..", adds the Telugu University citation, describing Seshendra's works and the poet in him with near perfection.

His other works include *'Ruthu Ghosha'* written when he was Municipal Commissioner of Bobbili, *'Shodasi'*, his original *Tantric* commentary on Sundara Kanda of Valmiki Ramayana, *'Swarna Hamsa'*, another *Tantric* commentary on the

Naishadhiya Charitam of Harsha Bhatta and *'Sesha Jyotsna'*. Having got the copyright, his second son, Saatyaki, now started publishing his works through Jyotsna publications. One such publication, 'Seshendra Sahitya Darshini', sparked a debate in the Telugu literary world last year, as it contained scathing comments on the poet's contemporaries.

Born on October 20, 1927 in Nellore, Seshendra's first encounter with poetry was early in his childhood, the scholarly background of his family influencing him. His first published work dating back to 1946 as a student and contemporary of former Chief Minister, N.T. Rama Roa, in A.C. College, was nothing short of being revolutionary and outrageous, though it was for the college magazine. He wrote *'Chandalopi Mamaguruhu'*, depicting Sankaracharya's encounter with a dalit on the banks of the Ganga. At the age of 24, he rendered *'Sohrab and Rustum'* from the Persian epic Shahnama.

Awards came to him, especially in his home State of Andhra Pradesh rather belatedly, an aspect which continues to hurt him. "Though I have been into poetry and literature for so many decades now, I got the first award in 1993, that too not in the State but from the Rashtriya Hindi Academy in Calcutta" The next was again from the Akhil Bharatiya Rajbhasha Sammelan in 1994. There was no stopping and he was invited to attend the World Hindi Conferences at Nagpur, Delhi, and the last one at Trinidad.

(- From The Hindu, Monday, September 9, 1996)

# SESHENDRA : BRIDGE BETWEEN THE OLD AND THE NEW

-Prof. D. Ramakrishna

In a review-essay on Jessy Weston's *'From Ritual to Romance'*, which inspired "the great poet of our century, T.S.Eliot," the distinguished Telugu poet and critic Seshendra Sarma refers to "the dialectics of Mythology evolved in the modern systems of knowledge about symbols, myths and occult mysteries." Like Eliot's, Seshendra's critical and creative writings constitute a bridge between tradition and modernity. Steeped in the traditional Vedic lore. Seshendra has been striving to show its relevance to modern times. No wonder his works have been translated into English, German, French and Greek, besides several Indian languages, evoking a world-wide response to his complex genius.

While awarding the Honorary D.Litt to Seshendra recently, the Telugu University in Hyderabad stated in the citation that the poet-critic achieved the rare distinction of synthesizing the traditional Indian poetics and modern European theories such as the Greek, Roman and Marxist. Seshendra's extended statement in that direction is his book *"Kavisena Manifesto"*(352 pp.) which has greatly influenced the course of contemporary literary criticism in Telugu.

Seshendra has often been compared with his mentor and the Jnaan-Peeth Award-winner Viswanatha Satyanarayana. However, Seshendra has brought poetics closer to the heart of the common man than what his predecessor could achieve. His effort to endow the word with an extraordinary meaning, geared toward the practical aspect of everyday life, is striking. As the Indo-English poet Meena Alexander says, "The poetry of Seshendra bears the unmistakable imprint of a spirit

both exhilarated and tortured by the shining source of words, the promise of futurity." According to Seshendra, the source of poetry lies in pure consciousness; words are merely gleaming counters, often betrayers of the spirit. As he puts it in his prose poem, *"Turned into Water and Fled Away,"* "This language, this country, this time, how can I say they are mine? They were not of my choice nor did anyone take my consent for it. I am their prisoner. How many tongues, how many times and how many countries I came treading to this tiny village, which today claims me. I do not know, nor do you.....

But this day whispers in my ear: once upon a time my country was a flower and I was a drop of child-honey breathing in it."

In Telugu literary circles, Seshendra's *"Shodasi Ramayana"* is welcomed as-a new interpretation of a part of *Valmiki Ramayana* in terms of Kundalini Yoga. The *Sundarakanda* represents the quintessence of *Valmiki Ramayana's* thought. The first verse of the *Sundarakanda, "Tato Ravana Nithayah,"* etc., has been interpreted by Seshendra as representing an attempt by Hanuman to traverse the path of the *Sushumna*, which is the mystic path situated between the *Ida* and *Pingala*, thereby reaching the final goal of oneness with the *Kundalini Sakti*. In the chapter on *Indra Paratva* as opposed to *Vishnu Paratva*, the critic makes an original thesis: that the *Ramayana* closely follows the predominant position of *Indra* in the pantheon of gods, which is the *Vedic* pattern as against the supremacy of *Vishnu* which is the *Puranic* pattern.

A majōr poem of Sehsendra that deals with contemporary life, Gorilla(II3pp) uses the *Tantric* philosophy to reinforce the poet's view. While *Shodasi Ramayana* explicated the *Sundarakanda* as presenting the power of *Kundalini*, which enables *Hanuman* to fly over the ocean to *Lanka*, the modern

epic *Gorilla* deals with the Will traced through the pages of *Vedic* philosophy. As Seshendra says in his Preface,"The great power of universal creation is the vital force which forms the subject matter of contemplation for many thinkers of ancient India in the *Vedic*, the *Tantric*, and the *Darshanic* systems of philosophy." According to the poet, even in turbulent contemporary life, the individual can summon all the superhuman energy of the primordial Apeman to destroy evil forces. The invocation to Gorilla is significant:

"O Gorilla, arise, Gorilla, ! Rise from you slumber,

O Creative Power sleeping in man-O *Pitamaha*, O grandsire, who first saw the sun and moon, awake! Mankind is imploring helplessly for you-"

Inspired by primordial force, the poet says:

"The ocean does not sit at anybody's feet and bark. The voice of a storm does not know how to say yea. The mountain does not bend and salute.

I may be a fistful of earth, but when I lift my pen,

I have the arrogance of a nation's flag."

Deriving superhuman energy from primordial Nature, the individual man can survive the onslaughts of contemporary life.

Another poem of Seshendra, *"My Country, My People"*(96 pp.) has indeed heralded a new era in the poetry of twentieth-century anguish. In his Foreword to the Greek translation of the poem, the contemporary Greek poet Nikhi Phorus Vruttakose says: "Personally I would compare the pain and anguish of the poet with the one of Loutre Mont (the founder of Surrealism) in his lyric *Mald-Aurore*. The difference is that Seshandra's protest is not made in the void. He walks firmly on the soil. At times we observe in his poem a Biblical and prophetic tone which attracts us." Contemporary Progresive Poetry in Telugu, under the leadership of Sri Sri, has been replaced by Seshendra's traditional wisdom,

redefining the nature of contemporary man as a social being. The poet as humanist exhorts the masses to wake from slumber and march on the path to glory:

"Come, my people, take up your ploughs. Come with your women, your childran, come out of your hearths and homes, from prisons of your schools and offices, your academies and assemblies. Come, let us see centuries blown off in the winds of time.

Come, walk with me through the villages, towns and cities. Flow like floods, roar like floods, through the streets and highways of our nation."

As a luminary on the contemporary Telugu literary scene, Seshendra has shed the light of past centuries on the present, and shown the way to the future. Without confining himself to the ivory tower, like many a traditional scholar and writer, he has shown the relevance of ancient Indian wisdom to the common man's life in the present crisis of civilization.

(Courtesy 'The Indian P.E.N.', October-December,1995).

**షోడశికి వాచస్పతి బిరుదాంకితః శ్రీమాన్ గుండేరావ్ హర్కారేగారు వ్రాసిన ఉపోద్ఘాతములో ఆయన అభిప్రాయ అంశములు కొన్ని -**

"అయం స్వతంత్రో గ్రంథః, రామాయణ విషయే స్వతంత్రా విచారా అమూల్యా అస్మిన్ గ్రంథే ప్రదర్శితాః। అత్రభవాన్ శ్రీమాన్ శేషేంద్ర శర్మా అయం ఆంధ్రాంగ్ల గీర్వాణ భాషాసు నిష్ణాతః కుశాగ్రధిషణః శాక్తాగమరహస్య విశేషజ్ఞః। వాల్మీకి రామాయణేకృతభూరి పరిశ్రమః। అస్యమహోవైదికస్య సూక్ష్మతమా విచార సరణిః అన్యాదృశీ ... రామాయణ వ్యాఖ్యా గ్రంథాః మహాపండితైః విరచితాః బహవః యే నిర్దిష్టాః తేషు తత్తచ్ఛాస్త్ర సిద్ధాంత విశేషా స్సాధక బాధక ప్రమాణ ప్రదర్శన పూర్వకం ప్రతిపాదితాః। పరమీదృశం మంత్రరహస్య ప్రకాశనం తేషు నక్వాపి ప్రతీయతే। .... శ్రీమాన్ శేషేంద్ర శర్మా అపూర్వ ప్రతిభాశాలీ ఆగమేష్వధీతీ, సాహిత్యమర్మజ్ఞః" -

# గురజాడ తోడు శేషేంద్ర

**-ఆర్.ఎస్. సుదర్శనం**

యుగకర్త గురజాడ తర్వాత తెలుగు సాహిత్యంలో ఆ యుగకర్తృత్వాన్ని ముందుకు ఒక మెట్టుపైకి తీసుకువెళ్ళిన ఖ్యాతి శేషేంద్రదే. 1996 సంవత్సరం గురజాడ అవార్డుని ఆయనకు అందజేయడంలో ఎంతో ఔచిత్యం ఉంది.

తెలుగు సాహిత్యంలో రూసో నవ్య మానవతా వాదాన్ని ప్రవేశపెట్టినవాడు గురజాడ. ఇది ఆనాటి కాల్పనిక వాదంలో భిన్నమూ, విశిష్టమూ అయిన మార్గం. ఈ మార్గంలో మార్క్సిజమ్ వక్రీకరణ కొన్ని దశబ్దాలు తన ప్రభావం చూపింది ఆ వక్రీకరణను సరదిద్ది కొత్తబాటలు వేసిన శేషేంద్ర - మండే సూర్యుడు, నా దేశం నా ప్రజలు, గొరిల్లావంటి రచనల్లో 'విప్లవభాషా విధాత' అయ్యాడు. గురజాడ గేయాన్ని దిద్దితే, శేషేంద్ర వచన కవిత్వానికి కొత్త ఆకృతినే గాక వస్తువు రీత్యా నూత్న జవసత్వాలను చేకూర్చాడు. ఒక వైపు వైదిక, ఔపనిషదిక సంస్కృతిని మానవతావాదంతో సమన్వయించి మార్గదర్శకత్వం వహిస్తూనే, ఉర్దూ, ఫ్రెంచ్ కవిత్వాలలోని అందాల్ని ఆకళించుకొని నూతన రసాకృతితో దర్శనమిచ్చాడు. విమర్శకునిగా సుందరకాండకు, నైషదానికి ఆయన చేసిన వ్యాఖ్యానాలు, హైందవ ఆధ్యాత్మిక మార్గంలో కరదీపికలు. గద్య రచనలు ఆయన మేధాశక్తి విన్యాసాలు; పద్య రచనలు ఆయన వ్యక్తిత్వ సమగ్రతను దర్శింపజేస్తాయి. గురజాడలో ఇవన్నీ మౌలికంగా ఉన్నాయి. ''కన్యాశుల్కం'' లో చివరి ఘట్టంలో భగవద్గీతకు శ్రీ కృష్ణునికి గురజాడ యిచ్చిన స్ఫూర్తి గమనింపదగినది. మానవ స్వేచ్ఛకు నివాళి యిచ్చిన గురజాడ చివరి గేయం ''లంగ రెత్తుము''లో పంజరమ్మును పగుల దన్నడంలో, సమాజంలో వ్యక్తిలో గల భయాన్ని కృపణత్వాన్ని అధిగమించడానికి ఆయన చేసిన ప్రయత్నంలో, పూర్తి విజయం సాధించ లేక పోయాడనే నిరాశ కన్పిస్తుంది. అది ఒకరితో ముగిసే ప్రయత్నం, కృషి, ఉద్యమం కాదు. మానవాళి పయనిస్తున్నది స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం ధ్యేయాలుగా. ఆ దిశలో మార్గంలో గురజాడ తోడు శేషేంద్ర! నీడ కాదు, తోడు!.

**(గురజాడ అవార్డు విశిష్ట సంచిక, 21-9-1996, సహృదయ సాహితి, విశాఖపట్నం)**

# మహాకవి శేషేంద్ర

ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం

*("నవయుగ రత్నాలు" అనే గ్రంధం నుంచి)*

విశ్వనాధ, శ్రీశ్రీల లాగా సమకాలీన తెలుగు సాహిత్యంలో నిస్సంశయంగా శేషేంద్ర శర్మ జీనియస్.

మండే సూర్యుడుగా పిడికిలెత్తి నప్పటి నుంచీ తెలుగులో వచన కవిత్వం శేషేన్ మార్కు భావచిత్రాల పట్టుశాలువా కప్పుకోవటం నేర్చుకుంది; అభివ్యక్తిశిల్పంతో వేడి వెన్నెలలు వెదచల్లటం ప్రారంభించింది.

*"చెట్లకు వ్రేలాడిన శిరసులు పూస్తున్నయ్*
*కొమ్మల్లో పూలై*
*గోలీ దూరిన గుండెలు కదలుతున్నాయ్*
*గుడిలో ఘంటలై*
*ఎందరు ఎన్ని రాత్రుల రక్తం పిండిఇచ్చారో*
*ఈ దినం కోసం...."*

తనకు ముందున్న అకవితా నైరాశ్య శిశిరం నుంచి కవితా వసంతంలోకి అభివ్యక్తి శిల్పాన్ని నడిపించి నెత్తురు పూలు కొమ్మలకు పూయించాడు శేషేంద్ర శర్మ.

శేషేంద్ర శర్మకు ఒక సాహిత్యయుగ కర్తకుండే సహజ లక్షణాలు పుష్కలంగా ఉన్నాయి. ఆధునికాంధ్ర సాహిత్యంలో దాదాపు 1935 నుండి అనేక రకాల సమస్యలు సాహిత్యక్షేత్రంలో తలయెత్తాయి. సామాజిక సిద్ధాంతాల అవగాహనతోగాని, స్పృహతోగాని కవిత్వం రాయాలా? సామాజిక సిద్ధాంతాల కోసమే కవిత్వం రాయాలా? సిద్ధాంతాలకోసం రాసే రచయిత సిద్ధాంతాలకుగాని, సిద్ధాంతాలను రూపొందించే రాజకీయాది వ్యవస్థలకుగాని బద్ధుడై ఉండాలా? బద్ధుడైతేనే రాయాలా? కాకపోయినా రాయవచ్చునా? రాసినా, దానిని కవిత్వంగా విని కళారూపంలో సామాజికుడు అనుభవించటానికా? కవిత్వం విని రాజకీయ ప్రయోజనాలు సాధించే కార్యరంగంలో దూకటానికా? - ఇలాంటి ప్రశ్నలతో సాహిత్యం అతలాకుతలమై పోయింది. కవిత్వం ఒక కాలంలో రాజకీయ వర్గం ఉపయోగించుకొనే ప్రచార సాధనం మాత్రమే అనే అనుమానానికి దారి తీసేంతవరకు వచ్చింది. దేశీయంగా ఎన్నో అమూల్యమైన

విలువలు అధిక్షేపానికి గురి అయ్యాయి; విపరీత వ్యాఖ్యానాలకు పాలయ్యాయి; జాతీయమైన విలువలు సంకుచితమైనవిగా తిరస్కరింపబడ్డాయి.

విప్లవ పంథాకు నిబద్ధమైన రాజకీయ స్పృహ ఒక్కటే సాహిత్య జీవిత మన్నకరుడు కట్టిన నియంతృత్వ ధోరణికి కవిత్వం దాసోహమని నేతలు చెప్పినట్లే కవితలు నినాదాలు చేస్తున్నప్పుడు కవిత్వానికి ఆ రాజకీయ ఇనుపపాదాల తొక్కిళ్ళ నుంచి విముక్తి కలిగించి మరొక వసంతం కోసం విప్లవ పోరాటం సాగించే వీరుని కోసం ఎదురు చూస్తోంది సాహితీలోకం. గుంటూరు శేషేంద్రశర్మ ఆ వైజ్ఞానిక నాయకత్వాన్ని కవిత్వానికి అందించి తన కవిత్వాన్నే ఒక సాహిత్య ఉద్యమంగా సాగించాడు. కవిత్వాన్ని కవిత్వంగా రక్షించటానికి కవిత్వాన్ని పీడించే బహు శక్తులతో శబ్దయుద్ధం చేయాల్సి వచ్చింది; అర్థ శక్తి చూపించాల్సి వచ్చింది. సాహిత్యపు విలువలకు గౌరవం లేని కవితారంగంలో విప్లవ పంథాతోనే విలువలను కలిగించాడు శేషేంద్ర శర్మ. రాజకీయం వెంటబడి అనుసరిస్తున్న కవితకు బ్రతుకు మార్చి, జీవితాన్నంతా తన వెంట నడుపుకోగలిగిన శక్తిగా దానిని మలిచి, శిల్ప శంఖాన్ని పూరింపజేశాడు. 1975 - 85 దశాబ్దంలో తెలుగు కవితను ఆధునిక జీవకళతో ఆపాతమధురంగా అభిషేకించిన గౌరవం శేషేంద్రశర్మ సాహిత్యోద్యమకర్తగా సాధించుకున్నాడు.

సాహిత్యం మీద సాగుతున్న సాయుధ విప్లవానికి ప్రతిగా కని సేనను సమీకరించి శతఘ్నులను స్వయంగా శత్రు శిబిరాల మీద పేల్చాడు శేషేంద్ర. అడవుల్లో క్యూడా అడుగుపెట్టిన అకవిత్వాన్ని మందుపాతర్లవంటి పదబంధాలతో పేల్చిపారేశాడు. నిబద్ధత పేరుతో నిలవబెట్టిన అడ్డుగోడల్ని, అందం పేరుతో తగిలించిన అరిగిపోయిన పునరావృత్తుల్ని, అంతర్జాతీయత పేరుతో కవిత చుట్టూ కట్టిన చైనా గోడను, ఆపరేషన్ల పేరుతో అంగాలను కోసి కుట్టలేక వదలిపెట్టిపోయిన నగ్నభిషక్కుల బూతుకుడ్యాలను శేషేంద్రశర్మ బద్దలు కొట్టి శిధిలాలుగా మర్చాడు. 'జెండా వ్యాపారులు మీకుచేస్తున్న, అపార నష్టాన్ని గుర్తించండి' అని హెచ్చరించాడు.

*"నా యుద్ధాల పొగల్లోనుంచి/ పద్యాల ముఖాలు పుడతాయి*
*నా గొంతు జలపాతానికి బెదిరి/ చెదిరిపోతారు.*
కాలపు మేకులకు వ్రేలాడే కవులు
*నడిస్తే నా అడుగులు/ మబ్బుల్లో పరుగెత్తే పిడుగులు.....*
*నా ఊపిరితిత్తుల్లో గాలికాదు / గాలివానలు గాండ్రిస్తున్నాయి*

నా మాటలు ఈ దేశపు మట్టిలో / చల్లుతున్నాను
అన్ని దిక్కులా కత్తులు మొలవాలని...
మృత్యువులో కూడా నేను / ఝుంఝూమారుతాన్ని
నా కవిత్వం మనిషికి / కేవలం ఒక డిఫెన్సు" - అని ప్రకటించాడు. జీవితమంతా కవిత్వమేనని, విప్లవం కూడా జీవితంలో భాగమేననీ, కవి రాసే కవితలన్నీ అతని జీవితమంతా కరిగి ప్రవహించే మహా తరంగిణిలో కెరటాలేననీ, ఒక కవి తన జీవితంలో తత్త్వత: ఒకే కావ్యం రాస్తాడనీ - సిద్ధాంతాన్ని రూపొందించాడు. యుగకర్తకు కావలసిన ఆధునిక లక్షణాలు రెండు అతడు ఉద్యమకర్త అయి ఉండాలి; అతడు దార్శనికుడూ, సిద్ధాంత ప్రవర్తకుడూ అయి ఉండాలి. శేషేంద్ర శర్మ రెండూ!

కవిత్వం నుండి కథ వేరుపడిందని తిలక్ తీర్మానం చేసిన తర్వాత వచన కవిత్వం భావాశ్రితమైన ఖండకావ్యాన్ని ఆలంబనగా ఎన్నుకొని జీవితం సాగిస్తోంది. కుందుర్తి వచన కవితకు కథతో పునస్సంధానం చేసే ప్రయోగాలు చేశాడు. అప్పుడు సాహిత్యపరుల్లో రెండు వర్గా లేర్పడ్డాయి. కథాస్పృహను మన్నించే వర్గమొకటీ, కథలేకుండా భావచిత్ర మార్గాన్నే ఆశ్రయించిన వర్గమొకటి. కుందుర్తి ఫ్రీవర్సును కథవైపు లాగుతుంటే శేషేంద్రశర్మ దాన్ని ప్రతిఘటించి భావచిత్రం వైపు ఆకర్షించటంలో అగ్రశ్రేణిలో నిలిచాడు.

శేషేంద్రశర్మ కథాసూత్రాన్ని అందించడనే కాని, కావ్యస్పృహ, ఇతిహాస స్పృహ లేనివాడు కాదు. 'నా దేశం - నా ప్రజలు' ఆధుకేతిహాసమని శేషంద్ర ప్రకటించుకొన్నాడు. అది ముమ్మూర్తులా పాశ్చాత్య కావ్యేతిహాసాలను స్మరింపజేస్తుంది. ఎలియట్ వేస్ట్‌లాండ్ వంటి కావ్యం తెలుగులో వెలువడిన అనుభూతిని అందిస్తుంది. చిన్నచిన్న ఖండికలు. ఒక్కొక్క ఖండిక ఒక్కొక్క భావచిత్ర సంపుటి. వేస్ట్‌లాండ్‌లో అయిదధ్యాయాలున్నాయి. ఒక్కొక్క దానికి ఒక్కొక్క పేరుంది. యూరోప్‌లో ప్రపంచ యుద్ధానంతరం జీవచైతన్యాన్ని కోల్పోయి సాంస్కృతికంగా, తాత్త్వికంగా సృజనాత్మకత లేని సమాజ స్థితిని ఎలియట్ ఆ కావ్యంలో సూచించాడు. భారతీయ ఆధ్యాత్మిక దర్శనం పాశ్యాత్య పునరుజ్జీవనానికి మూలమంత్రం కావాలని ఆశించే ఒక ఆంతర సూత్రాన్ని ఆ కావ్యంలో పోషించాడు ఎలియట్. శేషేంద్రశర్మ ఆ బాణీ కావ్యాన్నీ, ఇతిహాసాన్నీ తెలుగులో ఉదాత్త ప్రయోగంగా ఆవిష్కరింపదలచు కొన్నాడు. ఆయన కావ్యాలన్నీ ప్రయోగ విశేషాలే.

కధాసూత్రం లేని కావ్యం భావచిత్ర ప్రధానాలైన కండకృతులు ధ్వనింపజేసే వస్తుభావనలోని ఏకవాక్యత మీద ఆధారపడి జీవిస్తుంది. అటువంటి దానిని నిర్మించటమూ కష్టమే, దాన్ని చదివి అర్థం చేసుకోవడమూ కష్టమే. కథా ప్రాధాన్యం ప్రాచీన కావ్యాలలో గోచరించటం వల్ల ఆధునిక కావ్యం తద్భిన్నంగా ఉండాలనీ, ప్రాశ్చాత్య మహాకవులు చేసిన ప్రయోగాల వంటివి తెలుగులో రావాలనీ శేషేంద్రశర్మ ఉద్యమించాడు.ఆయన నిర్మించిన కావ్యేతిహాసాలకు రూపం పాశ్చాత్యం; ఆత్మ భారతీయం. అందర్జాతీయ భావనకు ఆయన ఇచ్చిన క్రొత్త నిర్వచనంకూడా అదే. దేశీయత అంతరాత్మగా లేనిదే అంతర్జాతీయతకు ఆధునికంగా అస్తిత్వం లేదనీ, చరిత్రనూ సాహిత్యాన్నీ మథించి విలువైన సాక్ష్యాలను వెలికితీసి చూపించాడు. శేషేంద్రశర్మ లాగా అంతర్జాతీయ భావనను రాజకీయేతర స్పృహతో సాహిత్యంలో స్థాపించిన సమకాలీన కవి మరొకడు లేదు. అందువలననే ఆయనను ఆధునిక సాహిత్య స్పృహకు అభినవ భగీరథుడుగా విమర్శకులు భావిస్తారు. కవి ఆత్మకళతో సామాజిక స్పృహను పాదిగితే సాహిత్య స్పృహ కోడిపిల్లలా బయటకు వస్తుందని శేషేంద్ర శర్మ నిరూపించాడు

మార్క్సిజం తెలియకపోతే ఈనాటి కవి కాడు; మార్క్సిజమే వేదమని నమ్మితే ఈనాటి మేధావి కాడు. భారతీయ చింతన లేకపోతే ఈ దేశంలో మహాకవి కాడు. మార్క్సుకూ మాతృభూమికీ మధ్య ఉన్నసంబంధం ఎటువంటిదో తెలియకపోతే ఇతిహాసం రాయలేడు. ఏ విత్తులైనా ఈ నేలలో మొలిచేటట్లు నాగలి పట్టకపోతే ఈ యుగం పండదని తెలిసి కలంతో విత్తకపోతే ఆధునిక కావ్యంపుట్టబోదు.విప్లవకవి శేషేంద్రశర్మ వివేచన ఇది -

*"ఎవరు ఏడవగలరు / మరొకడికోసం?*

*అంత శక్తి ఎవడికుంది?*

*నీకోసం ఏడ్చేవాడికి / నీవు ఋణగ్రస్తుడివి*

మార్క్సుకు ఈ శతాబ్దపు / అన్నార్తులందరూ ఋణగ్రస్తులు" అని మార్క్స మహత్వాన్ని గుర్తించిన శేషేంద్ర మాతృదేశ మహాత్మ్యాన్ని వ్యాఖ్యానించిన తీరు గమనించదగింది:

*"ఈ పురాతనధూళిలో / బ్రతుకుతున్నవాడికి*

*ఒక ఇల్లు కావాలని చెప్పటానికి / మార్క్స్ కావాలా*

*నీ కిది ఇన్నాళ్ళు తోచకపోతే / నీ కంటే నేరస్తుడు లేడు."*

దేశీయతకు పోషకంగా మార్క్సిజాన్ని మన్నిస్తాడు శేషేంద్ర. ప్రపంచంలో తన దేశాన్ని ముంచడు; ప్రపంచ దేశాలతో తన దేశాన్ని స్వతంత్ర ప్రతిపత్తితో కలిపి నడుపుతాడు. మార్క్సిజం స్నేహసూత్రం; యానపాత్రం. తన దేశీయత నిండు గాత్రం; స్వప్నక్షేత్రం.

*"నది ప్రజల్ని విడిచి పోలేదు*
*భాష దేశాన్ని దాటి పోలేదు*
*నేను ఈ నేలను విడిచి పారిపోలేను*
*ఈ మట్టి కలలు కంటుంది*
*దూరదూరాల మనుషుల్ని గురించి*
*పక్షుల్ని గురించి / అడవుల్ని గురించి*
*కలలు కంటుంది/ కన్నీళ్ళు కారుస్తుంది*
*ఇవాళ నా ఊహల మహళ్ళలో దేశ దేశాల జనులు*
*సుత్తులూ కొడవళ్ళు ధరించి / ఊరేగింపులు చేసుకుంటున్నారు*
*పదండి మనమంతా కలుద్దాం, ఆ కొడవళ్ళ ఊరేగింపులో."*

విప్లవాన్ని కోరే శేషేంద్ర దేశాలవైపు చూడడు. చైతన్యం వైపే చూస్తాడు. ఎందుకంటే- 'రష్యాకాదు, చైనాకాదు, విప్లవం మాత్రం అజరామరం' అని నమ్మాడు కాబట్టి.

దేశంలో విప్లవం రావాలని శేషేంద్ర సాయుధపోరాటంలో దూకలేదు. దూకినవారు కూడా అడవుల్లో తుపాకులు మోగించినంతగా ప్రజల మెదడుల్లో మోగించలేదు. అయినా, శేషేంద్రశర్మ కవిగా విప్లవంలో తన పాత్ర నిర్వహిస్తున్నాడు.

*"నీకు జ్ఞానం కంటే ప్రేమతో పని ఉంది - నీవు కవివి*
*సుత్తులతో కొడవళ్ళతో, జీవితం శిల్పించేవాళ్ళని నిద్ర లేపుతావు*
*విప్లవానికి నీవు శుక్రతారవు"*

అని విప్లవకవి వ్యక్తిత్వాన్నీ అతని కవిత్వ ప్రయోజనాన్నీ పేర్కొన్నాడు. శేషేంద్ర ఆశించే విప్లవం ఈ దేశంలో ఎప్పుడైనా రావచ్చునేమో కాని, కావ్య జీవితం శిల్పించే వాళ్ళను నిద్రలేపటం వల్ల కవిత్వంలో రావలసిన విప్లవం మాత్రం సాహిత్య క్షేత్రంలో ఇప్పటికే గుర్తింప తగినంత వచ్చేసింది. శేషేన్ మార్క్స్ పద్యం విప్లవ కవితా శిల్ప శంఖారావంలా, భావచిత్ర స్వాతంత్ర్యోద్యమ గీతంలా కవితా వీధుల్లో మారుమోగుతోంది.

*"చంపి కొండల్లో పారేసిన వాడి శరీరం*

*ఒక రాగం కోసం బిగించిన ఫిడేలులా పడి ఉంది*
*అతడి నోరు పాడిన పాటలు*
*ప్రవహించే నదులు ఆగి ఆలకించేవి*
*చావు లేనివాడ్ని చంపే మూర్ఖులకు తెలీదు*
*ఏ మృత్తిక పువ్వును మనిషికి కానుకగా ఇస్తుందో*
*అది వాడి నిర్మాణంలో ఉందని."*

ఇది శేషేన్ మార్క్కు పద్యం. కొండల్లో అడవుల్లో ఉంటూ విప్లవ పోరాటంలో ప్రాణాలు కోల్పోయిన అమరవీరుని శవాన్ని శిల్పసుందరంగా వ్యాఖ్యానించే కవితాస్పృహ యిందులో సజీవంగా తొణికిసలాడుతోంది. ఒకనాడు 'కవిబ్రహ్మ' తిక్కన బీభత్సరమణీయంగా ఒక శిల్పతరంగాన్ని కావ్యేతిహాస కవితలో పొంగించాడు. అర్జునుని బాణాల దెబ్బలకు తనువులు తూట్లుపడి రక్తం ధారలు ధారలుగా పారుతూ ఉన్న యుద్ధవీరుల శరీరాలను పూచిన మందార వృక్షాలుగా రూపించి బీభత్స సన్నివేశాన్ని రమణీయమైన ఉపమానంతో ఆస్వాదింపజేసే కళామార్గం తెలుగుకవితకు కొత్తగా నేర్పాడు. ఆ కళను శిల్ప సుందరంగా పాటించిన తెలుగు కవులు ఆ తరువాత అరుదుగా కనపడతారు. ఆధునిక యుగంలో గుంటూరు శేషేంద్రశర్మ ఆ కళను అభినవంగా భావచిత్ర పరిధిలో ప్రవేశపెట్టి, దాని కొక కళాతత్త్వ సూత్రాన్ని కల్పించి శేషేన్ మార్క్కును రూఢి కెక్కించాడు.

*"ఒక అందమైన పోయెంఅంటే*
*దానికి ఒక గుండె ఉండాలి*
*అది కన్నీళ్లు కార్చాలి*
*క్రోధాగ్నులు పుక్కిలించాలి*
*పీడితుల పక్షం అవలంబించి*
*మనిషి ఋణం తీర్చుకోవాలి*
*బ్రతకడానికి ఒక బురుజై మనిషి*
*విజయానికి జెండా అయ్ ఎగరాలి".*

ఇది శేషేన్ మార్క్కు కావ్య నిర్వచనం. దాదాపు అరవై యేళ్ల నుంచి ఆధునిక ప్రసిద్ధ కవులు కావ్యం ఎలా ఉండాలి? కవిత్వం ఎలా ఉండాలి? అనే అంశాలమీద తమ దృక్పథాలను కావ్యఖండికలుగానో, వ్యాసాలుగానో, పీఠికలుగానో రాసి ఉంచటం ఒక సంప్రదాయమైపోయింది. 'సిందూరం రక్తచందనం.... కావాలోయ్ నవ కవనానికి'

అని శ్రీశ్రీ ఒక విధంగా ఈ మర్యాదకు శ్రీకారం చుట్టాడు. ఇందులో ఉన్న గడుసుదనం ఏమంటే - కవి తన కవిత్వంలో ఉండే సాపేక్ష లక్షణాలనే తన ఉద్యమ కవితాసాధారణ లక్షణాలుగానో, తన యుగ చైతన్యాన్ని మోసుకొని వచ్చే యుగకవితా లక్షణాలుగానో చెపుతూ, దానినే సర్వకాలసర్వావస్థలలో కవిత కుండవలసిన ఉత్తమ లక్షణాలూ ప్రకటిస్తున్నట్లుండటం. అయితే, ఇటువంటి గడుసుదనం ప్రకటించినవారు ఈ అరవై యేళ్లకవితాచరిత్రలో వేళ్లమీద లెక్క పెట్టదగినంతమంది మాత్రమే ఉన్నారు.

ఆ ప్రామాణిక కవిపంచకం - శ్రీశ్రీ, విశ్వనాథ, తిలక్, కుందుర్తి, శేషేంద్రశర్మ. ఆధునిక కవితా లక్షణ చర్చలలో ఈ అయిదుగురు చెప్పిన కవితలు అయిదు రకాల ఉద్యమాలకు ప్రాతినిధ్యం వహిస్తున్నాయి. అందువలన వారి కావ్య, కవితా లక్షణాలను తెలిపే కవితలు ఆధునిక కవితా పరిణామంలో మైలురాళ్లుగా పనికి వస్తున్నాయి.

లక్ష్యం ఉంటేనే లక్షణం పుడుతుంది. తన లక్ష్యాన్నే చూసి లక్షణం చెప్పేవాడు కవి. ఇతరుల లక్ష్యాలనుసమీక్షించి లక్షణాలు చెప్పేవాడు విమర్శకుడు. పై కవిపంచకం తాము చెప్పిన కవితా లక్షణాలను తమ కవితలలో పాటించినవారు. మిగిలినవారిలో చాలమందికి ఆ సామర్థ్యం కనపడదు. అందువలన పై కవులయిదుగురు వెలువరించిన సాహిత్య దృక్పథాలను, వారి రచనలను భద్రపరచవలసిన అవసరం, అధ్యయనం చేయదగిన అగత్యం తప్పకుండా ఏర్పడుతోంది. ఇప్పటికే ఆయా కవుల రచనల సర్వస్వాలు కొన్ని వెలువడ్డాయి. మరికొన్ని వెలువడుతున్నాయి. విశ్వనాథ సాహిత్యమంతా కొన్ని సంపుటాల్లోవెలువరించే ప్రయత్నం 1995లో జరిగే శతజయంతి నాటికి ఒక రూపం దాల్చింది. శేషేంద్రశర్మ తన కవితా సంపుటుల నన్నింటిని (చాలవరకు) కలిపి 'ఆధునిక మహాభారతము', 'జనవంశమ్' అనే కావ్యాలూ ప్రచురించారు. అందులోనూ శేషేన్ మార్క్ను చెక్కుచెదరకుండా రక్షించుకున్నారు.

ఆదునిక మహాభారతం పదిపర్వాల కావ్యేతిహాసం. ఒక్కొక్క పర్వము ఇదివరలోనే ప్రత్యేకంగా వెలువడిన ఒక్కొక్క కావ్యం. ప్రక్రియాపరంగా అలనాడు నన్నయది ఒక రకమైన కావ్యేతిహాసం. ఈనాడు శేషేంద్రది ఆధునిక కావ్యేతిహాసం. ఈ ప్రక్రియకు, శైలికి సంబంధించిన విషయాలు నా 'సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు'లో చర్చించాను.

ఆధునిక మహాభారతంలోని కథాదులను గురించి శేషేంద్ర చెప్పిన మాటలు - "కాలానుగతంగా లోకధర్మం పుడుతుంది. లోకధర్మాన్ని చూపించే పురాణ ఇతిహాస

కావ్యశాస్త్రాదులు పుడతాయి. వ్యాసమహాభారతం ప్రాచీన ప్రజల కోసం పుట్టింది. ఈ ఆధునిక మహాభారతం ఆధునిక యుగాన ప్రజల కోసం పుట్టింది. వ్యాస భారతం ఉత్తర దేశంలో పుడితే ఆధునిక భారతం దక్షిణ దేశంలో పుట్టింది. ప్రాచీన భారతం పండితభాషలో పుడితే ఆధునిక భారతం ప్రజల భాషలో పుట్టింది. తొలుత వ్యాసభారతం ఎనిమిదివేల శ్లోకాలు గల 'జయం' అనే ఇతిహాసం అయితే, ఆధునిక భారతం ఎనిమిది సర్గలు గల 'నా దేశం నా ప్రజలు' అనే ఇతిహాసంగా అంకురించింది. అది భూమి కోసం జరిగిన యుద్ధమైతే, ఇదికూడా భూమికోసం జరిగిన యుద్ధమే. అక్కడ ఉన్నత కుటుంబాలు భూమిని హస్తగతం చేసుకోడానికి యుద్ధం చేస్తే ఇక్కడ ప్రజానీకం భూమిని హస్తగతం చేసుకోడానికియుద్ధం చేస్తారు. వ్యాసభారతం లాగే ఇది కూడా క్రమంగా పెరిగి బృహద్గ్రంధం అయింది. దానిలాగే ఇదీ ఇతిహాసము, పురాణము, మహాకావ్యము, పారాయణ గ్రంథము, పుణ్యప్రదము. వర్గ చైతన్యం జ్వలింపజేయడమే ఇక్కడ కావ్య హృదయం."

కొన్ని లక్షణాలు పండినట్లుంటాయి; కొన్ని పిండినట్లుంటాయి. శేషేంద్ర శర్మ ఆధునిక మహాభారత లక్షణం పిండినట్లుగా ఉంటుంది; దీనికి అనుబంధ కావ్యమైన 'జనవంశమ్' కావ్యలక్షణం పండినట్లుంటుంది. లక్ష్య లక్షణాలు మాత్రం ఆదిచూచి కుట్టిన అనువైన సూటులాగా అమరుతాయి.

ఆధునిక మహాభారతం సంకలనం కాదు; సంపూర్ణకావ్యం అని సమర్థించుకొంటూ కవి ఒక లక్షణాన్ని రూపొందించాడు - "ఒక కవి తన జీవితంలో ఒకే కావ్యం రాస్తాడు. అయితే, దాన్ని అప్పుడప్పుడూ క్రమక్రమంగా రాస్తూ ఉంటాడు. అలా రాయబడే ఒక్కో కృతి నిజంగా పూర్ణకృతి కోసం పుట్టే ఒక్కో పర్వం. కావ్యయాత్ర అంతిమ చరణంలో అన్ని పర్వాలూ కలిసి ఒక కావ్యం మాత్రమే అవుతుంది." ఈ లక్షణానికి తగ్గట్టుగా ఉంటుంది ఆ రచన. అలాగే, ఇతిహాసానికి ఒక కావ్యం అనుంధంగా రావటం విశ్వసాహిత్య సంప్రదాయంగా పేర్కొంటూ 'జనవంశమ్' ప్రయోగాన్ని సమర్థించుకున్నాడు.

ఆధునిక మహాభారతంలో అందమైన పోయెంకు చెప్పిన అన్ని లక్షణాలూ అమరుతాయి. పరిశీలించి చూస్తే అందులోని పర్వాలకే ఆ లక్షణాలు సూక్ష్మంగా ఉన్నాయి. మహాకావ్య నిర్మాణంలో ఖండకావ్యం వచ్చి మార్పులు తెచ్చింది. ఆశ్వాసాల నిడివితగ్గింది. ఖండాలు తలయెత్తాయి. మినీకవితలు, చమత్కారికలు, లఘు కవితలు పుట్టి, భావచిత్రాల సంఖ్యపై కవిత నిడివిని కల్పించే పద్ధతి వచ్చిన తరువాత

శేషేంద్రశర్మ ఆధునిక మహాభారతం పుట్టింది. ఆ తరువాత 'జనవంశమ్' పుట్టింది. శర్మ రాసిన అన్ని రచనలూ ఇందులో నవ్య సంవిధాన విధానాలతో సంపుటీకరింపబడ్డాయి. పద్యకవితలు, వచనకవితలు, పన్నాకవితలు, పేరాకవితలు, ఆశువులు, చాటువులు, చమత్కారికలు, మధ్య మధ్య వచనంలో కథనం, అక్కడక్కడ సంస్కృత శ్లోకాలు, క్వాచిత్కంగా గేయ గతిగల రచనలు - ఇలా ఎన్నో రకాల రూపాలు ఇందులో చేరాయి. అభివ్యక్తి కొక రూపమే ఉపాదేయమనే భావం ఆధునికం కాదనీ, కవికి స్వేచ్ఛ ప్రాథమిక ధర్మమనీ ఈ ప్రయోగాలు చెపుతున్నాయి. అందుకే అంటాడు శేషేంద్ర -

*"నా కన్నులమీద వాలిన*
*సీతాకోక చిలుకలే కవితలు"*

ఏ కాలంలోనైనా ఎవరైనా ఒక మహాకవిగా గుర్తింపబడాలంటే అతడు అయిదు నవ్యతలతో సాహితీ లోకంలో తన ప్రత్యేకతను ప్రపంచించుకోవాలి. శేషేంద్ర శర్మగారికి ఆ లక్షణం పూర్తిగా వర్తిస్తుంది. సమాకలీన సాహిత్యంలో తనదైన కవితా దృక్పథాన్ని వ్యక్తీకరించి సాహితీ స్పృహకు ప్రాణం పోయటం మొదటినవ్యత. అభివ్యక్తిలో తనదైన భాషకు పరిభాషను కల్పించుకొని దానికి సాహిత్యంలో ప్రచారం తీసికొని రావటం రెండవ నవ్యత. తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేయగల నూత్న ప్రక్రియలను, ప్రయోగాలను చేసి చూపించటం మూడవ నవ్యత. కవిత్వంలో తనదైన శైలి నొక దానిని నిర్మించుకొని దాన్ని సమకాలీన కవులు ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ అనుసరించేటట్లు ప్రభావాన్ని ప్రసరించటం నాలుగో నవ్యత. తెలుగు సాహిత్యంలోనే కాక ఇతర భాషా సాహిత్యాలలో కూడా తనబాణీ కొన్ని క్రొత్త మలువులకు దారితీసేటట్లు ప్రేరకం కావటం అయిదో నవ్యత. ఈ అయిదు నవ్యతలను ఆధునికాంధ్ర కవితా ప్రయోగాలకు అందించిన శేషేంద్ర శర్మ - కాలాన్ని మలిచిన కవిగా, కాలం మరువలేని మహాకవిగా నిలుస్తాడు.

* * *

# నా దేశం - నా ప్రజలు

## -ఆచార్య కోవెల సంపత్కుమారాచార్య

ఇంచుమించు పది సంవత్సరాల క్రితమే అచ్చుకెక్కవలసి వుండిన ఈ శ్రీ శేషేంద్ర 'నా దేశం - నా ప్రజలు' కావ్య విశ్లేషణ గ్రంథం - అచ్చంగా ఆనాటి రూపంలోనే కావచ్చు - ఈ నాటికయినా వెలువడటం సంతోషించదగిన అంశమే. ఈ పదేండ్ల మధ్య కాలంలో శ్రీ శేషేంద్రను గూర్చి, ఆయన వివిధ కావ్యాలను గూర్చి వచ్చిన విమర్శ సాహిత్యం తక్కువేమీకాదు. అయినా ఈ ప్రస్తుత గ్రంథం తన తాజాతనాన్ని కోల్పోకపోవటంగూడా ఒక విశేషమే. చిరంజీవి శ్రీనివాస్ ఈ పరిశోధన, లేదా పరిశీలన, విశ్లేషణ ఎం. ఫిల్. పట్టా సాధించటం కోసం చేశాడు. సాధించాడు. శేషేంద్ర రచనలు, ప్రత్యేకించి ఈ కావ్యం విశ్లేషణ ఆటాటలు కాదనీ, ఆషామాషీ వ్యవహారం కాదని తెలిసి తెలిసి ప్రవర్తించాడు అందుకే శ్రమించాడు. అధ్యయనం చేశాడు. శేషేంద్ర రచనల గూర్చి తన అవగాహనతో, పెద్దల వలన సంపాదించిన వివరణలతో- స్వయంగా కవితో సాగించిన సంభాషణలతో 'విన్నంత, కన్నంత, తెలియవచ్చినంత'గా ఈ రచన చేశాడు. ఈ కావ్య సముద్రం ఆటుపోటులతో సతమతమవుతూ, మునుగుతూ తేలుతూ ఈ రచన చేశాడు. ఈ లక్షణం ఆద్యంతమూ ఈ రచనలో స్పష్టపడుతూనే వుంది

శేషేంద్ర అత్యంత విలక్షణమయిన కవి. అందుకే అరుదయిన కవీ, అపురూపమయిన కవీకూడా. ఒక విధంగా చెప్పితే ఆయన 'పదవి.' మరి, 'పదవి' అంటే ఏమిటో ఈ రచనలో (పు. 61) శ్రీనివాస్ వివరించనే వివరించాడు. ఆ వివరణను గమనిస్తే శేషేంద్రను 'పదవి' అనటంలోని ఔచిత్యం, సామంజస్యం స్పష్టపడుతుంది. ఈ ఔచిత్యమూ, సామంజస్యమూ శేషేంద్రకు ఆషామాషీగా, అలవోకగా లభించలేదు. తన వయస్సునూ, పాండిత్యాన్నీ, ప్రతిభనూ, అనుభవాన్నీ, దర్శనాన్నీ పిండి, మాటల గొంతుల్లో రక్తంపోసి, బాధానుభవ పూర్వకంగా సాహిత్యానికి - కావ్యానికి బలిచేశారు. ఆయన సర్వ కావ్య ప్రపంచమూ ఈ బలిరూపమే. అంతటి బలి అయితేనేగాని అంతటి మహాకావ్య

శక్తి ఆవిష్కారం కాలేదు. అయింది. ఇందుకు ఆయన సర్వరచనలూ ఉదాహరణమే. విశేషించి 'నా దేశం - నా ప్రజలు' మహాకావ్యం.

శేషేంద్ర సమాకాలీనంగా వచనకవితారంగాన వీరవిహారం చేస్తున్న అకవితా వీరంగంతో ఒంటిరి 'పోరాటం' సాగించారు. నిజానికి ఈ అకవితా లక్షణంతో విసిగిపోయిన, ఇబ్బందులు పడ్డవాళ్ళు లేకపోలేదు. ఎదుర్కొన్నవారూ లేకపోలేదు. కాని, 'పోరాటం' ఆయన పాలబడ్డది. ఈ పోరాటంలో ఆయన తిన్న దెబ్బలూ, పడ్డ ఇబ్బందులూ, పొందిన నిష్ఠురాలూ తక్కువేమీ కాదు. అందుకని ఆయన 'కవిసేన' సృష్టించాడు. దాని మేనిఫెస్టో వెలువరించాడు. అందులో ఆయనకు అకవిత్వం పై గల కసి అక్షరాక్షరంగా ప్రజ్వలిస్తూనే వుంది. అయినా, అది ఆధునిక కావ్యశాస్త్రంగా రూపొందింది. అభిప్రాయ భేదాలూ, పొరపులూ వున్నాగూడా అది అందరినీ తీవ్రంగా ఆలోచింపజేసి రెచ్చగొట్టి ఒక అపూర్వ సంచలనం కలిగించిన కావ్యశాస్త్రం.

శేషేంద్ర వేదోపనిషదాదిగా ప్రవర్తించిన దేశీయ జ్ఞాన విజ్ఞానాలనూ, ఆధునిక విజ్ఞానాన్నీ సమన్వయించుకొని అనుభవంలోకి తెచ్చుకొన్న గొప్ప ప్రతిభా పాండిత్యశాలి. సంప్రదాయాన్నీ, సమకాలీనతనూ ఆత్మకళగా రంగరించుకొని జీవితాన్ని దర్శించిన దార్శనికుడు. అందుకే ఆయన ఉద్యమాలవెంట అలవాటుగా పడిపోలేదు. ఉద్యమాన్ని సృష్టించారు. కావ్యరంగంలో కవితాస్పృహను తిరిగి ప్రతిష్ఠించారు. వచన కవితా మార్గంలో మహాకావ్య సంప్రదాయాన్ని నెలకొల్పారు. అద్యంతమూ కవితా నిర్భరంగా మహాకావ్యం లక్ష్యప్రాయంగా రచించారు. ఆ కావ్యం 'నా దేశం - నా ప్రజలు' . ఆయన కవితా సంకలనాలు చాలానే వున్నాయి. అయినా ఆయన రచించిన మహాకావ్యం ఒకే ఒకటి: 'నా దేశం- నా ప్రజలు' .

కవితా ఖండికల రచనా శక్తి వేరు, మహాకావ్య రచనా శక్తి వేరు. 'ముక్తకే కవయోऽనంతాః। సంఘాతే కవయశ్శతం। మహాకావ్య నిర్మాణేతు। ఏకోద్వా దుర్లభాస్త్రయః' అంటాడు ఒక ప్రాచీనుడయిన కావ్యవేది. మహాకావ్యవిషయంలో 'నిర్మాణం' అత్యంత ప్రాధాన్యం వహిస్తుంది. కావ్యానికయిన వస్తువు కథారూపంగా

పరచుకొని, నిర్మాణ మహితంగా మహాకావ్యాన్ని ఆస్వాద్యం, అనుభావ్యం చేస్తుంది. కాని, కథ లేకుండా మహాకావ్య రచనా వస్తువును భావాలుగా అనుభవాలుగా గుదిగుచ్చుతుంది. ఈ గుది గుచ్చటంలోనే నిర్మాణ కౌశలం అభివ్యక్తమవుతుంది. '....ఒకటఁ బూర్వోత్తర విరోధ మొదవకుండ। తత్తదవయవ వాక్య తాత్పర్యభేద। ములు మహావాక్య తాత్పర్యమునకు నొనర। బలుకనేర్చుట బహు తపఃఫలము కాదె' అంటాడు పింగళి సూరన. కథలేని మహాకావ్యరచనకు సూరనోక్తి ఒక సూత్రం. మహావాక్యమంటే మహాకావ్యమని భారతీయాలంకారిక సంప్రదాయం సంకేతించింది. మహాకావ్యంలో 'ఏక వాక్యత' అవసరం - మౌలికాంశ మని తాత్పర్యం కథావస్తు విరహితంగా భావానుభవాలను గుది గుచ్చటంలో ఏకవాక్యత సాధించటం అంత సులవయిన వ్యవహారం కాదు. ప్రధానంగా శ్రీనివాస్ 'నా దేశం - నా ప్రజలు' మహాకావ్యంలో ఏక వాక్యతను బహుశః మొదటి సారిగా కావచ్చు - వీలయినంత సమగ్రంగా విశదీకరించటానికి ప్రయత్నించాడు. సర్గ నిర్మాణంలో 'ఉపసర్గ' నిర్మాణాన్నీ, అందులోని ప్రయోజనాన్నీ, ఏక వాక్యతకు దాని ఉపకారాన్నీ విశ్లేషించాడు. ఈ విశ్లేషణలో సాఫల్యం సంపాందించాడనేది గ్రంధంలో సహృదయులకు అవగతమవుతుంది.

'నా దేశం - నా ప్రజలు' మహాకావ్యమా? ఇతిహాసమా? ఎపిక్కా? అనేది ఒక చర్చావిషయమే అయింది. శ్రీనివాస్ వివిధ కోణాలనుంచి పరిశీలన, విశ్లేషణ నిర్వహించి ఇది మహాకావ్యమే అని నిర్ధారిస్తున్నాడు. 'మహా కావ్యా'దులకు మన అనుకూలాన్ని బట్టి నిర్వచనాలు ఏక పక్షంగా చేయటం కాకుండా సాహిత్య గతిశీలం భూమికగా పూర్వోత్తర సందర్భాల సమన్వయంతో వస్తుపరమయిన దృష్టితో శ్రీనివాస్ ఈ నిర్ధారణ చేశాడు. అయితే, ఒక విచిత్రం గమనించవలసి వుంది. ఒక ప్రక్రియలో మరొక ప్రక్రియాలక్షణాలు ఏవో కొన్ని దృశ్యమానం కావచ్చు - కావ్యంలోనాటకీయతవలె. అట్లాగే మహాకావ్యంలోనూ ఇతిహాస లక్షణాలు స్ఫురించవచ్చు. అయినా అది మహాకావ్యమే అవుతుంది 'నా దేశం - నా ప్రజలు' ఆ విధమయిన మహాకావ్యం ఇక, అది ఎపిక్ కావటమనేది అతి దూరాన్వయమే. అందుకని ఆ దూర క్లిష్ట లక్షణాలను శ్రీనివాస్ ప్రదర్శించాడు. తన విశ్లేషణలో ప్రధానంగా సాధించిన అంశాలు ఈ రెండు.

కావ్యోదయ భూమిక మొదలుగాఆధునిక కావ్య పరివేషంవరకు ఆరు అధ్యాయాలతో, ప్రక్రియ మొదలు తాత్త్విక వీచికదాకా పదిహేను ఉపశీర్షికలతో రూపొందించబడిన ఈ శ్రీనివాస్ విశ్లేషణ ' నా దేశం - నా ప్రజలు' కావ్యాన్ని వివిధ కోణాలనుంచి పరిశీలించింది. ప్రక్రియా పరిశీలనం, కావ్యవస్తు విన్యాసం, శిల్పరేఖ అన్న మూడధ్యాయాలు శ్రీనివాస్ విశ్లేషణకు చక్కని ఉదాహరణలు. కావ్యదర్శనమన్న అధ్యాయం కవితాస్పృహలోని దీప్తిని కొంత సంగ్రహంగానే కావచ్చు గాని మార్గదర్శకంగా చిత్రించింది. ఆధునిక కావ్య పరివేషం అన్న చివరి అధ్యాయం సమకాలీన వచన కవితా ప్రపంచంలో 'నా దేశం - నా ప్రజలు' కావ్య విశిష్టతను, దాని స్థానాన్నీ నిరూపిస్తుంది.

శేషేంద్ర వచన కవితా రంగానికి ప్రతీకామయమయిన ఒక 'విచిత్ర' కవితా. భాషను, కావ్యావాక్కును ప్రదానం చేశారు. దాన్ని విప్లవ కవితాభాష అనో, మరేదో భాష అనో అని దాని పరిధిని సంకుచిత పరచటం కన్నా విలక్షణమయిన 'విచిత్ర కావ్యవాక్కు' అనటంలోనే దాని విస్తృతి, వ్యాప్తి సరిగా అవగత మవుతాయి. శేషేంద్ర 'విప్లవం' దేశీయతా నిబద్ధమయింది. అందుకే రైతు, శ్రమ, శ్రామికుడు, శ్రామికత ఆయన కవితావస్తువు. ఈ వస్తువును ఆయన విచిత్ర కావ్యవాక్కు తళ తళలాడించింది. వస్తువును హృదయ దఘ్నంగా అనుభవంలోకి తెచ్చింది. క్రియాశీలాన్ని ఉద్బుద్ధ పరచింది. ఈ విధమయిన కావ్య వాగ్లక్షణాన్ని 'పదస్పృహ' లో శాఖాచంద్ర న్యాయంగా శ్రీనివాస్ వ్యక్తీకరించాడు.

శేషేంద్రలో ప్రధానమయిన అంశం దేశీయత ఈ దేశీయతా భూమిక మీద మనిషి ఎదిగి విశ్వజనీనతను సాధించటం ఆయన కవితా మర్మమేకాదు, లక్ష్యం కూడా. ఈ లక్ష్యాన్ని సాధించే 'నా దేశం - నా ప్రజలు' కావ్యాన్ని లక్ష్యం ఏ విధంగా అభివ్యక్తమయిందనేది వివిధ దిశలనుంచి విశ్లేషించటానికి శ్రీనివాస్ నిష్ఠాపూర్వకంగా చేసిన ఈ కృషి నా పర్యవేక్షణలో సాగటం నాకొక తృప్తిని, సంతోషాన్ని కలిగిస్తున్నది. గ్రంథం చివరవిలువైన అనుబంధాలుగా వున్న శేషేంద్రతో ముఖాముఖీ సంభాషణలు సాహిత్యరంగాన కావ్యవాక్కువంటి అనేక సమస్యలకు సమాధానాలు వెదకటానికి వీలుగా శ్రీనివాస్ చేర్చటం అదనపు లాభం

అనేకానేకమయిన అంతర్బహిఃకారణాలవల్లా పదేళ్ళపాటుగా స్తబ్దపడి మందకొడిగా వుండిపోయిన శ్రీనివాస్ ఈ గ్రంథప్రచురణవల్ల ఉత్తేజితుడనిపిస్తున్నాడు ఈ ఉత్తేజాన్ని పరిపోషించుకొంటూ క్రియాశీలిగా సాహిత్యరంగంలో ఎదగాలని హృదయపూర్వకంగా ఆకాంక్షిస్తూ, ఈ గ్రంథం ద్వారా అతనికి మంచి ప్రోత్సాహం సహృదయులు అందిస్తారని ఆశిస్తూ, ఆశీరభినందనలతో-

(శ్రీముక్తవరం శ్రీనివాసాచార్యులు రచించిన "గుంటూరు శేషేంద్రశర్మగారి 'నా దేశం – నా ప్రజలు'– ఒక అధ్యయనం" అనే ఎం.ఫిల్. సిద్ధాంత గ్రంథానికి **29–5–1995** నాడు ఆచార్య కోవెల సంపత్కుమారాచార్యగారు వ్రాసిన, 'రచనాభినందన' అనే పేరుగల పీఠిక).

## Sri Gunturu Seshendra Sarma
## Kasinaadhuni Nageswara Rao Puraskar

తెలుగు కవిత్వంలోంచి రాజకీయ కాలుష్యం ఆయన తొలిగించారు. తెలుగు కవిత్వంలోంచి అయోమయం ఆయన తొలిగించారు. తెలుగు కవిత్వానికి సరిహద్దురేఖలు తొలిగించారు. ఆయన కవిత్వం మౌలిక విలువలకు ఎనలేని కీర్తి సంపాదించింది. ఆయన కవిత్వం ఆయన అంత అందంగా వుంటుంది ఆయన సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత. ఆయన మేటిరచన 'నా దేశం -నా ప్రజలు' టి.యస్. ఇలియట్ మహాకావ్యం 'వేస్ట్ లాండ్' తో పోలుస్తారు.

### కాశీనాథుని నాగేశ్వరరావు పురస్కార్

శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మగారికి

**MADRAS TELUGU ACADEMY**
Malony Road, T. Nagar, Madras

26-3-1995

# విప్లవజ్వాలకు వింజామర

-వడలి మందేశ్వర రావు

మనకు సంప్రదాయ న్నెరిగి, ఆధునికత అంటే సచేల స్నానంచేసే పండితులూ, కవులూ ఉన్నారు. ఆధునికతను ఆలింగనం చేసుకొని సంప్రదాయ మొక రోత అన్న ఫోబియా ఉన్న మేధావులూ,మేధావి కవులూ ఉన్నారు. సంప్రదాయ న్నెరిగినట్లు నటించే ఆధునికులూ, ఆధునికత నవగాహన చేసి కొన్నట్లు భావించే సంప్రదాయ నిష్ఠులూ ఉన్నారు. కాని, సంప్రదాయం రక్తనిష్ఠమై ఉంటూ, ఆధునికత ఆవశ్యకతను గుర్తించి, దానిని కవితకు ఆవహింపచేసిన కవులు చాల కొద్ది మంది ఉంటే, వారికి శేషేంద్రశర్మ నాయక స్థానంలో ఉంటారు.

శేషేంద్రశర్మ సంస్కృతంలో గట్టి పండితంలేకాక, గొప్ప పండితులనికూడా చెప్పాలి. ఇలా సంస్కృతంలో గాఢ పరిచయమున్నవారికి కాల క్రామానఅన్నీ అందులోనే ఉన్నయనిపిస్తుంది. క్లాసిసిజమ్ ఎక్కడ ఉంది? వాల్మీకంలో. రొమాంటిసమ్? వాల్మీకంలో. ప్రతీకవాదం? వాస్తవికత?... వాల్మీకంలోనే! ఒకమహాకవి రచనల్లో ఒక దేశసంస్కృతికి ఆధార భూమిగా ఉన్న ఉద్గ్రంథాలలోఅనేక భావాలూ, ఆదర్శాలూ బీజరూపంగా ఉండవచ్చు, ఉంటాయి- ఆ కవులుద్రష్టలు కనుక, మహామనీషులు కనుక. కాని వారికి ఎన్నడో ముందు కాలంలోవచ్చే భావజాలంపట్ల సమగ్ర దర్శనం నాడే ఏర్పడి ఉందని చెప్పలేము. తర్వాతికాలాలవారు చేయకల్గింది నూత్న దృక్పథానికి వెనుకటి శాస్త్రాలలోనూ,కావ్యాలలోనూ భూమిక ఏమయినా ఉన్నదా? అని చూసుకోవాలి. ఆ వెనుకటిఆలోచనల నుండి ఈ నూత్న ఆలోచనలు ఉన్మీలిత మయ్యాయా, అని చూసుకోవాలి. వానికీ, వీనికీ ఒక సమస్వయం సాధించాలి. సమన్వయం సాధ్యం కాకపోతే వాని నివి ఎందుకు వ్యతిరేకిస్తున్నాయో చెప్పాలి.

శేషేంద్రశర్మగారు సంస్కృత పండితులై ఉండి కూడా, ఆయన చూపును భరతవర్షంనుంచి ప్రపంచంలోని ఇతర దేశాల వైపునకు మళ్ళించారు ఇతర

భాషలలోని మహాకవులతోనూ, విమర్శకులతోనూ, అలంకారికులతోనూ పరిచయం ఏర్పరచుకున్నారు. తన సంప్రదాయం మైలపడిపోతుందేమోనని కాని, ఇతర సంప్రదాయాలు భారతీయ సంప్రదాయాలమీద దాడిచేస్తూ వానిని పరాభూత మొనరిస్తాయన్న శంకతో కాని, భయంతో కాని, ఆయన హృదయ కవాటాలను మూసి ఉంచలేదు. విశాలంగా తలుపులను తెరచే ఉంచాడు అందులోకి సమస్త దేశాల ఆలోచనలను, కావ్యానుభూతులను ఆహ్వానించాడు. ఆయనకు మన ప్రాచీన సంస్కృత కావ్యా లెంత ప్రాణమో, బోదిలేర్ అన్నా, మయకోవస్కీ అన్నా అంతే ప్రాణం. అంటే అయన కావ్యానుభూతి పరిధిని విస్తృతపరచుకున్నాడు.

ఇక అయన కావ్యాలను వ్రాసేనాటికి రాజకీయంగా ఆధునికమైన దృక్పథం మార్క్సిజం. మానువుని సామాజిక, ఆర్థిక సమస్యల పరిష్కారాని కిది రాచబాట వేయగలదని విశ్వసింప బడింది. శేషేంద్ర ఈ సమస్యల పరిష్కారనికి మార్క్సిస్టుసిద్ధాంతాన్ని అంగీకరించాడు. ఇది సంప్రదాయ బద్ధులందరికీ సాధ్యం కాదు. అయితే ఈయన కవి కవి దృక్పథం రాజకీయ నాయకుని దృక్పథం కన్న విశాలంగా ఉంటుంది. రాజకీయవాదిలా కాకుండా కవి సమస్త మానవ జీవితానికీ బాధ్యుడే. అందు చేత కవి ఉద్యమిస్తే అదిపాక్షికమైన రాజకీయ ఉద్యమంకాక, అది సమగ్ర వైజ్ఞానిక ఉద్యమం అవుతుంది. కవి కేవలం మానవుని అన్నమయ కోశానికే బాధ్యత వహించడు. ఆతడు మనోమయ, జ్ఞానమయ, ఆనందమయ కోశాలు కూడా ఉన్నాయని మరువడు. అందుచేత సమగ్ర మానవునికి రాజకీయవాది కాదు, కవే నాయకుడు.

ఇలా సంప్రదాయాన్నీ, ఆధునికతనూ ఇముడ్చుకున్న శేషేంద్రకు సంస్కృత సాహిత్యం సరే కాని, తెలుగు సాహిత్యాన్ని చూస్తే అది స్వయంభువముగా గాక derivative గా, పరాశ్రయంగా, పరాన్నభుక్కుగా కనబడింది ఇన్ని అనువాదాలతో, ఇన్ని సంస్కృత పురాణేతి వృత్తాలను స్వీకరించిన ప్రబంధాలతో, వస్తువు విషయంలో తెలుగు కవిత్వం పరాధీనమై పోయింది ఇక అభివ్యక్తిలో కూడా తెలుగు కవులు రీతి కిచ్చిన ప్రాముఖ్యం మోతాదునుమించి ఉన్నదనే భావం శేషేంద్రకు కల్గింది. అర్థ ప్రాధాన్యం తగ్గి కవిత్వం శైలి ప్రాధాన్యమై పోయింది. దీనికి

బహుశా తెలుగు పద్యపుటందమే కొంత బాధ్యత వహించవలసి ఉంటుంది. 'జనవశం' లోని ఋతుకాండలోని వస్తువునకు శేషేంద్ర ఒక సామాజిక నేపథ్యాన్ని సాధించి, పద్యాన్నే వాహకంగా చేసుకొన్నాడు. కాని, దానినుండి కూడా విడివడే ఉండాలనుకున్నాడు.

ఈ విడివడడం రెండు దిశలలోనూ - కవిత్వానికిచ్చే రూపంలోనూ, దాని వస్తువులోనూ- ఈ రెండింటినీ సమన్వయపరచడంలోనూ జరిగింది. తొలుతగా పద్యాన్ని (పరిహరించలేదు కాని) దూరంగా ఉంచాడు. దానితో పాటు పాటను కూడా ఒక కంట కని పెట్టి ఉంచాడు. ఇక మిగిలింది వచనం. వచనాన్ని కొన్ని పాదాలుగా పేర్చి, అది అలాగే వచనపు పంక్తులలాగే అచ్చువేయబడుతుంది. అయితే మొగమాటపడుతూ, కొందరు కవులుదానికి పాటకున్న రూపాన్నిస్తూన్న భ్రాంతిని కల్పించే వచనాన్ని వ్రాస్తారు. శేషేంద్రకు ఇది నటనలాగే కనబడింది. అందుచేత ఆయన కవితకు వాహకం వచనం అయితే అది అలాగే వచనపు పంక్తుల లాగే అచ్చువేయబడుతుంది. అయితే, ఆయన ఆ వచనానికొక కవిత్వ సాంద్రతను చేకూర్చి పెట్టాడు. ఆధునిక కవిత్వ తత్త్వాన్ని ఆశ్రయించే ఇది సాధింపబడింది. అంటే ఈ కవితల్లో ప్రతీకలూ, బింబాలూ, అలంకారాలూ ప్రముఖ స్థానాన్ని ఆక్రమిస్తాయి, ఇక వస్తువు పురాతన కావ్యంలోని వస్తువూకాదు, భావకవిత్వంలోని వస్తువూ కాదు. నేటి సామాజిక సమస్యలే ఆయన వస్తువు . అందులో నగరాలు, పల్లెలూ, దేశం, దోపిడీ, ఆకలీ, కార్మికుడు, కర్షకుడూ - ఇవన్నీ ఉంటాయి. వీనికొక కవిత్వపు ఊపిరి పోసి, వీనికి బలాన్నీ, శక్తినీ సంతరించి పెట్టాడు.

''ఆధునిక మహాభారతము'' లో వ్యాస భారతంలో లాగే పర్వాలు న్నాయి. అవి పది వెనుక ఆయన విడివిడిగా అందచేసిన కావ్యాలు కొన్ని ఇందులో పర్వాలుగా మారాయి.''నా దేశం - నా ప్రజలు'' ఇందులో 'ప్రజాపర్వ'మైంది. ''మండే సూర్యుడు'' 'సూర్యపర్వ' మయింది. 'భారతా' నికి 'హరివంశం' అనుబంధ కావ్యమయితే, ''ఆధునిక మహాభారతా'' నికి ''జనవంశం'' అనుబంధ కావ్యమవుతుదంటారు శేషేంద్ర. ఈ రెండింటా చమత్కారికలున్నాయి. అవి ''ఆధునిక మహాభారతం''లోని పర్వాలనుండి,

''జనవంశం''లోని కాండల నుండి, ప్రకరణంనుంచి విడ దీయబడ్డ పంక్తులు. ఇవి అందగా ఉంటూ ఆలోచనలను ప్రేరేపించే ఖండకవితలు. వానిలో ఉన్నది కసి అయినా, బోధన అయినా, విషాదమైనా, ప్రేమ అయినా, ప్రకరణంనుంచి విడదీయబడ్డా, వానికి ఒక స్వయం వ్యక్తిత్వముంది. ఈ పంక్తులను సహృదయుడు గిల్లి రసనాగ్రాన వేసుకుంటే చవులూరు తూంటాయి. వీనిలోని వినూత్న భావాలు సహృదయుని గిలిగింతలు పెడతాయి, వేధిస్తాయి, ఓదారుస్తాయి, ఆలోచింప చేస్తాయి.

''ఆధునిక మహాభారతం'' వ్యాసభారతం వంటిదే కాని, ఒక తేడా ఉన్నదంటారు శేషేంద్ర. అక్కడా, ఇక్కడా కూడా భూమికోసమే ఘర్షణ ఉంది. అయితే అది భరతవంశపు 'రాజుల'కు సంబంధించిన కథ ఇది భారతదేశపు 'కర్షకుని' గాథ. ఆ కథ అంతమయింది. ఇది ఇంకా నడుస్తూనే ఉంది. అది ఆనాటి చరిత్ర అయితే, ఇదినేటి ఇతిహాసం.

''ఆధునిక మహాభారతము'' లోని 'ఆద్మీ పర్వం'తో ''జనవంశం''లోని 'ప్రజాకాండ'ను చదవాలి. కవి అరవైయేండ్లనుండి దేశాన్ని చూస్తున్నాడు. అటు పల్లెలోనైనా, ఇటు పట్నంలోనైనా జీవితం దుర్భరంగానే ఉంది. పర్యావరణను చూస్తే ప్రకృతి హింసింపబడుతోంది. కొండలు కొండల్నే భేదిస్తున్నారు. డాములు కట్టి, కాలువలు త్రవ్వి ఆకలి తరఫున సృష్టితో వాదిస్తున్నారు(ఆ.భా.193). సముద్రాలు ఎండిపోతాయనీ, పర్వతాలు పారిపోతాయనీ, వృక్షాలు పూలను పూయవనీ భయం వేస్తోంది (ఆ భా.193). ద్రవ్య రాక్షసి కడుతూన్న బహు అంతస్తుల భవనాలకు భయపడి అకాశం కనిపించడం మానివేసింది(ఆ.భా.165). దేశంలో నాల్గు చెట్లూ, పది పక్షులూ కూడా లేవు. 'కొత్త తరం కొడుకులకు కోకి లేమిటో తెలీదు' (ఆ భా.166). ఉగాదిని గుర్తించలేరు. గ్రామాలకు గ్రామలే ఏడుస్తున్నాయి. పోనీ ఇంత హింసించీ తెచ్చిన కాలువలు మట్టి పిసుక్కొనే కర్షకుని పొలాల్లోకి ప్రవహిస్తున్నాయా అంటే, అదీ లేదు. దేశంలోని నదులన్నీ ధనికుల పొలాల్లోకి ప్రహిస్తున్నాయి(ఆ.భా.156).

ఇక నగర నిర్మాణంలో ఉన్నది భయంకర తామసిక సామాగ్రి.

''దున్నపోతుల ముఖాలు
పెద్దపులుల కండ్ల భల్లూకాల శరీరాలు
జలూకాల నాలుకలు
అవయవాలు మహానగర రాక్షసికి'' (ఆ.భా.232)

ఇక ''వాళ్ళు సేట్లు కారు షేర్వాణీలు ధరించి
మెలికలు తిరిగి పడున్న కొండచిలువలు....
స్వాగత్ హోటలు క్రింద ఎంగిలాకుల మీద
ముసురుకున్న వాళ్ళు పిల్లలు కారు
మనుషులుగా మారిన ఈగలు.'' (ఆ.భా.217-18)

హృదయమున్న కవికి కన్పించేది ఈ భవనాల శిల్ప సౌందర్యం కాదు, వానికి-

''వినిపిస్తుంది బరువులు మోస్తూ
చక్రాలు లాగుతూ కిర్రు కిర్రు
మంటున్న కండరాల ధ్వని'' (ఆ.భా. 233.)

ఇలాటి బీభత్స దృశ్యాలెన్నో? ఈ దోపిడి సమాజంలో ఆధునిక

''నగరం ఒక చంబల్ వ్యాలీ
గ్రామం దేశానికి కూలీ'' (ఆ.భా 173.)

అదీ నేటి స్థితి!

కాని రాజకీయవాది అలా అనడు. ఏదో సాధిస్తున్నామనే అంటాడు. కాని సాధించేది ఏమిటి? దేశం నెత్తిన శుష్క ప్రజాస్వామ్య హస్తాన్ని పెట్టాడు. ఓట్లు మేసి నాయకులు బలిసారు. వారి ముందు-

''ఏనుగంత రూపాయి ఎలుకై సలాం చేస్తోంది.'' (జ.వం.98 )

రోగాలను ఎన్నికల మందుతో నయం చేస్తామంటారు కాని, జరిగిందేమిటి?

''ఓట్ల డబ్బాలకు గర్భస్రావం జరుగుతుంది.
ప్రజాస్వామ్య శిశువు ప్రసవం ఎప్పుడూ జరకదు!'' (జ.వం.98.)

శేషేంద్రది ఒక అధి క్షేపం కాదు. ఒక తిట్టు కాదు. అది మన గుండెల నటించే మంట. రాజకీయ నాయకునికీ, కవికీ అంటించడమే పని. ఒకడు కొంపలంటిస్తే, మరొకడు గుండె అంటిస్తాడు

ఈ రాజకీయ చరిత్రలో దేశభక్తి తరిగిపోయి, దైవభక్తి పెరిగిపోవడమొక భయంకర సంఘటన. సర్వ దేవతలూ నిద్రాహారాలను కోల్పోతున్నారు.( జ.సం.105.) ఇక మతం పేర జరిగే క్రౌర్యం పచ్చి మానవతనీ, న్యాయాన్నీ హత్య చేస్తోంది.

ప్రజాపర్వం, సూర్యపర్వం రెండిటా కవి వాచ్యంగానూ, వ్యంగ్యంగానూ, ప్రతీకలతోనూ, పురాణ గాధలతోనూ కవిగా తనుకున్న సమస్త సాహిత్య వారసత్వంతో కుమలిపోతూన్న, చిక్కి-శల్యమై పోతూన్న మనిషిని-ముఖ్యంగా కర్షకుణ్ణి- వీపుతట్టి లేపుతున్నాడు శేషేంద్ర. వాని శ్రమకు మూల్యమెంతటిదో వానికే తెలియదు వాని హస్తం ఉషఃకాంతులలో నుంచి లేస్తుంది. '' ఆ హస్తం కాలం అనే నిరంతర శ్రామికుడి సమస్తం, మనిషిపాలాల్లో ప్రవహించే చేమటలో మునిగి లేస్తోంది ''. (ఆ భా.12.) ఆ చెమట కెంతో చరిత్ర ఉంది ఎంతో బాధ్యతను వహిస్తుంది.

'' చరిత్రలో చెమట ఒక శాశ్వత అంతర్వాహినిలా ప్రవహిస్తూ ఉంటుంది''.(ఆ.భా.23 )

ఇలా చెమటతో తడుస్తూ, కర్షకుడు భూమిని బుజ్జగిస్తాడు, లలితంగా లాలిస్తాడు, వెన్నలాటి మన్నుతో గోరుముద్దలు చేసి పైర్ల నోటి కందిస్తాడు

(ఆ. భా 44 ) దినమంతా శ్రమిస్తాడు కాని, తెల్లవారితే చేయి ఖాళీగానే ఉంటుంది. ఈతడు సృష్టించని అందం లేదు. కాని ఆ అందాన్నంతా వాడెవడో దోచుకొని పోతున్నాడు. వాడి మొహాన నవ్వు రాసి ఉంటే, వాడికి నవ్వేంతటి సుఖం ఎలా దొరికింది? ''ఆనందం అందపు రూపాంతరం, అందుకే ఆ రెండూ నా శత్రువులు'' అంటాడు శేషేంద్ర ఏవి లేకపోతే తాను కవిగా, సౌందర్యోపాసకునిగా బ్రతకలేడో, అవి తనకు పరమ శత్రవు లవడానికి ఆతనికి ఈ దోపిడీ వ్యవస్థ ఎంత నికృష్టమైనదిగా కనబడుతోందో! 'అన్ని అందాలనూ నాశనం చేసే' ఈ 'బకాసుర సంస్థ ఎప్పుడు భస్మీపటలం అవుతుంది అన్నదే నా ఏకైక స్వప్నం' అంటాడు శేషేంద్ర. (ఆ. భా 49.) ఈ దోపిడీ గాంధ్రకు ఆకలిని తీర్చుకొనే హక్కు కూడా లేదు. ఆకలినైనా సంపాదించుకోవాలి, దానిని సంపాదించుకున్న వానికే తినడానికి హక్కు ఉంటుంది ఈ దేశపు గాలిని పీల్చడానికీ, నీరు త్రాగడానికీ హక్కు లేనివాణ్ణి, మాతృగర్భంలోనే పసికట్టి సంహరించమంటాడు అపర పరశురాముడు శేషేంద్ర. అంచేత ''కష్టాల అగ్నుల్లోనించి ఖడ్గాలై పుట్టండి'' అని కవి ఉద్బోధిస్తాడు. (ఆ భా.91 ) చిత్రంగా ఈ కవితల్లో విప్లవం ద్వేషాగ్నితో జ్వలిస్తూనే ఉన్నా, ప్రక్కనే కవిత్వమూ దానికి వింజామరలు వీస్తూ మరింతగా ప్రజ్వలింప చేస్తోంది. ఇందులో అలంకారం వట్టి అలంకారంకాదు. ఒక్కొక్క అలంకారం ఒక పరశవు; సామాజిక విద్రోహపు దౌర్జన్యాన్ని అంత మొందించడానికి ప్రతిన పూనిన పాశుపతం.

ఇంతటి ఉద్వేగంలో కూడా ఒక్కొక్కప్పుడు మనిషి కలల లోతుల్లోకి పయనింపబూనుకుంటాడు. ఎవరికీ అందని సీమకు, కొండల ఒడిలోకి, అడవుల గర్భకుహరంలోకి ఎక్కడికో పోదాం పదమంటుంది ఆత్మ. అదొక అద్భుతసీమ, ఆ కొండల మండువాలో భూమ్యాకాశాలు పెళ్ళి చేసుకుంటాయి.

> ''పేరు లేని పక్షి కొమ్మమీద కూర్చున్న మాత్రాన
> పరిసరాలు పద్యాలుగా మారుతాయి''. (ఆ. భా 67.)

''దిగంత రేఖమీద మెరిసే నిశ్శబ్దం'' కోసం చేసే ఈ పయనాన్ని శాంతియాత్ర అంటాడు కవి. ఈ అద్భుతమైన కవిత డబ్ల్యు. బి. ఏట్స్

పద్యాన్నొకదానిని స్మృతిపథంలోకి తెస్తుంది. అందులో శిల్ప మెక్కువ. ఇందులో ఉన్నదంతా చిక్కనైన కవిత్వమే.

అలాగే మనిషి ఒక్కొక్కప్పుడు దిగంతరేఖ ఆకాశాన్ని ముడివేసి తనలోకి దిగింతనుకుంటాడు. నదులు కొండల్లోకి, కొండలు గుహల్లోకి, మనుష్యులు చెట్లలోకి, గింజలు భూమిలోకి పోతున్నాయట. మళ్ళీ ''దిగంతరేఖ ఆకాశం విప్పి'' కవిలోంచి ఎగిరిపోయిందట.(ఆ భా.86-87.) ప్రతీ 'ఎవల్యూషన్' నూ అనుసరించి ఒక 'ఇన్‌వల్యూషన్' ఉంటుందనిపిస్తుంది. మనిషి అయిన కవీ, కవి అయిన మనిషీ గింజ కోసమే ఏడ్వడు. ఆతనికి హృదయం ఉంది, కలలు కంటాడు; అతనికొక దర్శనం ఉంటుంది, తాత్త్వికుడవుతాడు

అయితే శేషేంద్ర ఇలా లోకం నుంచి పారిపోతాడునుకోవడం వట్టి భ్రమ. ఈ దేశానికి ముక్తి లేదా? మానవుడంత శక్త్యి హీనుడా? అన్నదానికి సమాధానంగా మనకు 'పశు పర్వం' కనుబడతుంది. మానవుని క్రియాశక్తికి ప్రతీకగా శేషేంద్ర గొర్రిల్లాను ఎన్నుకున్నాడు. ఆతడు మన మహా పూర్వుడు.

''దేవత లొస్తుంటారు దేవతలు పోతుంటారు ఆకాశంలో, మనకందే దేవత మాత్రం మన చేతుల్లోఉన్న నాగలి, మన కండరాల్లో నిదురించే గొర్రిల్లా'' (ఆ.భా 102)

కవికి తెలుసు· ''లోకం గొర్రిల్లా దశలోకి దొర్లిపోతోంది. మన మహాపూర్వడి ఇనుపకండరాల శకంలోకి- ఇంకా పాత పేజీల్లోనే పచార్లు చేస్తూ ఉండి పోకు ''(ఆ భా.108.)

అతడు ఆదిమ మానవుడు. ఆదిమశక్తులన్నింటికీ తావలమైన మహాపురుషుడాయన. మనిషిలో నిద్రిస్తున్న ఈ క్రియాశక్తితో శేషేంద్ర అద్భుతంగా రూపకల్పన చేశాడు. అతడు నిద్రిస్తే పోలాలు పడి ఉంటాయి. పొగ గొట్టాలూ ఖాళీగా నిలబడి ఉంటాయి. అతడు ''మనిషి బాధను తొడలమీద వేసుకొని పొట్టచీల్చే రోజు వస్తుంది.''(ఆ.భా.116.)

''ఆకలిగొని ఉదయారుణ బింబాన్ని పట్టుకోబోయిన నాటి నీ హస్తం మా మస్తిష్కానికి జన్మస్థానం'' (ఆ.భా 116.)

'' నీ సహస్ర బాహువులతో నిర్మించావు గ్రామాలు నగరాలు
సామ్రాజ్యాలు సాహిత్యాలు మా మస్తిష్క మండలంలో మనీషకు
జెండా లెత్తావు. మానవతకు ప్రతీకవు న్యాయానికి పతాకవు
అధర్మానికి ఉత్తమ సమాధానం నీ కఠోర కుఠారం నీ
గండ్ర గొడ్డలి ఏది? ఏమూల నిద్రిస్తూ ఉంది....'' (ఆ భా.127.)

సంఘీభావంతో వేయి పిడికిళ్ళు కలిస్తే కొండంత పిడికిలి అవుతుంది. దానికి అభేద్యమైన దేదీలేదు. అదే మానవుని క్రియాశక్తి. ఆక్రియాశక్తి విరాట్ రూపాన్ని శేషేంద్ర ఈ దేశ ప్రజల్లో రక్తనిష్ఠమైన పౌరాణిక ప్రతీకల ద్వారా వ్యక్తపరుస్తున్నాడు. మనిషిని జాగృత మొనరిస్తున్నాడు.

''ప్రవాహపర్వం'' లో మనిషి మరో రూపంలో సాక్షాత్కరిస్తాడు. అతడు హఠాత్తుగా నేడు అవతరించలేదు. వానికి ఎంతో పూర్వ చరిత్ర ఉంది. దీనితో పాటు అతని మనసున ఎన్నో పొరలున్నాయి. అడుగున సుప్తచేతన ఉంది. అది వైయక్తిక జీవితానికి సంబంధించినది. దీనిని గురించి ఫ్రాయిడ్ దీర్ఘంగా వివరించాడు. దానికి అడుగున మరొక పొర ఉంది. అది వైయక్తికమైనది కాక, సామూహికమైన సుప్తచేతన. ఇది ప్రపంచ మానవునకు అబ్బిన వారసత్వం. యూంగ్ దీనిని గురించి చర్చించాడు. ప్రపంచంలోని ప్రతీ సాహిత్యంలోనూ ఆదిమానవుని అనుభవాలన్నీ ప్రతీకల రూపాన సమష్టిసుప్తచేతనలో ఉంటాయనీ, ఇవే ప్రపంచంలోని సమస్త సాహిత్యంలో ప్రాగ్రూపాలుగా ఆవిర్భవిస్తాయని యూంగ్ అంటాడు. శేషేంద్ర ఇక్కడ చిత్రమైన సన్నివేశాన్ని ప్రవేశ పెట్టాడు. కాళిదాసు చెప్పినట్లు ఒక మంచి పాటను విన్నా, చిత్రాన్ని చూసినా, ఎక్కడివో ఎప్పటివో వాసనలు మనలో మేల్కొంటాయి ఒక విషాద మేర్పడుతుంది. పూర్వజన్మల స్మృతీ, సంస్కారమే దీనికి కారణం. శేషేంద్ర ఈ భావాన్నీ, యూంగ్, ఫ్రాయిడ్‌ల భావాలనూ కరగబోసాడు. ఒకదానినుండి మరొకదానిని విడదీయ వీలులేకుండ చేశాడు.

' ప్రవాహ పర్వ'పు తొలి సర్గలోనే-

''ఏవేవో స్మృతులన్నీ దూరదూరాల నుంచి నా రక్తప్రవాహాల్లో కొట్టు
కొచ్చాయి........

''ఒక్కొక్కప్పుడు బయటపడుతాయి, నా రక్త నదీ తీరాల్లో
నా పాతరాతి పనిముట్లు - ప్రవాహాల్లో కొట్టుకొస్తాయి
ప్రాచీన సుమేరియాలు మొహంజోదారోలు.'' (ఆ భా 130.)

ఇలా కవిలోకి వెనుకటి యుగాలు ప్రవేశించడమే కాదు, అతని కొక 'ప్రయాణ దాహం'(Wander Thirst) పట్టుకొంది. ఈ ప్రయాణానికి అంతంలేదు. ఇది అనంతమైనది:

''అందరమూ ఏ చెట్టుకో పుట్టిన ఆకులం ఏ శాఖకో పూచిన పువ్వులం
అందరమూ అన్నీ విడిచిపోతాము మరికొన్నిటికి తావిస్తాము
కాని జీవిస్తాము''. (ఆ.భా.150.)

ఇదీ జీవిత రహస్యం. కవి తన ఒక్కని బాధనే కవితల్లోకి ప్రవేశపెట్టడు. తన బాధనే తాను పాడుకోడు. జన్మజన్మల నుంచి వచ్చిన సంస్కారాన్ని త్రవ్వుకుంటాడు.తన జాతి సంస్కారాన్ని త్రవ్వుకుంటాడు మానవ జాతి చరిత్రనంతా త్రవ్విపోస్తాడు ఆదిమ మానవుని నుంచి నేటివరకూ వచ్చిన మనిషి లోభాల్నీ('ఫారోలు'),బాధల్నీ, ఔన్నత్యాన్నీ చూడగల్గుతాడు, చూసే ప్రయత్నం చేస్తాడు.

''జనవంశం''లోని 'చంపూకాండ' అప్పటప్పటు కవి వ్రాసిన పద్యాలను భద్రపరచుకొన్న పేటిక అధిక్షేప కవితలో, తిట్టు కివతలో చాలా వాడి అయిన గొంతు ఈయనది. యుద్ధకాండలో పద్యం పోయిన తెన్నులు బహు విధాలుగా ఉన్నాయి. ఇక్కడ పద్యం వ్యావహారిక భాషను సమీపించి క్రొత్త భావాలను ఎంతో శక్తిమంతంగా అవిష్కరించగల్గుతోంది ఈ కాండలో భారతీయ అస్థి పంజరాల కొక హెచ్చరిక ఉంది లౌడ్ స్పీకర్ గర్జన రాజకీయ రోగమై మనిషి పశుత్వంలో ఒక భాగమైపోయింది. గోల కాదు మనిషికి కావలసింది శాంతి. ఆ శాంతి నిశ్శబ్దపు అడుగులలోనే నడుస్తుంది, కాస్త వెనుదిరిగి చూసుకొంటే :

''పౌరాణిక డోలికలో పెరిగింది కవిత్వ శిశువు
 ... ..... ... ..... ....................
 మనిషిని తమ చేతులతో
 మలచిన పురాణకర్తలు
 లోకాలను సృజించారు
 లోకాలు త్యజించారు
 ఆ ఊహాబ్రహ్మల యుగమే
 స్వాహా ఐపోయింది.......'' (జ.వం. 265.)

నేడు మనిషి లేడు. ఈనాడీ లోకంలో మిగిలింది మతమే. అల్పిష్టులు సృష్టించుకున్న మతం ఇది. అసలు మతం కాదిది!

లోకం ఎంత బరువుగా ఉన్నా, అందులో ఎక్కడో తీయందనం ఉంటుంది. అది మనిషిని ఆవరిస్తుంది. అలాటి క్షణంలోనే-

''జీవన సమరంలో అలసివచ్చి
తారల వెలుతురు కలపిన నీ తిమిరంలో
స్నానం చేస్తాను'' (ఆ.భా.282.)

అంటాడు కవి ఇలాటి ఊహామయ లోకాల్లోకి అడుగు పెట్టిన కవి-

''కురిశి కురశి వెన్నెలలు
 గగన మలసి పోయింది
 వేచి వేచి అడుగుల కోసం
 దీప మారిపోయింది (ఆ.భా.284.)

అని చిన్నపోతాడు.

కాగా ఒక చిత్రం, ఒక శిల, ఒక వెన్నెల, ఒక చినుకు చాలు కవిలో తలపుల ఇంద్రధనుస్సులను విరియించడానికి, మనిషిని ప్రేమమయ మూర్తిగా మలచడానికి. రోమ్‌లోని డెమెలో విగ్రహం కవికి శిలకాదు.

"నీవు శిలవు కాదు కలవు కాదు నా వలపుల
వలలో చిక్కిన శబల వర్ణ సంచాలిత శఫరివి
ఒక అనిర్వచనీయ క్షణంలో
నా కోటి నాడుల దారుల్లో విరిసిన
సౌందర్య రసానుభూతివి". (ఆ.భా.300-301 )

ఇది కల్పనాత్మకత, రొమాంటిసిజమ్, అనిముద్రవేయడం కాదు. మనిషి ఒక వంక పోరాడుతూంటాడు. మరొక వంక వానికి వసంతం అనంత భవిష్యత్తుల ప్రతీకయ్యై నర్తించే ఋతువుగా కనబడుతుంది. (ఆ.భా.310.) ఈ రెండు అంశలూ ఉన్నప్పుడే మనిషి పరిపూర్ణ మానవుడవుతాడు ఇది ఏదో అద్వైవతసిద్ధి కాదు, మానవత్వ అవతరణ.

శేషేంద్ర 'మండే సూర్యుడు' లోని కవితలకు శ్రీ సోమసుందర్ విపుల వ్యాఖ్య వ్రాశారు. శేషేంద్ర కవిత్వ దృక్పథాన్ని గురించి ముదిగొండ వీరభద్రయ్యగారు వివరించారు శేషేన్ జీవితంలో అనుభూతుల తే దీ లెక్కువ. అనేకరూపాలలో ఈయన గొంతెత్తి అలసిపోతాడు. కాని, మళ్ళీ పుంజుకుంటాడు. గింజను పాతి పెడితే దాని ప్రాణం భూమిని చీల్చుకొని వస్తుంది.(ఆ భా.362.) ప్రతిభ కూడా అట్టిదే.శేషేన్‌కు ముందుకాలంలో 'మెమోరియల్' ఏమిటని అడికితే 'చెట్టునాటి కొమ్మమీద కోకిల పెడితేచాలు'(ఆ.భా 373.) అంటాడు. కవిగా శేషేంద్ర సరాసరి వాల్మీకికి వారసుడు.

శ్రీ శేషేంద్ర 'ఆధునిక మహాభారతం' 'జనవంశం' కృతుల సమీక్ష
'ఉదయం' :8-3-94, 22-3-94

(''విమర్శ: నాటినుండి నేటివరకు'' అనే గ్రంథంనుండి పునర్ముద్రితం).

# సదా నూతనుడు శేషేంద్ర

- వల్లభాచార్య

*"సముద్రం ఒకడి కాళ్ళ దగ్గర కూర్చుని మొరగదు*
*తుఫాను గొంతు చిత్తం అనడం ఎరగదు*
*పర్వతం ఎవడికీ వంగి సలాం చేయదు*
*నేనింతా ఒక పిడికెడు మట్టే కావచ్చు -*
*కానీ కల మెత్తితే నాకు ఒక దేశపు జెండా కున్నంత పొగరుంది"*

* * *

*"నా కవిత్వం మనిషికి డిఫెన్స్."*

* * *

ఈ మాటలు అన్నవాడికి 'కవి' అని కాక మరో పేరు ఏముంటుంది?

గుంటూరు శేషేంద్ర శర్మ అనేది ఒక కవి పేరు! కవిత్వానికి నిర్వచనం చెప్పాలంటే 'శేషేంద్ర' అంటే చాలు!!

**గుంటూరు శేషేంద్ర శర్మ కవిత్వానికి ఒక మేనిఫెస్టో! కాలతత్వమే కవితత్వం కావాలి అని చెప్పే నిత్యనూతన కవి శేషేంద్ర. ఆయనకు తెలుగు విశ్వవిద్యాలయం ఈ నెల 27వ తేదీన డిలిట్ ప్రదానం చేయబోతున్నది. ఆ సందర్భాన్ని పురస్కరించుకుని ఈ వ్యాసం.**

"కవిత్వం, స్థూలమైన భౌతిక స్వరూపం నుంచి ద్రష్ట పిండుకున్న తాత్త్విక బిందువు". " దృశ్యానికి జీవనం ఇచ్చే ప్రవాహిమ ఏదయితే వుందో దాన్ని పట్టి యిచ్చే గ్రథన కౌశలంతో బంధింప బడిన నాలుగు మాటలు కవిత్వం అవుతాయి"– అన్నది శేషేంద్ర నిర్వచనం. అయితే కవిత్వ ప్రయోజనం దగ్గర 'ఆధునికు'లతో పేచీ లేకపోయినా ఆయనకు కొన్ని షరతులు ఉన్నాయి! అసలు 'కవిత్వం' అనే మూలద్రవ్యాన్ని వదిలేసి ప్రయోజనమూ, సామగ్రి అని పట్టుకొని వ్రేలాడే వాళ్లని ఆయన నిర్మొహమాటంగా ఖండించారు. "ఆకలి కవిత్వం రాయి, ఆవకాయి కవిత్వం రాయి, పద్యంలో రాయి, నీకు చేతనయిన మార్గంలో నీకు చేతనయినదిఏడువ్, మాకు తగాదా లేదు. కానీ నీవు అసలు కవిత్వం రాయాలి. ఇదీ ఈనాడు తలయెత్తే ప్రశ్న. ఈ ప్రశ్న గురించి

స్పృహ ప్రజల్లో రెచ్చగొట్టబడాలి. కవిత్వం రాసే విధివిధానాల మీద పట్టుదలలు వదలిపోయిన ఈ రోజు కవిత్వం రాసేవాళ్ళకి మరింత ప్రమాదం ఏర్పడిందే కానీ మరింత సౌలభ్యం దొరికిందనుకోవటం పొరపాటు."

* * *

ఇంతకీ శేషేంద్ర ఏమంటున్నారు? ఆయన ఒకపక్క 'స్వర్ణహంస' రాస్తారు. 'షోడశి' రాస్తారు. మరోవంక 'ఈ నగరం జాబిల్లి' రాస్తారు. 'ఆధునిక మహాభారతం' వెలువరిస్తారు. ఈయన మార్గం ఏమిటి? కవిత్వానికి సంబంధించి ఆయన తత్త్వం ఏమిటి?

*"ఒక కన్నీటి కణమ్ము చాలు రసపూరోదార సాహిత్యముల్*
*ముకురింపంగ ననేక కృత్రిమ సుమస్ఫూర్తిచ్ఛటావాటికా*
*నికటాంతఃపుర జీవనస్థితులు వర్ణింపంగ పొంగారునే*
*ఒక సామిత్యరస ప్రసారకణమే మత్పన్నమై యెన్నడున్"*
*"వ్యధచే దీనుల గాధ కొక్కటయినన్ బాష్పమ్ము రాకున్నచో*
*పదబంధమ్ములు బంధుర ప్రణయ భావస్పంద సందోహముల్*
*మృదులమ్ముల్ పదివేలు కూర్పు మది సాహిత్యమ్మె రాహిత్యమై*
*నిదురంబోవును గాక కాలకుటిలో నిర్గంధ బంధూకమై"*

ఇదీ ఆయన తత్త్వం.

"మనిషి బ్రతకడమే, బ్రతకడానికి ఉన్న హక్కును స్థాపించడమే మానవ ధర్మం. తన జీవన హక్కును అనుభవించడానికి అవసరమైతే శస్త్రధారణ చెయ్యడం మానవ ధర్మం... జీవన సంగ్రామం నుంచి మనిషి ఎన్నడూ పారిపోరాదు. జీవన సంగ్రామంలో మనిషి మనిషిగా నిలబడడానికి కావలసిన ఆత్మస్థైర్యమనే గాండీవాన్ని ధరించాలి. కనక కాలతత్త్వసారంగా సంక్రమించిన విప్లవ ధర్మాన్ని స్వీకరించి శస్త్రధారణ చేయడమే ఆధునిక యుగధర్మం" అంటారాయన. దాని వెంటనే మరోమాటఅంటారు... "ఇట్టి తత్త్వ రహస్యాన్ని అన్ని యుగాల్లోనూ ద్రష్టలు గ్రహించారు, ఆ రహస్యానికి ఐతిహాసికవాణి ప్రదానంచేశారు"... అని.

అంటే కాలతత్త్వాన్ని జీర్ణం చేసుకుని తత్ప్రరోచనతో పలకడమనే నిజమైన కవి తత్త్వం ఆయనది అన్న మాట. దీనికి ప్రక్రియలతో పనిలేదు. తన భావావిష్కరణకు ఏ ప్రక్రియ ఒదిగితే దానిలో కవి అభివ్యక్తుడవుతాడు. ఏ ప్రకియమీదనైనా అకారణ సాహిత్యేతర కారణ జనిత ద్వేషం ఉన్నవాడు అసలు కవేకాడు. మానవ జీవన

పరిణామ ప్రగతిని అధ్యయనం చేసినవాడు కనుకనే శేషేంద్ర "మనిషి మనిషిగాబ్రతకడంచేత పొందబడే ఫలం కవిత్వం. ఆ ఫలం పొందినవాడు కవి!" – అంటారు. అది 'ప్రాంశులభ్యఫలం!' మరుగుజ్జులకు అందదు. ఎంత 'ఉద్బాహు'లైనా అపహాస్యం పాలే అవుతారు. కానీ - లోకంపరిస్థితి వేరు. అక్కడ –

"నీతి వెలుంగలేదు నవనీత మనస్సు వసింపలేదు వి
ఖ్యాత మనీష నిష్ఫలము స్వార్థపిశాచనిశాచరోగ్రసం
ఘాత ప్రచండ తాండవమఖండిత రీతిగ సాగుచున్న ఈ
జాతి మతాది సర్వకుల సంకుల పంకిలమైన సీమలన్" అందువల్లనూ, ఇంకా "ఈ దేశంలో వంగేవాడికి వంగి సలాములు చేసేవాడు పుడుతున్నాడు" కనుకనూ, 'కవి'ని గుర్తించలేని, గౌరవించు కోలేని దౌర్భాగ్యం మనకు దాపురించింది.

**నిశ్శబ్దాల నిర్మాణ వాస్తువు తెలిపినవాడు ఋషి**
**శబ్దాలకు రెక్కలిచ్చి నిశ్శబ్దాల్లోకి**
**ఎగరేశేవాడు కవి**
**జీవితంలోని సుఖదుఃఖాలు**
**వసంతరుతువుల్లో**
**పువ్వుల వాదోపవాదాలు.**

* * *

**ఈ దేశం నా ప్రతిభకొక సమాధి. ఎంత**
**వడివడిగా నడిచినా ఎప్పుడూ దూరం ఇంతే**
**ఈ నేల నారక్తం తాగాలని దప్పి**
**గొన్నది. ఆముదపు చెట్లనీడల్లో**
**హాయిగా నిద్రిస్తున్న ఈ దేశానికి**
**సూర్యుడిలో కలం ముంచి గ్రీష్మగీతం**
**రాద్దామని తెల్లకాగితం పుచ్చుకున్నాను.**
**- శేషేంద్ర**

కవిత్వం అనే దానిని నిర్ణయించడానికి సాహిత్యేతర కారణాలూ, సామగ్రి ప్రధానం అయిపోయి నిస్సార, నినాద వస్తు సంజాతం కవిత్వంగా చలామణీ అయిపోతున్న రోజులలో 'కవిత్వం అంటే ఏమిటి?' అనే విషయాన్ని పునః నిర్ధారించి స్థాపించిన వారు శేషేంద్ర. 'కవిత్వం అలంకారబింబప్రతీకాత్మక భాష' అని నిష్కర్షగా ప్రకటించి, దానిని సృష్టించి చూపిన వ్యక్తి శేషేంద్ర. ప్రాచ్య, పాశ్చాత్య సాహిత్య సిద్ధాంతాలను కూలంకషంగా అధ్యయనం చేసిన వ్యక్తి తప్ప వెలువరించలేనిది కవిసేన మేనిఫెస్టో.

'కవిసేన మేనిఫెస్టో' లో ఆయన సాగించిన అధ్యయనం, ఆవిష్కారం ఈ నిస్సారమైన తెలుగు కవితా ప్రపంచానికి గొప్ప జీవన స్రోతస్విని. అది ఆయనను ఆలంకారిక ప్రస్థాన పరంపరలో నిలిపినది. పాశ్చాత్యమైన సర్వమూ శిరోధార్యమైనదనీ, ప్రాచ్యమైన అంటే భారతీయమైన సమస్తమూ త్యాజ్యమనీ దుర్భ్రమలో మునిగిపోయిన వారికి అది సాహిత్య పారం. కానీ అకృత పరిశ్రములు, శ్రమగతాలస బుద్ధులు అయిన మన ఆధునికులకు అది చెవికి ఎక్కితేనా? 'ఈయన వీలుంటే హర్షుడిని హక్స్లీనీ బ్రేక్‌ఫాస్టుకు పిలిచి, అరిస్టోటిల్ భాసులతో లంచ్ ఆరగించి, క్యాంట్ కాళిదాసులతో డిన్నర్ ముగించేలా కనిపిస్తాడు' అంటారు శ్రీ బి.కె.రావు. అలాటి మనిషిని అర్థం చేసుకోవాలంటే ఎలా? ఆయన మాటల్లోనే - 'ఒక సముద్రాన్ని మరో సముద్రమే అర్థం చేసుకుంటుంది'. శేషేంద్రతో చిక్కు ఇదే. ఆయన చదివినంత, ఆకళించుకున్నంత సాధించిన వారు అరుదు. దానికి సాక్ష్యం ఆయన ఆధునిక మహాభారతంలోని మయూరపర్వం చూడండి.

ఆయన పద్య కవిత్వం ఎంత ప్రౌఢలలితంగా ఉంటుందో, ఆయన వచన కవిత్వం అంత వైచిత్రితో ఉంటుంది....

ఆ వైచిత్రిని ఎలా సాధించాడన్నది ప్రశ్న. శేషేంద్ర వచన కవితలోని వాక్యాలు ఒక క్రమంలో ఉండవు. వాటి నిర్మాణం విచిత్రంగా ఉంటుంది. ఒక పట్టాన మెరవదు 'మేఘైఃమేదురమంబరం' వంటి మనస్సులకు!

ఒక ముక్కచూద్దాం -

"ఈ యుగాన్ని అభినందిద్దామని, మధుపాత్రిక ఎత్తాను
ఒక సంధ్యలో రాలుతున్న ఆకుల నీడలు చూచాను
అందులో జీవితం రాలుస్తోంది క్షణాల్ని హేమంత పత్రాల్లా
ఆశలు మాసిపోతున్నాయి ప్రత్యూష నక్షత్రాల్లా"

ఈ నిర్మాణం సరళంగానే ఉంటుంది. కానీ ఇందులో ఒక సనాతన రహస్యం ఉంది. దానిపేరు వాల్మీకి. 'జీవితం రాలుస్తోంది క్షణాల్ని' అనటం మామూలు మాట కాదు. దానికి 'హేమంత పత్రాల్లా' అని అంటించటం సులువుకాదు. 'ఆశలు మాసిపోతున్నాయి' అనటం మామూలే. 'ప్రత్యూష నక్షత్రాల్లా' అనటం అసలు సంగతి. వాల్మీకి విసిరిన ఒక మాట చూడండి.

'దదర్శకశ్చిత్ రమణోపగూఢా, యథా విహంగా కుసుమోపగూఢాః' –క్రీడానంతరం పురుషులు స్త్రీల కౌగిలిలో ఒదిగిపరున్నారు - ఇది మామూలు మాట. ఎలా?

'పూలగుత్తులతో కప్పబడిన పిట్టల్లా' అన్నది చెఱుకు. ఇదే పద్ధతి పై నిర్మాణంలోని కీలకం. ఇది తెలియనివారికి శేషేంద్ర కవిత అందదు.

'ఈ చెట్లు పూలెందుకు పూస్తాయి? బుల్లెట్లెందుకు పూయవు?' అంటే ఏదోలా ఉంటుంది. కానీ ఈ భావన విజిగీషువైనవాడు అధర్వణంలో అన్నాడు. 'ఓశమీ! నీ పత్రాలు బల్లేలుగా మారిపోవాలి. నీశాఖలు ఖడ్గాలుగా అవతరించాలి.' అక్కడా, ఇక్కడా శత్రువును జయించే ఆకాంక్షే. అక్కడా ఇక్కడా కూడా శస్త్ర ధారణ వాంఛయే. అక్కడా ఇక్కడా కూడా భాషమారినా భావం ఒకటే.

శేషేంద్ర అంటారు: 'తుపాకి చూపించి, సొమ్ము చూపించి ఒకడిని మార్చలేము. మన మాట వినేటట్లు చేయగలం. కానీ అది వానిలోని పరివర్తన వల్లకాదు - భయంవల్ల, లోభంవల్ల మాత్రమే. కానీ కవిత్వం అనేది వాడి హృదయాన్ని తాకుతుంది.

> వెరవకుమోయి విశ్వపదవీ మద విద్విషదుగ్ర ధాటికిం
> బరవకుమోయి ధర్మమయి పావకరోచులు భ్రూకుటీరకో
> టరముల ప్రజ్వలింపగ ఛటావటలీపటు జాగ్రదగ్రమౌ
> పరశువు కేలబూని ఒక భార్గవ రాముడవై చరింపుమా!
>
> అదియొక ధర్మదీక్ష పరమార్థ మహోన్నత శృంగసంగతిన్
> బ్రతుకు నపేక్ష విశ్వసమరమ్ము జయించుటకాత్మశిక్ష ఆ
> మృదుహృదయ ప్రసూనకుహరీ విహరీకృత వహ్నికీల తా
> వదరదు దేనికిం బెదర దారదు మారదు హోరుగాలికిన్.
>
> \- శేషేంద్ర

భావం వాడిని ఊపేస్తుంది. తద్భావ భావితమైన వాని చిత్తం జీవితాన్ని మారుస్తుంది. రక్తఝరీ విలీనం అవుతుంది. అది తరతరాలకూ అందుతుంది. అది నాగరకతగా రూపొందుతుంది. కవులు సృష్టించినదే ప్రపంచ నాగరకత' అని.

*"కవిత్వం*
*కవి మరణించిన తర్వాత*
*ఆకాశంలోకి లేచే నిర్మాణం*
*మొలిచే నాగరకత"*

అంటే కవిని మనం అర్థం చేసుకొనే స్థాయినిబట్టి మన నాగరకత స్థాయిని,

అంచనా వేసుకోవచ్చు. అదే సమస్య - 'ప్రాక్పరిపూర్ణ వాక్సుకవి పండిత ప్రౌఢవిలాస భావ సమ్యక్పరిపుష్టముల్ పరిణతార్థములెన్నడు నేర్వబోక దుర్వాక్పరితృప్తులౌ కుకవి వర్యుల త్రోవల వందిమూకతా దృక్పదయోగ్యమే అమిత తేలిక కావలె వారికెప్పుడున్' అంటారు విశ్వనాధ సత్యనారాయణ. అలా కావ్యజ్ఞ శిక్షలేక, కొన్ని దుర్భ్రమలకు లోనయి, 'సాహిత్యం అంటే - ముఖ్యంగా కవిత్వమంటే ఏదో అరుపుల కేకల గుంపు, అనుకునే దౌర్భాగ్య స్థితిలో ఉన్నవారికి శేషేంద్ర అందడు.

శేషేంద్ర నేరం అంతా ఆయన ప్రతిభ, పాండిత్యమూనూ. శ్రీ పురాణం సుబ్రహ్మణ్య శర్మ అన్నట్లు - 'శేషేంద్ర ఎదిగి ఎదిగి ఆ ఎవరెస్టు కొనకొమ్మున ఒంటరివాడైపోయాడు. తోడునిలిచేవారు లేరు.' ఎవరెస్టుఎక్కాలంటే ఎన్ని సాధనలుండాలో శేషేంద్రను అర్థం చేసుకోవడానికి వైదిక సాహిత్యం నుంచి అప్రాచ్య సాహిత్యం వరకూ అంతా అధ్యయనం చేయవలసిందే.

'ప్రతీకలు' మనం పైనుంచి దిగుమతి చేసుకొన్న వనుకొంటాము. కానీ శేషేంద్రఅంటారు - సింబలిజం అనేది వైదిక వ్యవహారం దాని పచ్చిపాలనురుగుగా త్రాగిన వారు ఫ్రెంచి సింబలిస్టులు అని. ఇక్కడ నుంచి అక్కడికి వెళ్లింది 'సింబలిజం' అన్నది ఆయన చెప్పిన రహస్యం. ధ్వనిదాని పాదాల దగ్గరకు కూడా రాదని ఆయన నిష్కర్ష. ఇవన్నీ వింటే శేషేంద్ర ఆధునికుడా? ప్రాచీనుడా? అనే ప్రశ్న వస్తుంది. తనకు తాను ఆయన 'విప్లవ భాషా విధాత' అంటారు. వారి అసలు సంగతి ఏమిటి? అనేది మనకు ఎదురయ్యే ప్రశ్న.

అదికవిత్వమే అయితే దానికి ప్రాచీన ఆధునిక భేదాలు ఉండవన్నది మౌలిక సత్యం. అన్యాయాన్ని ఎదిరించటం, అధర్మాన్ని నిరసించటం ప్రాచీనతే అయితే ఆయన ప్రాచీనుడే. కవిత్వంలో కవిత్వం అనే దినుసు ఉండి తీరాలని, దానిని బట్టే నిర్ణయించాలనటం ప్రాచీనతే అయితే ఆయన ప్రాచీనుడే. సాహిత్యేతర కారణాలే కవిత్వానికి గీటురాళ్లు అనటం ఆధునికత అయితే ఆయన ఆధునికుడు కాడు. 'విప్లవం' అనే మాటకు సరైన అర్థాన్ని తెలుసుకోగలిగితే ఆయన విప్లవకవి. ఆయన విప్లవాన్ని కవిత్వం చేశాడని అంటారు. అంటే ఏమిటి? విప్లవభావాన్ని కవిత్వంగా ఎలా అభివ్యక్తీకరించాలో ఆయన చెప్పారు. 'ఋతుఘోష' అన్న పద్య కవితలోనే ఇది కనిపిస్తుంది.

'చలిపులి వోలె దారుల పచారులు చేయుచునుండ ఊరికా/వల పెను మట్టిక్రింద నెలవంకయె దీపముగా పరున్న పే/దల పసిపాపలెవ్వరికి తప్పుదలంచిరి...'/ అన్నదానిలో

'నెలవంకయె దీపముగా'పరున్న స్థితిని తరువాతి 'విప్లవ కవులు' అనబడే వారెందరో అనుసరించారు. 'ఏలాగో ఒకనాడు ఆ శిశువులే యింధానమౌగాకయు/ద్వేలక్షోభ నభోంతరాళమెగయన్ విశ్వప్రజాలోచనో / న్మీలంబై హృదయాగ్ని పర్వత మహానిర్ఘోష రోషానల / జ్వాలా జాల కరాళ జిహ్వకలు తుచ్ఛంబైన యీ లోకమున్ / గూలంజేయును గాక, యీ వచనమే ఘూర్ణిల్లుగా కంతటన్'' అన్నది తరువాతి తరం మీద ఆశను ద్యోతకం చేస్తోంది.

'ధనము గతింపనీ గగన తారలు ధారుణి మీదరాలనీ / తనువు నశింపనీ ప్రళయ తాండవమై ధర క్రుంగి పోవనీ / మనసు చలింపనీకు మభిమానము మానముకోలుపోకు, మీ ఘన తర భాగ్యవంతు లధికారులు మార్కొనిరేని యుద్ధతిన్' అనేది ప్రబోధం.

'నీవు కాలేజీకి పోతుంటే బాబూ/ నిన్ను పొలాలు బిక్కమొహంతో చూస్తున్నాయి / నీవు కాలేజీ గోడల్లోకి పోతావు / అక్కడ్నించి గవర్నమెంటు గోడల్లోకి పోతావు / ఆ తర్వాత ఎప్పుడూ ఎవ్వరూ తిరిగిరాని గోడల్లోకి పోతావు / ఇక నీవు బ్రతికిందెప్పుడు' 'అరే ఇవాళ నగరం ఒక చంబల్ వ్యాలీ, గ్రామం దేశానికి కూలీ.

'ఇజం'కు, 'ఫిలాసఫీకీ తేడా వుంది. ఒక ఆలోచనాశీలి అయిన మహాపురుషుని లోకవర్తనాధ్యయనంలో జరిగే అంతర్మథనం నుంచి జనించేది తత్త్వం (ఫిలాసఫీ). దానిని ఎవరికి వారి పరిధిలో అర్థం చేసుకొని అనుసరించే మనుషుల గుంపు 'ఊరేగింపు' ఇజం! అందువల్ల 'మార్క్సిజం' అనేదానికి శేషేంద్ర చెందడు. కానీ 'మార్క్సిస్టు ఫిలాసఫీ'అనేదానికి శేషేంద్ర చెందుతాడు. అది అన్యాయ నిరసనం కనుక ఆయన ఎంత అధునాతనుడో అంత ప్రాచీనుడే అవుతాడు. వెరశి శేషేంద్ర 'సనాతనుడు' అంటే 'సదానూతనుడు' !

*(ఆంధ్రప్రభ దినపత్రిక సాహితీగవాక్షం,*
*అక్టోబర్ 24, 1994 నుండి - వారి సౌజన్యంతో)*

**శ్రీ విశ్వనాథశర్మ, ఆంధ్ర ప్రాచ్యభాషా కళాశాలాధ్యక్షః, హైదరాబాద్ -**

"పరోపకారైక పరాయణంత్వాం
అధీత శాస్త్రాది సమస్త విద్యం
శేషోపమం శేవధి మాశ్రితానాం
శేషేంద్ర శర్మాణ మహం నతోస్మి!"

# నవ్యాధునిక కవిత్రయం

– డా॥ శ్రీపాద కృష్ణమూర్తి

ఆంధ్ర సాహిత్య చరిత్రలో ఆధునిక యుగం విలక్షణమైనది - అతి విశిష్టమైనది. ఆంధ్ర సాహిత్యాన్ని మరో మలుపు తిప్పి, విప్లవంతెచ్చిన శ్రీశ్రీ ఆయన తర్వాత వచ్చిన కవులు ఆధునికుల్లో నవ్యాతి నవ్యులనీ, ఈ కవుల్లో కూడా మనకి ఒక కవిత్రయం ఉందనీ ప్రసక్తానుప్రసక్తంగా సాహితీ మిత్రులతో నేను పేర్కొంటూ ఉండడం పరిపాటి అయింది. ఆధునిక కవుల్లో వీళ్లు అతి నవ్యులు కావడంవల్ల వీళ్లని స్పష్టత కోసం 'నవ్యాధునిక కవిత్రయం' అని పిలుచుకుందాం.

ప్రాచీనాంధ్ర సాహిత్యంలో కవిత్రయం స్థానం మహోన్నత మైందని సాహితీ పరులు నేటికీ విశ్వసిస్తూ రావడం వాళ్ల గొప్పతనానికి నిదర్శనంకదా! ఆ మహా కవులు ముగ్గురూ మూడు విశిష్ట కవితా మార్గాలకి మార్గదర్శకులనీ, ఆ మహానుభావులు ఆరాధనీయులూ, ప్రాతస్స్మరణీయులనీ మనం భావిస్తూనే ఉన్నాం

ప్రాచీన కవిత్రయంలో 'ఆదికవి' అని పేరెన్నికకెక్కి అనంతర కవుల చేత నతులూ, నుతులూ పొందుతున్న నన్నయ్య, కొలని గణపతి దేవుడు పేర్కొన్నట్లు ఆంధ్ర కావ్య పథము తీర్చిన మహాకవి. ఆ రోజులలో పంచమవేదంగా ప్రసిద్ధి పొందిన సంస్కృత మహాభారతాన్ని తెలుగు చెయ్యడానికి చేయి వెయ్యడమే ఒక సాహస చర్య- ఒక మహావిప్లవం. కనుకనే సంస్కృత విద్వాంసులూ, పండిత పరిషత్తులూ ఎంతగా ఎదుర్కొన్నా ఆయన వెనుకంజ వెయ్యలేదు. రాగి రేకుల పైనా, రాతి పలకల మీదా అరగొరగా ఉన్న తెలుగు భాషని కావ్యభాషకి అనువైనదిగా మలచు కోవడంలో ఆయన పడ్డ శ్రమని, కష్టాన్ని సహృదయులు గుర్తించగల రనుకుంటాను.

నన్నయ్య ఇతివృత్త నిర్వహణలో, భాషలో, కవితా శైలిలో తనతర్వాతి కవులందరికీ మేలుబంతి కాదగిందిగా మహాభారతాన్ని తీర్చి దిద్దిన మహాశయుడు.

ఆయనది ప్రధానంగా కథాకథన లేక ఆఖ్యాన శైలి అని పెద్దలు నిర్ణయించారు. కాని పద్యరచనా శిల్పంలో ఆయన సాధించిన నైపుణ్యం అనితర సాధ్యమైనది. ఛంద సౌందర్యం ఆయన సొమ్ము. తన కవితా గుణాల్లో అక్షరరమ్యత ఒకటి అని ఆయనే చాటుకున్నాడు. ఎంత సంస్కృత పదభూయిష్ఠం అయినా ఆయన కవిత్వంలో శబ్ద పారుష్యంగాని, అర్థకాఠిన్యంగాని కలికానికైనా కనపడవు. ఈ అక్షర రమ్యతనే పూజ్యులు (శ్రీ) నండూరి బంగారయ్య నాద సౌష్ఠవం అని కొనియాడారు. ఈ నాద సౌష్ఠవాన్ని ఆయనవలె స్వాయత్తీకరించుకున్న మరొక తెలుగుకవి మనకి లభించడు. ఈ గుణమే ఆయన కవిత్వానికి ఒక హొయలు, ఠీవి, ఉదాత్తత సంతరించి పెట్టాయి.

రెండవవాడు తిక్కన సోమయాజి. నన్నయది ఋషి మార్గం అనుకుంటే ఈ తిక్కనది కేవలం రసమార్గం. నాటకీయ శైలి ఈయన కవితకి వన్నె చేకూర్చింది. ఈయన పద్యరచనలో సౌందర్యం అంతగా గోచరించదు. కాని అలతి అలతి తేట తెలుగు మాటలతోనే ఎంతటి తీవ్ర భావాన్నయినా, ఎంతటి గంభీరార్థాన్నయినా వ్యక్తీ కరించడంలో సిద్ధ హస్తుడని ప్రశంసలు పొందిన మహాకవి. సంస్కృత భాషకే కాక తేట తెలుగు భాషకి కూడా వేడి, వాడి ఉన్నాయని ఈయన తన కవితద్వారా నిరూపించిన మహాకవి. నిజంగా 'కవిబ్రహ్మ'.

ఇంక మూడవ వాడు ఎఱ్ఱన. భారతారణ్య పర్వ శేషం అనువదించడం వల్లనే కాక భారత గ్రంథానికి 'ఖిలం' అని వ్యవహరింప బడే హరివంశాన్ని కూడా అనువదించడంవల్ల ఈయన్ని ప్రాచీనులు పై కవిద్వయంతో చేర్చి కవిత్రయంగావ్యవహరిస్తూ వచ్చారని మనం మరవ కూడదు ఏదో ఒక మనోభావాన్ని కాని, ఒక రమణీయ పదార్థాన్ని ప్రపంచించి చెప్పడం కాని, వర్ణన అని అనుకుంటే, అటువంటి వర్ణనల కీయన ఘంటా పథం కల్పించినవాడని మనం భావించవచ్చు. అటువంటి వర్ణనలు ఆయన కావ్యాల్లో పలుచోట్ల బీజ ప్రాయంగానూ, మిగిలిన చోట్ల విరివిగానూ కానవస్తాయి- కాబట్టి ఈయనని ఆంధ్ర కవులు 'ప్రబంధ పరమేశ్వరు' డని ప్రశంసించారని మనం నమ్మవచ్చు. కనుక ఈ మహాకవులు ముగ్గురూ మూడు విశిష్ట కవితా మార్గాలు ఏర్పరచి తమ

శక్తియుక్తులు ప్రదర్శించినవాళ్ళు కావడంవల్లనే, నాటినుంచి నేటివరకూ ఈ మహా కవుల్ని మనం మరవలేకున్నాం - స్మరించకుండా ఉండ లేక పోతున్నాం.

మరి కాలంతో పాటు కవిత్వం కూడామారి వినూత్న లక్షణాలని సంతరించుకొన్న ఆధునికాంధ్ర సాహిత్యంలోనూ ఒక కవిత్రయం ఉన్నదని నా అభిప్రాయం. ఈ కవులు ఆధునికుల్లో మరీ నవ్యులు కాబట్టి వీళ్లని 'నవ్యాధునిక కవిత్రయం' అని వ్యవహరిస్తే సందేహానికి తావుండదు.

అయితే ఆ ముగ్గురు కవులూ ఎవరు? అని ప్రశ్నిస్తే- శ్రీశ్రీ, తిలక్, శేషేంద్ర శర్మలు ముగ్గురూ అంటాను.

ఆధునిక కవిత్వాన్ని ఒక మలుపు తిప్పిన ప్రతిభా మూర్తిగానే కాక కవిత్వంలో విప్లవాన్ని ప్రవేశ పెట్టిన శ్రీ శ్రీ, యీ నవ్యాధునిక కవిత్రయంలో ఆద్యుడు కావడం ఆయన గొప్పతనాన్ని చెప్పకనే చెబుతోంది. అయితే ఈయన మహాగడుసరి ఛందస్సర్ప పరిష్వంగాలు పనికిరావని చాటుతూనే మాత్రా ఛ్ఛందస్సుల్ని విరివిగా ఉపయోగించాడు. ఆయన మహాప్రస్థానంలో వచన కవితల కన్నా మాత్రాఛ్ఛందస్సుల్లో రచించినగేయాలే అధికం. ఈయనది ప్రధానంగా విప్లవ దృష్టి అయినా - తాను చేపట్టిన మాత్రాఛ్ఛందస్సుల వల్ల తన గేయాలకి సంగీత గుణంకూడా సాధించుకొన్నవాడు. అంటే నన్నయ్యగారిలో కానవచ్చే 'అక్షరరమ్యత' లేక నాదసౌష్ఠవం సాధించుకోగల్గడం వల్లనే ఈయన రచించిన గేయాలు బహుళ ప్రచారానికి, ప్రాచుర్యానికి నోచుకున్నాయి. కనుక నవ్యాధునిక కవిత్రయంలో శ్రీశ్రీ నన్నయ్య వంటి వాడని నా భావం.

మరి రెండవ కవి కీ శే. దేవరకొండ బాలగంగాధర తిలక్ (ఈయన ఆధునిక సాహితీరీతులు నాకు బోధించిన గురువు కావడంవల్ల ఇక్కడ ఈయనికి శిరసా నమస్కరించుకుంటున్నాను). తిలక్ అద్వితీయుడైన కవి. ఏ వస్తువుని స్వీకరించినా, ఏ ప్రక్రియనిచేపట్టినా అనతికాలంలోనే వాటిలో గొప్ప ప్రావీణ్యాన్ని ప్రదర్శించగల ప్రతిభావంతుడు. అచ్ఛమైన కవిత్వంకోసం ఆరాటపడినవాడు. తాను

ఎంత అందగాడో అంతకన్న అందమైన, రసవంతమైన కవిత అల్లగల ప్రజ్ఞాశాలి. కాని తక్కిన యిద్దరిలో కానవచ్చే విప్లవ దృక్పథం ఈయనలో లేదు. అందుకు కారణం లేకపోలేదు. 1953 ప్రాంతంలో ఆంధ్ర సాహితీ రంగంలో ఈయన తెరమరుగు నుంచి పునః ప్రవేశం చేసే సమయానికి ఆధునిక కవిత అస్తవ్యస్తంగా తయారయింది. శ్రీ శ్రీ అనుయాయులం అని చెప్పుకొనే కవులు - రాజకీయ నినాదోపాసన అధికమై, నాదోపాసనామయం కావలిసిన గంగలాంటి పవిత్రమైన కవిత్వాన్ని మురికి కాల్వగా మార్చి, కవిత్వానికి అందం అవసరం లేద నీ, ఏదిచెప్పామన్నదే ముఖ్యం కాని ఎలా చెప్పామన్నది ప్రధానం కాదనీ - తదనుగుణమైన రచనలు సాగిస్తూ కవితా శారదని హతమార్చే స్థితికి దిగజారిపోయారు. అభ్యుదయ కవిత్వంలోని ఈలోపాన్ని గుర్తించి 'కవి వాక్కు' తో తిలక్ మళ్ళీ తన గొంతు వినిపించాడు. ఎక్కువగా ఏది చెప్పామనేదానికన్నా ఎలా చెపుతున్నాం అన్నదానికి ప్రాధాన్యం తెచ్చాడు. కవితా సౌందర్యం మృగ్యమైపోయిందని విచారించినవాడు తిలక్ వచన కవితా ప్రక్రియని చేపట్టి - ఏ వస్తువునయినా కవితామయమూ, రసనిర్భరమూ చేయగలిగిన శక్తి తనకున్నదని నిరూపించుకున్నాడు. పద్య కవితలోనూ, వచన కవితలోనూ అందెవేసిన చెయ్యి ఈయన. తిక్కన ఎలాగో అలాగే తిలక్ కూడా భావ వ్యక్తీకరణకీ, రసపోషణకీ పాటుపడిన ఉత్తమోత్తమ కవి. ఏ వస్తువునయినా రసమయమూ, కవితామయమూ చేయగలిగే ఈయన ప్రతిభకు ముగ్ధుడై శ్రీ శ్రీ ''కవితా సతి నొసట రస గంగాధర తిలకం'' అని కితాబు నివ్వడం ఈయన ప్రజ్ఞకి నివాళి. కాలం కాటు వేసిందికాని జీవించేఉంటే ఈయన ఒకగొప్ప ఇతి వృత్తాన్ని స్వీకరించి ఒక మహా కావ్యాన్ని సృష్టించాలని కలలు కనేవాడు. పాపం! ఆయన కోరిక తీరకుండానే తలుపు తెరుచుకొని వెళ్ళిపోవడం తెలుగు సాహితీ పరుల దురదృష్టం.

మరి చివరగా చెప్పవలసి వచ్చినా నిజానికి ఈ మూడో కవి మొదట చెప్పవలసినవాడు-చిచ్చుర పిడుగు! ఈయన పేరా? డా॥ గుంటూరు శేషేంద్ర శర్మ. విప్లవాత్మకత వల్లనూ, విలక్షణమూ వినూత్నమూ అయిన భావాభివ్యక్తి వల్లనూ- ఈయన ఎజ్రాన లాంటి కవి అని నేను తలపోస్తూ వుంటాను.

ఈయనకీ తిలక్‌కీ చాలా విషయాల్లో పోలికలున్నాయి - రంగులోనూ, రూపంలోనూ రుచిలోనూ. కాని తిలక్‌లో కొరవడిన విప్లవ దృష్టి ఈయనలో అత్యధికము. తిలక్‌లాగే ఏది చెప్పామనేదానికన్నా ఎలా చెప్పామన్నదానికి ప్రాధాన్యమిచ్చి, తిలక్ రచించలేని ఒక మహాకావ్యాన్ని శ్రీ శేషేంద్ర రచించి చూపడం చాలా గొప్పగా చెప్పుకోవలసిన విషయం. శ్రీ శేషేంద్ర రచించిన ''ఆధునిక మహాభారతం'' కావ్యం ఒక గొప్ప రచన - ఒక గొప్ప సృష్టి. వర్గ చైతన్యాన్ని జ్వలింపచెయ్యడమే లక్ష్యంగా సాగిన రచన. సామాన్య ప్రజ భూమిని హస్తగతం చేసుకోవడానికి జరిపే సుదీర్ఘ పోరాటమే ఈ కావ్యంలోని ఇతి వృత్తం. విప్లవాత్మకతలోనే కాక వినూత్నభావాభివ్యక్తిలో కూడా ఈ కావ్యం సాటిలేనిదని నా నమ్మకం. నాకు సంతోషం ఏమిటంటే శ్రీ శేషేంద్ర వినూత్న భావాభి వ్యక్తిలో తిలక్‌ని కూడా మించిపోయాడనే విషయం. నిజానికి ''మండే సూర్యుడు'', ''గొరిల్లా''ల వంటి రచనలద్వారా విప్లవభావాలకి భాషాభివ్యక్తి అలవరిచిన నవనవోన్మేష ప్రజ్ఞాశాలి శ్రీ శేషేంద్ర.

1 '' గ్రామం దేశానికి కూలీ''

2 ''రోజూ ఆకాశం సూర్యుడనే
ఎర్రటి గుడ్డు పెడుతూనేవుంది''

3 ''భూమిలో వున్న చిన్నారి గింజ
మెడ బయటపెట్టి
మొదట వచ్చిన రెండాకుల్ని
చేతులుగా జోడించింది కృతజ్ఞతతో''

4 '' అరే! ఆకోడి కూత విను
అది ఉషస్సు తూర్పును
బద్దలుకొడుతున్న శబ్దం''

5 ''అది ఆకాశం కాదు

నక్షత్రాల ఖజానా''

- వంటి పంక్తులు చాలు ఆయన గొప్పకవి అని చాటడానికి. విప్లవాత్మకత, వినూత్న భావాభి వ్యక్తి- ఈ రెంటి దృష్ట్యా పరిశీలిస్తే శ్రీ శేషేంద్ర ఈ యుగానికి చెందిన భారతదేశ కవుల్లోనే అగ్రగణ్యుడనడం ఎంత మాత్రం అత్యుక్తి కాదు. అంతే కాదు- కవితా శక్తిని బట్టి చూసినా, భావాభివ్యక్తిలో వున్న విప్లవాత్మకత - విలక్షణతల్ని బట్టి చూసినా ఈయన ప్రపంచ కవుల్లో ఒకడని చెప్పవచ్చు. ఈ విధంగా చాటడానికి ఏ మాత్రం సందేహించ నవసరం లేదు.

నిజానికి ఈయనికి ''జ్ఞానపీఠం'' అవార్డు ఎప్పుడో రావలిసింది. అయితే అంతకంటే కూడా మరొక ఉన్నతమైన అవార్డు ఏదైనా వుంటే ఆ అవార్డుని అందుకోవడానికి శ్రీ శేషేంద్ర కవిగా అన్ని విధాలా అర్హుడని నేను నమ్ముతాను.

(అక్టోబరులో సప్తతి నిండుతున్న శ్రీ శేషేంద్రకి –
ఆ కవిచంద్రుడుకి – ఇదే నా నుడుల పోగు)

# "నా దృష్టిలో శేషేంద్ర"

*(శేషేంద్ర కవిత-నవ్యత అనే నా సిద్ధాంత గ్రంథం నుంచి ..)*

**డా॥ కలువగుంట రామమూర్తి**

శేషేంద్ర కవిత సాహితీ గహనాంతర గుహల్లో హరీంద్ర గర్జన. ఆయన శైలి భావాకాశ లోకాల్లో లోహశ్యేన విన్యాసం. ఆయన మాట వాడిగోళ్ళవేట. ఆయన బాట వాడని పూల తోట.

శేషేంద్ర స్వయంగా హరిచందనపు శిల్పం. అది ఎంత హరించుకుపోతున్నా పరిమళాన్ని కోల్పోదు. వేదన, బాధ సంతోషం, సంతాపం అన్నీ అతని గుండెనుండి అందంగానే వ్యక్తమవుతాయి.

సాటిమనిషి దీన చరిత్ర ఓ ఖడ్గ ప్రహారంలా అతని గుండెకు తగిలినా ఇంత నెత్తురు అంత అత్తరు కలిసి ఒలుకుతుంది. నెత్తురు చూచి అతణ్ణి అభ్యుదయ కవి అనాలా? అత్తరు చూచి అతణ్ణి భావకవి అనాలా? అతను ఆపాదం కవి అయిన వాడు. ఆ కాయానికి ఎక్కడ గాయమైనా కవిత్వమే స్రవిస్తుంది. అతనో పరిమళాల వర్తకుడు. అతని కలలన్నిటికీ ఇంతో అంతో పరిమళపు గుబాళింపు ఉండి తీరుతుంది. 'అగ్ని చల్లినా అమృతం కురిసినా, అందం ఆనందం దాని పరమావధి' అన్న తిలక్ హృదయానికి ఖచ్చితంగా సరిపోయే మనిషి . అతణ్ణి పట్టుకుని నువు చెప్పేదంతా, ఇంత అందంగా ఉందేమిటంటే ఏంచేస్తాడు? అందంగా ఉన్నవన్నీ అభ్యుదయాలు కావని సిద్ధాంతరీకరించి అతణ్ణి నిష్కారణపు శిలువ నెక్కిస్తే ఏం చేస్తాడు? అప్పుడూ ఆఖరి బొట్టు వరకూ కవిత్వాన్నే జాలువారుస్తాడు.

ఏది కవిత్వమో, ఏది కాదో నిర్భయంగా చాటి చెపుతున్న అతను కవితామత ప్రవక్త. ఈర్ష్యను నిలువుగా, అసూయను అడ్డంగా ఒక క్రాసును తయారు చేసి అకారణంగా కొందరి విమర్శకుల చేత శిలువ వేయబడుతున్న క్రీస్తు శేషేంద్ర. అతనూ, అతని కవిత్వం ఎన్నిసార్లు శిలువనెక్కించినా ఎగసి వచ్చే 'ఈస్టర్'.

శేషేంద్ర ఇలలో కొంత, కలలో కొంత బ్రతికే కవి. ఇలలోని వాస్తవాల్ని విస్మరించక, కలల్లో అభ్యుదయాన్ని పలవరించేవాడు - ఏ ఇజమైనా మొదటి దశలో ఒక కల అన్నది నిజమని నమ్మినవాడు. అందుకే ఇతను కాలం కనే కలల్నీ, పూల పురాణాల్నీ, పక్షి పాటల ఋతువుల్నీ, వెన్నెల వెదురు బుర్రల్లో నిదురించే గంధర్వ మధుర విద్యల్ని వెదికి పట్టుకుంటాడు.

ప్రకృతి వెనుకదాగిన పరమ రహస్యాల్ని తన మంత్ర పూరిత దృక్కులతో బంధించి బింబాలు, బింబాలుగా చుంబించి వదలిపెడుతాడు. శేషేంద్ర వెన్నులో కన్నులో ఒక ఉద్యమ విద్యుత్తు ప్రసరిస్తూ ఉంటుంది.

ఆయన అనుభూతిలో భవభూతి విభూతి ఉంది. విలక్షణ ప్రతీక ఉంది. ఆయనకు స్వప్న విద్యతెలుసు. దానితో శృంగారాంబరాలనుంచి ప్రణయగంగోద్భవం జరిగి పుస్తక పుటల జటాజూటాలు నిండిపోతాయి. ఆయన భావాలువీణల్లో గాలి వానల్లా చెలరేగుతాయి.

శేషేంద్ర అభ్యుదయ కవితల్లో విప్లవ నవ్యత సేనల్లా, నిప్పుల వానల్లా జీవనానుభవ జ్వాలా సంపత్తిని వెలార్చుతాయి. జీవన క్రతుజ్వాలల్లో జలకమాడిలేచి, సత్యతీర్థాన్ని ఆచమించి ఆత్మాగ్ని ప్రవేశం చేసి వెలికి వచ్చిన శబ్ద గర్భాంతర శాక్త జగన్నియంతలా ఆయన దర్శనమిస్తాడు. ఆయన కవితల్లో ఒక దృగ్విశేషం అంతర్గత సాగర జాగరణను సాధిస్తుంది.

ఆయన సత్యాగ్రహి. వైజ్ఞానికసైనికాధ్యక్షుడు. నవకవుల మనో మైదానాల్లో కలాలకు పదును పెట్టుకునే కవాతే కవిసేనా శిబిరం. అందమైన ఛందశ్శిల్పంలో అనల్పమైన పరిణతి సాధించాడు శేషేంద్ర. ఆయన ఆత్మకళా కవన బంధాల్లో నుంచి గరిష్ఠ శబ్ద మహిమా, కుశాగ్రవత్ సూక్ష్మ భావాలూ అంతరంగ గంగా ప్రవాహంలా ప్రవహిస్తాయి - శ్రమించే రంగంలో రమించే రంగంలో స్త్రీమూర్తి కున్న ప్రాధాన్యతను విస్మరించరాదని హెచ్చరించే నిజమైన స్త్రీవాది - సత్యసంవేది శేషేంద్ర.

కృషి కసి కలగలిసిన ఈ తరం ఋషి శేషేంద్ర. ఆధునిక మహాభారతాన్ని సృజించిన అభినవ వ్యాసుడు. వాత్మకిని ఆవహింపచేసుకున్న అత్యాధునికుడు. హైందవ సంస్కృతిని పునాదిగా చేసుకుని అత్యాధునిక కవితాభావ సౌధానికి కవితల శిలలెత్తిన సాహితీ శ్రామికుడు. ఎంతపాశ్చాత్య సాహితీవాస్తుకళను వినియోగించి నిర్మించినా ఆయన కవితా సౌధం మీద భారతీయ తత్త్వం ఓ దినమణి దీపంలా భాసిస్తూనే ఉంటుంది. ఒక్కో అశ్వం ఒక దశకానికి ప్రతీక అయితే అతనిప్పుడు సప్తాశ్వ రథారూఢుడైన మార్తాండుడు!

# రంగుల భావ విహంగం- శేషేంద్ర కవిత్వం

## (నేడు డా॥ శేషేంద్రకు అభినందన పురస్కార సాహిత్య సభ సందర్భంగా సహృదయాభినందనలతో)

'ఒక అందమైన పోయెం అంటే
దానికి ఒక గుండె వుండాలి
అదీ కన్నీళ్ళు కార్చాలి...
క్రోధాగ్నులు పుక్కిలించాలి
పీడితులపక్షం అవలంబించి
మనిషి ఋణం తీర్చుకోవాలి
బ్రతకడానికి ఒక బురుజై మనిషి
విజయానికి జెండా అయ్ ఎగరాలి'

- అంటూ యుగచైతన్యాన్ని మోసుకొచ్చే ఆధునిక కవితా లక్షణాలు ప్రకటించిన 'ఆధునిక మహాభారత' రథికుడు, యుగకవి డా॥శేషేంద్ర. విప్లవ కవిత్వాన్ని, శిల్పశంఖారావంగా, భావచిత్ర గీతంగా కవితా వీథుల్లో మార్మోగించిన కవి సేనాధిపతి గుంటూరు శేషేంద్రశర్మ, శేషేన్ మార్కు కావ్య నిర్వచనమైన 'ఆధునిక మహాభారతం' పది పర్వాల ఆధునిక కావ్యేతిహాసమై, ప్రక్రియ - శైలిపరంగా సాహిత్య చరిత్రలో చర్చనీయమై కవిత్వపుకొమ్మకు విప్లవ భాషను చిగుర్చింది.

'కాలాన్ని నా కాగితం చేసుకుంటా
దాని మీద లోకానికి ఒక స్వప్నం రాసియిస్తా
దానికింద నా ఊపిరితో సంతకంచేస్తా'

- అని అనగల కాలదాసుడు మనకు దొరికిన మరో కాళిదాసు డా॥శేషేంద్ర. ఆధునికాంధ్ర కవితా ప్రయోగాలకు నవ్యతైనిలిచి, కాలాన్ని మలిచిన కవిగా, 'ఋతుఘోష' విన్పించిన. కాలం మరువలేని మహాకవి శేషేంద్ర.

'నా కన్నుల మీద వాలిన
సీతకోక చిలుకలే కవితలు'

- అంటూ కవితాభివ్యక్తికి నవ్యత, భావ ఆధునికతకు స్వేచ్ఛ ప్రాథమిక ధర్మాలుగా చెప్తారు. తనదైన కవితా దృక్పథాన్ని వ్యక్తీకరించే సాహిత్య స్పృహ, అభివ్యక్తిలో తనదైన పరిభాషా ప్రచారం, సాహిత్యాన్ని సుసంపన్నంచేసే నూతన ప్రక్రియ, తన కవితా శైలి సమకాలీన అనుసరణకు ప్రభావం,కొత్తమలుపుకు తెలుగుబాణీ పరభాషా సాహిత్య ప్రేరకమవ్వడం వంటి అయిదు నవ్యతలకు ఊపిరులూదిన స్రష్ట , సంప్రదాయ-సౌజన్య వర్తన కవీంద్రుడు శేషేంద్రుడు.

'నా కవిత్వం ఏజెండాను ఎగరవేయదు
కాని నాచేతులు నా దేశపు ఖడ్గాలు'

- అంటూ తన కంఠాన్ని శంఖారావంగాలేపిన చైతన్యకవి శేషేంద్ర . ప్రతిభా వ్యుత్పన్నతలు హృద్యంగా అందంగా కలిగిన సహృదయకవి డా॥శేషేంద్ర. సహృదయ సాహితి 96 'గురజాడ పురస్కారం' అందుకున్న శేముషి. 1927 అక్టోబర్ 20 న జన్మించిన 'జనవంశం' కవి. న్యాయశాస్త్ర పట్టభద్రుడై '1963లో' 'విశ్వ వివేచన'గా ప్రకటితమయ్యారు శేషేంద్ర. మారిషస్, జర్మని, గ్రీసు దేశాలు పర్యటించి 'నా దేశం - నా ప్రజలు' అంటూ తపించి, ఆ కావ్యం మరో అయిదు భాషల్లో ప్రచురణకు ప్రేరణయిన కవితా ప్రపూర్ణుడు శేషేంద్ర. 'శేషజ్యోత్స్న', 'పక్షులు', వాల్మీకి రామాయణంపై 'షోడశి' ఆయన విద్వత్ ప్రతిభకు ప్రతీకలు. సుబ్రహ్మణ్య భారతి పురస్కారం, రాష్ట్రీయ సంస్కృత ఏక్తా పురస్కారం, తెలుగు విశ్వవిద్యాలయం డాక్టరేట్, 'కాలరేఖ' కు సాహిత్య అకాడమీ అవార్డు నందుకున్న కవితాకాశపు 'మండేసూర్యుడు'శేషేంద్ర. ఎన్నో పురస్కారాలందుకున్న ప్రపంచ కవిగా, రసజనపేఠ విభూషణుడు శేషేంద్రుడు. విప్లవ భావ పరిమళమై. సాహిత్య తత్త్వ వివేచన చేసిన విద్వాంసుడు, విప్లవ భాషా విధాత శేషేంద్ర. కవిత్వం మనిషికీ, మానవత్వానికీ కవచం కావాలని 'కవిసేన మేనిఫెస్టో' ఆధునిక కావ్యశాస్త్ర మై సాహిత్య రంగంలో సంచలన విన్యాసమైన 'సాహిత్య కౌముది'శేషేంద్ర.

''అక్షరాల ఇసుకతో కవిత కట్టలేరు
తలవుల నెత్తావులు చిమ్మి మృదుహృదయ
సుమధూళి కావాలి
జీవన మధూళితో తడపాలి
చెరుకు విల్లువిరిచిన వాడే
చిగురుకైత చెబుతాడు
యెదల పొదరిళ్ళ మీద మల్లెలు విరియిస్తాడు''

- అని కవి కుండాల్సిన తొలి లక్షణాల్ని కవిత్వీకరించారు.

''పుస్తకాలు పట్టుకుని పోతుంటే బాబూ
శిలువలు మోసుకు పోతున్న
బాలక్రీస్తుల్లా కనిపిస్తారు నా కళ్ళకు''

- అని భావి భారత పౌరుల గురించి 'నా దేశం - నా ప్రజలు'లో ఘోషిస్తాడు.

''సూర్యుడు ఉరితీసిన వీరుడిలా
ఉదయపు చెట్లలో వ్రేలాడుతున్నాడు''

''నేనంతా ఒక పిడికెడు మట్టేకావచ్చు
కాని కలమెత్తితే నాకు ఒక దేశపు జెండాకున్నంత పొగురుంది''

''సముద్రం ఒకడి కాళ్ళ దగ్గర కూర్చుని మొరగదు
తుఫాను గొంతు చిత్తం అనడం ఎరగదు
పర్వతం ఎవడికీ వంగి సలాం చెయ్యదు''

''ఏమి చేస్తున్నారోతెలుసుకోండి
రైతుల్లారా రాజకీయ వర్షంపడుతోంది
మోసపోయి మీ విత్తనాలు చల్లకండి''

-అంటూ 'గొరిల్లా' కావ్యంలో కవిత్వపు తుఫానై, కవిత్వాన్ని మనిషికి డిఫెన్సుగా ప్రకటిస్తారు.

''మనమందరమూ తుఫానుల్లో నడచిన వాళ్ళమే
ఒక చిన్న తారతో దినమవుతుందా
మండే సూర్యుడు కావాలి
పదండి ముందుకు
మీ జెండానై ఎగురుతాను''

-అంటూ భావకవిత్వానికి ప్రగతి పల్లవి నేర్పిన క్రాంతదర్శి శేషేంద్ర. అనుభూతికవులకు విప్లవాభివ్యక్తి... కవిత్వపు భాష అయి, వర్తమాన సాహిత్య ముద్రకు కాలం కవితా వస్తువు కావాలన్న అసాధారణ, అజేయ కవి డా॥ శేషేంద్ర.

-డా॥ వేదుల శ్రీరామశర్మ ('శిరీష')
అధ్యక్షుడు
సహృదయ సాహితి
తూర్పుగోదావరి జిల్లా

(సందర్భం: ''నవకవితా పితామహ'' బిరుదు ప్రదానం,
కాకినాడ, 18-3-1997, మంగళవారం)

వెయ్యేళ్ళ తెలుగు వెలుగు - యుగకవి

**శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మ**

అభినందన సభలో సమర్పింపబడిన
బిరుదుపత్రము
వెయ్యేళ్ళ తెలుగు సాహిత్య వారసత్వమూర్తి - యుగకీర్తి
అయిన **శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ**గారిని
కాకినాడ అభిమాన కవి పండిత లోకము

**నవకవితా పితామహ**

బిరుదముతో సత్కరిస్తున్నది.

ఇట్లు
**అభినందన సభ - ఆహ్వాన సంఘం**

**18.3.97**
**కాకినాడ**

## SESHENDRA

*(Opinions of famous poets, critics and reviewers in India and abroad on SESHENDRA)*

Mr.Seshendra Sharma is the renowned poet whose voice has attracted many connoisseurs of poetry in India and abroad. His poetry is available in several languages including English, Greek, Hindi, Urdu, Bangla, Kannada and Tamil. Extracts of the opinions expressed by prominent critics and poets in Hindi, Urdu, Bangla, English, Greek and Telugu, etc., are given hereunder to illustrate the range of readership his poetry acquired over past several years.

The celebrated Greek Poet Nikiforus Vrittakos in his Preface to the Greek Version of the Poet's Modern Epic "My Country, My People" observes, "It was not only Tagore and Gandhi who crossed the frontiers of their country and reached wider world and achieved universality. Seshendra's epic poem "My Country, My Poeple" is an evidence. Some of the well known critics have compared this epic poem with T.S.Eliot's "Waste Land" and L'Ascention by St.John Perse. Personally I would compare the pain and anguish of the poet with the one of Loutremont in his lyric 'Mald Aurore'. The difference is that Sehsendra's protest is not made in the void. Seshendra walks firmly on his soil..... one can find in the poet a wild whirl wind which attains incredible oratorial heights, creating terrific images....... whirling within him is the idea of strength of life that is fighting the dark powers which want to take away its freedom and bread....at times we observe in the poem a Biblical and Prophetic tone that attracts us" (Poem translated into Greek by the well-known Greek Poetess Georgia Alexion, Athens. Preface translated into English by Dena Anaxagoros of Cyprus).

Dena Anaxagoros herself (who was taking a course of English literature in the Mysore University) having read the

poem in English earlier, wrote to the poet; an extract of what she wrote is given below - "Thanks to Mr.Sundaram I had the unique chance of reading some of your poetry which has been a revelation to me. Whatever was taking place inside the poem was surrounding me in every day life of India; but till then I was only looking at the surface of India. Your poems have withdrawn the curtain of the illusion and showed me the other side of India, the real India, of suffering. Your poem made me compare your poetry with that of Octavio Paz. Your poetry has elevated India to me and gave me this feeling that I cannot stand for long in front of the beauty, just as we cannot stand for long looking at the sun. The tragedy you are living with inside you by watching the tragedy that takes place every moment and every hour around us, even I felt it walking to so many places of India. I became more conscious of this with the help of your poem".

Prof.Vishwambarnath Upadhyaya, Head of the Hindi Dept. in the University of Jaipur of Rajasthan, the city situated in the extreme North west of India, having read the Poet's "Burning Sun", "My Country My People" and "Gorilla", and writing Preface to the Hindi version of "Burning Sun", observes, "In these volumes of poetry of Seshendra, the poems take shape out of the poignant feeling arising out of poverty, slavery and oppression that the Indian people are suffering from out of the sorrow in which they are still steeped in and out of the ruthless exploitation and oppression that the ruling classes perpetrate on the down-trodden masses. It is this very characteristic of his poetry that differentiates him from poets like Satchidanand, Hiralal, Vatsyayan ,Agneya who are bitten by the superiority complex of the rich and the ruling classes. In fact, if the poetry of Agneya and the poetry of Seshendra are read comparatively, Seshendra stands out as a poet greater, a more purposeful poet than Agneya".

Mr.Laxmikant Joshi, Lecturer, Hindi Dept. in Jodhpur University of Rajasthan ( a city located on the Pakistan-India border) having read "My Country My People" writes to the poet among other things, "Having been moved to the core of my heart by the poetry of Seshendra Sharma, the Mahakavi of this era, the personification of poetry and yugakavi, I feel I am a fortunate man. After reading "My Country My People", "Gorilla" and so on I earnestly decided to learn the language of Telugu in which the original works were composed. I will send my greeting to him in Telugu for the coming Deepavali".

Dr.Kedarnath Labh, Head of Hindi Dept, Rajendra College, Chapra, Bihar, eartern India who read Seshendra's poetry extensively writes an ancle, '... where Dinkar throws up a more chivalrous challenge and stops feeling satisfied that he did all that he has to, there Seshendra in his emotion does not forget the fact that he is a Poet. Compared with Dinkar's poetry, Seshendra has greater poetic content than Dinkar."

Prof.Kalyanmal Lodha, Head of Hindi Dept, Calcutta, observes on Seshendra's poetry as follows, "Your Diary "Rakta Rekha" which is in no way behind any of those of the modern western intellectuals, is an authentic testimony for your remarkable intellectual calibre. Similarly your "My Country My People" is a Mahakavya (epic) which unfolds your manyfold genius. It is a lofty theme surcharged with such intensely human thinking and emotional consciousness which turns an epic moment based on a universal canvass into a palpable human moment. It is purposeful and powerful epic."

In Jana Dharma, a Hindi Daily of Bhopal dated 10-10-77, Prof.Dhananjaya Verma, a prominent Hindi critic, wrote a critique on Seshendra's poetry in which inter alia he says "After 'My Country My People', this work of Seshendra (i.e.Gorilla) is such a terrific explosion of Indian Genius that

all boundaries languages are blown off, and our vast country, our entire heritage and culture stands like a gigantic pillar in front of us. The poet rather says that he will release on the country all those fairies and nymphs which the demon Kalidas imprisoned in his pages; but he does not show the traditional obeisance to the love story of Kalidasa's Yaksha separated from the latter's beloved. Seshendra earns his individuality as only a worker of poems. This poem which loves its country and its people and holds the gun in one hand and poetry in the other, has become undeniably a great human poem in the entire Indian scene today, by its character of uncompromising struggle for humanity."

Shri Amrit Roy, famous Hindi critic and the distinguished son of the celebrated Hindi, Urdu Novelist Shri Premchand, having read "My Country My People" writes with unhesitant candour as follows, "a great repository of new and unprecedented energy came into my hands in the form of a poem. After a very long time this kind of indomitable poetic power gave me its august audience. In this poem at one place there is light; at another fire, that too sparkling fire free from smoke. I met in it such unprecedented newness which we come across only rarely. Unknown, unfamiliar, startlingly new images come one over the other flooding like a river running down the hills. Marvellous happiness filled me.. Really this is a very great creative work. Anybody who has poetic culture, cannot but be stupified even for a moment at the rare grandeur of this poem "My Country My People."

Prof.Sarugu Krishna Murthy, Head of Hindi Dept, Bangalore University, eminent Hindi Poet and Scholar, while writing preface to the anthology of Poems of 10 Telugu Poets in Hindi version named "Sabd Se Satabditak" brought out by Andhra Pradesh Hindi Akademi, Hyderabad, reviewed generally the current scene of Telugu poetry and in the assessment said as follows - "The seventh decade of this

century is vey significant in the history of Indian literature. The reason is that during the period of 74-75 Seshendra's modern epic "My Country My People" brought about a new turning point in the Indian poetry. In so far as poetry in Telugu is concerned Sri Sri brought the element of Revolution for the first time as the theme of poetry in 30s. But poetic expression for the theme of Revolution was however found for the first time only after forty years, through Seshendra's modern Epic "My Country My People", "Gorilla" and "Burning Sun". The poetic expression created by Seshendra in this trio was so powerful and singular that it became so popular that all the poets in the field have adopted it and it is this poetic expression that is in vogue today. Due to this reason it is to be said that the first trend-setter in the modern Telugu poetry is Rayaprolu Subba Rao, the second trend-setter is Sri Sri and the third trend-setter is Seshendra Sharma."

Prof.T.V.Subha Rao, Head of the Dept. of Telugu Studies, Bangalore University and an eminent Telugu poet, evaluating the contribution of Seshendra Sharma to Telugu poetry, in an essay in the famous Telugu literary monthly 'Bharathi' (issue August 1985) which was also reproduced in the literary section of Andhra Prabha Daily dated 7-7-85 and later included in the anthology of literary Essays called 'Viplava Bhaashaa Vidhaatha' brought out by 'Sahitya Manjari' of Ongole in 1986, observes, 'The Poetic language necessary for a Revolutionary theme in a poem was first created by Seshendra in his prominent works 'Burning Sun', 'My Country My People' and 'Gorilla' (i.e.between 1974-77). From then onwards in the Telugu revolutionary poetry, it is this very poetic language which Seshendra created in the above three poetic works, that is being used by one and all today. If one carefully studies the works of poetry that came in the field before Seshendra's above three works (i.e.1974-77) and side by side those works that came after the said

works, one can easily see in the works that came after Seshendra's trio, the clear semblances of Seshendra's poetic language. This poetic language is the first given poetic expression for the revolutionary theme in Telugu poetry. It does not mean that other poets are literally copying Seshendra's poetry. When a new poetic language is created by a great poet, others practising the art are sucked into the orbit of its magnetic field and the unwittingly begin to shape their poems on the model of the new poetic language. Thus this is the fashion of Revolutionary Poetry prevailing today in the Telugu field."

The well known Urdu critic and prominent leader of the Communist Party of India, Raj Bahadur Gowd writing on "My Country My People" in "Siasat", the leading Urdu Daily of Hyderabad, said, "My Country My People" is a great step forward in the Indian literature. It is an epic of love and labour. "My Country My People" represents the journey that Indian literature made from the Romantic period to the Progressive period".

Famous Urdu poet Ali Sardar Jafri says in his preface to theUrdu version of 'My Country My People', "I heard the poet reciting his poem. I felt and experienced personally the poem's delicate nuances and its powerful thrust. 'My Country My people' is Indian Epic, modern Indian Epic. As it rises in its tone and content, it reaches the pinnacle of the poetry of modern era and becomes the great human epic. The poet who is a connoisseur of beauty, the poet who ascends to the peaks of Revolutioin, the poet. whose heart is illumined by the iridiscences of love, that poet is my contemporary; it is rather better to say that I am his contemporary."

The renowned Telugu critic Mr. R.S. Sudarshanam writing in Bharati (literary Monthly) on the modern epic "My Country My People" observes, 'In its approach to life, in its theme, in the strength and grandeur of its architecture, 'My Country My

People' is a remarkably new cretation. It will not be hasty to state that with this Kavya,Telugu poetry entered a new chapter.Like Krishnapaksham is the mornıng star of the Romantic Poetry and Maha Prasthanam is the morning star of the Progressive Poetry,'My Country My People' heralds a new era inTelugu Poetry." What Mr. Sudarshanam said as far back as in1976,we are actually seeing his prediction coming true today.Mr. Sudarshanam also said in another context, as follows, "Seshendra Sharma's poetry has attained great heights of originality and unrivalled beauty. Criticism in Telugu has yet to catch with the work of poets like Seshendra Sharma". Mr. Sudarshanam describing Seshendra as the founder of a new era in poetry said as follows:- "I was pleasantly surprised to find Sri Sri now imitating Seshendra Sharma. It is a poem on the new year Rakshass, which he calls 'The ClayTiger'. I give here the lines in which Shri Sarma peeps out —What further indication of assurance, is required to say that Sarma has arrived as the new trend-setter among poets."

One of the promınent leaders of progressive writers, 'Kalaa Prapurna' Shri Puripanda Appalaswami, having read "My Country MY People" said, "I opened the book and finished reading all the eitht cantos of the Epic in eight half quarter hours of time. I read it non-stop. Then again I read the work canto by canto.I cannot describe how many times and in how many ways I was moved by the poem. Each canto, no rather each page, or if I could go a little further, each word shook me, jolted me, moved me to the core of my heart. True, in the current Telugu Poetry, Epic is an untouched genre. You are the first poet who touched the genre with distinction. My hearty congratulations."

The outstanding one among the modern critics and Head of the Telugu Dept, in the Hyderabad Unıversity, Prof. G.V. Subrahmanyam writing foreword to the thesis written by Dr.

Penna Sivaramakrishna and entitled "Seshendra Kavithanuseelanam" the research conducted under the guidance of the said professor himself, says as follows, "Like Viswanatha and Sri Sri, Seshendra Sharma is undoubtedly a genius in the contemporary Telugu literature. Ever since he lifted 'his fist' as "Burning Sun", Prose Poetry in Telugu began to learn how to wear the robes of Seshendra-mark images....Seshendra Sharma has a wealth of natural characteristics which are found in the architects of a new age in literature.... When the world of literature was anxiously looking forward for the emergence of a hero who will release literature from under the political iron-heels and wage a real revolutionary battle against the marauders and usher in a new season of spring, Seshendra Sharma gifted such intellectual leadership to the literary field and carried forward his poetry itself as a fervant literary movement. At a time when literary values received no regard whatever in the literary field, Seshendra Sharma resurrected the values of literature in his own revolutionary way. The out look of the Revolutionary Poet Seshendra Sharma is said best in his own Chamatkarika given here, "Who can weep for the other man; Who has that strength of humanness! You are indebted to the man who weeps for you; All the hungry millions of this century are indebted to Karl Marx."

In the decade of 1975 to 1985, the unique credit of investing the Telugu poetry with the complete life-breath of modernity goes entirely to Seshendra Sharma as the founder of a literry movement. Two are the indispensible characteristics that the architect of an era should have in him-he should be the founder of a movement; the second-he should be a visionary and creator of a great theory. Seshendrda Sharma has both of them ... there is no other contemporary poet who installed international consciousness in literature as Seshendra Sharma did, without allowing any political

incursion. That is why he is considered by critics as modern Bhagiratha of" Modern literary consciousness" ... Seshendra Sharma is an everlasting poet who moulded time and is the Mahakavi whom time cannot forget."

The famour poet Prof. K. Suprasannacharya, Head of Telugu Dept. Kakatiya University describes the magnetic influence of Seshendra's poetry in the following way- "With Seshendra a new generation of poets woke up in the Telugu speaking country. It may, perhaps, flood the country with greater profusion of genius than the romantic poets in this country. His poetry not only brought unprecedented richness to Telugu poetry but prevented three pollutions 1. Political pollution, 2. Removing obscurity, 3. Wiping out the boundaries of countries and reachingthe people in other languages. I feel many poets whose noise is heard very much today, may be covered by silence shortly and among those few who may remain int his cantury Seshendra will be one."

The well knowns scholarly poet Indraganti Hanumath Sastri said of 'My Country My People' "is a great work; it does not leave the reader in peace; it makes him sing, run and incites to jump to new heights. The poet who sings his experiences and his universal emotions without lending himself to the bondage of any political theory, is a great man."

Mr.Kundurthi Anjaneyulu well known as the father of Telugu Prose-Poetry said "that Seshendra excells Tilak and the famous poets that were there prior to him, in the skills of poetry."

Mr.Ajantha the reputed modern poet said in his articles entitled "Kitikee lo Suryudu" published in Andhra Prabha Daily 4-8-76, observed in it, "that the Kavya "Gorilla" is the pure poetry which flowed out of the immortal pen of the heralder of a new age in Telugu poetry, who worships man as God, keeping himself aloof from political pollution. There is

no need of any political labels for Seshendra's poetry. He is an absolutely independent and ultra modern poet who is not concerned with any political theories, which are like the hangman's ropes. One Seshendra is enough to hope that Telugu poetry has great future in the Indian canvass. My salute to him."

Well known critic Dr.K.Rammohan Roy wrote about "My Country My People" the line that - "in the huts of those poor workers who return home after working the whole day outside, there is not a ray of light," can be said in this century only by Seshendra."

Dr.RVS.Sundaram, Professor in Mysore University in his Book "Rasaaswadanam" says at page 69, that his translation into Kannada of Seshendra's kaavya "Gorilla" was very much appreciated by the Ex-Vice-Chancellor and scholar Dr.H.M.Nayak and the famous Indo-Anglian Prof.Shri Shanker Mokasi Punekar. For the said Kannada translation Dr.Sundaram received an award from the Human Resources Development Dept., of Govt.,of India and the translation was also prescribed as text book in the Mysore University.

Seshendra besides being a great poet, is an erudite scholar in Sanskrit. His contribution to contemporary Telugu criticism is of crucial importance. He wrote Kavisena Manifesto which is modern poetics synthesizing four systems of poetics namely, 1) Ancient Indian poetics, 2. Ancient Greco-Roman poetics, 3. Modern Western literary criticism and 4.Marxist poetics. He was the founder member of Kavisena movement which raised a storm against degenerate poets and decadent politicians and announced intellectual leadership for India rejecting political leadership

Prof.Sarugu Krishna Murthy of Bangalore University said of the Manifesto as follows, "I read the monumental work 'Kavisena Manifesto' with great interest in which the greatest modern poet Shri Seshendra has given new life and

value to the subject of poetics. I have read many a book in Telugu, English, Kannada and Hindi on poetics but no book appealed to me more than 'Kavisena Manisfesto'. I am of the opinion that without reading this work, knowledge of poetics will not reach perfection. I am now in a position to realize the real aims of Kavisena."

Famous poet and critic Mr.Addepalli Rama Mohan Rao said, "I read Kavisena Manifesto completely, and immensely enjoyed. The way how the poetics of various countries has been comparatively presented and how Seshendra's own original conclusions are propounded, is intellectually satisfying and praise-worthy. A great genius has been displayed in refuting the pseudo-socialist ideology in the contemporary Telugu field."

Seshendra wrote a tantric commentary called 'Shodasi' to "Sundarakanda" of Valmiki's Ramayan unfolding the esoteric meaning lying hidden in the Kanda for centuries together. A great Sanskrit scholar Mr.N.Ramesan, IAS, the then Education Secretary, A.P.Govt., writes, "the author's erudite scholarship and keen sense of research is evident throughout this work. The book is an original attempt at a re-interpretation of Valmiki in a new light. The book is so though-provoking and so well written that it deserves to be translated into English and several other Indian languages."

He wrote a similar commentary called Swarna Hamsa to the famous Sanskrit classic "Naishadhiya Charitam" of Bhatta Harsha. His many other critical writings brought him fame in the world of scholars and critics.

*[The above material is gathered from the volumes Yuga Kavi, Yuga Drashta, Telugu ke Adhunik Lok Priya Kavi, published by A.P.Hinai Akademi, Hyderabad, andViplava BhaashaaVidhaatha,(published by Sahitee Manjari, Ongole]*

# శేషేంద్ర సాహిత్యం

## అభిజ్ఞుల అభిప్రాయాలు

దేశవిదేశాల్లో తెలుగు సాహిత్యధ్వజం ఎగురవేసిన ఏకైక తెలుగుకవి శ్రీ శేషేంద్ర. ఆయన కవిత్వాన్ని గురించి ఆయన శాస్త్రవైదుష్యాన్ని గురించి సమస్త భారతదేశంలోనూ విదేశాల్లోనూ సుప్రసిద్ధకవులు, పండితులు వ్రాసిన కొందరి అభిప్రాయాల్ని ఈ క్రింద స్థాలీపులాక న్యాయంగా ఉదాహరిస్తున్నాము.

శేషేంద్ర విరచిత "నాదేశం నా ప్రజలు" అనే ఆధునిక ఇతిహాసానికి ఏథెన్సు నగరంలో ప్రచురితమైన గ్రీకు అనువాదానికి భూమిక వ్రాస్తూ అందులో జగద్విఖ్యాత గ్రీకుకవి నికిఫారస్ ప్రిత్సాకోస్ ఇలా అన్నాడు:

"It was not only Tagore and Gandhi who crossed the frontiers of their country and reached the wider world and achieved universality. Seshendra's epic poem "My country My people" is an evidence... ..Some of the well known critics have compared this epic poem with T.S.Eliot's 'Waste Land' and 'L' Ascension by St.John Perse. Personally I would compare the pain and anguish of the poet with the one of Loutremont in his lyric "Mald Aurore'. The difference is that Seshendra's protest is not made in the void. Seshendra walks firmly on his soil .... one can find in the poet a wild whirl wind which attains incredible oratorial heights, creating terrific images.......whirling with in him is the idea of strength of life that is fighting the dark powers which want to take away its freedom and bread...... at times we observe in the poem a biblical and prophetic tone that attracts us."

మైసూరు విశ్వవిద్యాలయంలో ఒక ఏడాదిపాటు సాహిత్య అధ్యయనం చేసిన సైప్రస్ దేశవాసిని దేనా అనెగ్జాగొరోస్ అనే విదుషి "నాదేశం నా ప్రజలు" ఆంగ్లానువాదం చదివి ఈ విధంగా వ్రాసింది.

"Thanks to Mr.Sundaram, I had the unique chance of reading some of your poetry which has been a revelation to me.... whatever was taking place inside the poem, was surrounding me in every day life of India; but till then Iwaslooking only at the surface of

India.... your poems have withdrawn the curtain of the illusion and showed me the otherside of India, the real India, of suffering. Your pain made me compare your poetry with that of Octavio Paz... Your poetry has elevated India to me and gave me this feeling that I cannot stand for long infront of the beauty. just as we cannot stand for long looking at the sun.... The tragedy you are living with inside you by watching the tragedy that takes place every moment and every hour around us, even I felt it walking to so many places of India I became more conscious of this with the help of your poems."

భారతదేశపశ్చిమాన ఉన్న మహానగరం జయపూర్‌లో ఉన్న రాజస్థాన్ యూనివర్సిటీ హిందీ విభాగాధ్యక్షుడు ప్రొఫెసర్ విశ్వంభర్‌నాథ్ ఉపాధ్యాయ 'మండేసూర్యుడు', 'నాదేశం నాప్రజలు', 'గొరిల్లా' అధ్యయనం చేసినతర్వాత 'మండేసూర్యుడు' హిందీ అనువాదానికి వారు వ్రాసిన భూమికలో ఇలా అన్నాడు. "శేషేంద్ర రచితమైన ఈ కృతుల్లో ఇంకా పేదరికంలో బానిసలుగా బ్రతుకుతున్న మన భారతీయ పీడిత వర్గాల దుఃఖము పాలకవర్గాల దౌర్జన్యము కేంద్ర వస్తువుగా గైకొని కవిత రూపొందింపబడింది. ఈ లక్షణమే సచ్చిదానంద్ హీరాలాల్ వాత్స్యాయన్ ఆజ్ఞేయలాంటి అభిజాత్య భావగ్రస్తులైన కవులనుంచి వేరు చేసి శేషేంద్రను ప్రజాకవుల పంక్తిలో నిలబెడుతుంది. ఆజ్ఞేయ రచనల్నీ శేషేంద్ర రచనల్నీ పోల్చి చూస్తే శేషేంద్ర ఆజ్ఞేయకంటే గొప్పకవి, సార్థక కవి అని రుజువవుతుంది."

రాజస్థాన్‌కు చెందిన జోధ్‌పూర్ యూనివర్సిటీ హిందీ విభాగ్‌లో రీడరు ప్రసిద్ధ కవయిత్రి డా॥ రమాసింహ్ 'నాదేశం నాప్రజలు' గురించి ఇలా వ్రాసింది. "పుస్తకం తెరిచానో లేదో సగంలో విడిచిపెట్టలేక పోయాను. ఒక గొప్ప నవ్యత ఒక గంభీర సంవేదన అందులో కళ్ళకు కట్టింది. ఈ ఆధునిక మహాకావ్యంలో మీరు మానవీయ విలువల్ని నిజంగా ఎంత సత్యస్వరూపం ఇచ్చి చిత్రించారంటే మిమ్మల్ని ఎంత ప్రశంసించినా అది చాలదనే నా అభిప్రాయం. నాల్గవ సర్గలో కవి తన కావ్య రచనా చిత్రాన్ని దేన్నయితే గీచాడో అది నిస్సందేహంగా సృజనా ప్రక్రియయొక్క ఒక మహాచిత్రం".

అదే యూనివర్సిటీలో హిందీ లెక్చరర్ శ్రీలక్ష్మీకాంత్‌జోషి ఇలా రాశాడు. "ఈ యుగపు మహాకవి, కావ్యపురుషుడు అయిన యుగకవి యొక్క కృతులచేత అనుప్రాణితుడ్ని కావడం నా అదృష్టం. "నాదేశం నాప్రజలు" గొరిల్లా అనే కృతులు

చదివిన తర్వాత నేను తెలుగుభాష నేర్చుకోవాలని నిశ్చయించుకున్నాను. రాబోయే దీపావళికి మీకు నేను తెలుగులోనే నా శుభాకాంక్షలు తెలుపుతాను".

బీహారు రాష్ట్రం ఛప్రానగరం రాజేంద్ర కాలేజి హిందీ విభాగాధ్యక్షుడు డా॥ కేదార నాథ్‌లాభ్ శేషేంద్ర కృతుల అధ్యయన పరిణామంగా వ్రాసిన ఒక వ్యాసంలో ఇలా అన్నాడు. "ఎక్కడ దినకర్ తన శౌర్యజ్వాల విసిరివేసి అంతటితో కవిగా తన బాధ్యత సమాప్తమయిందనుకుంటాడో అక్కడ శేషేంద్ర ఆవేశంతో తాను కవి అనే సత్యాన్ని మరచిపోడు .... దినకర్ కవిత్వంతో పోలిస్తే, అందులోనూ యుగీన కవిత్వ సందర్భంలో, శేషేంద్రలో దినకర్‌లోకంటే కవిత్వం అధికంగా ఉంది."

కలకత్తాకు చెందిన ప్రఖ్యాత ఆంగ్ల విమర్శకుడు, ఇండియన్ వర్స్ అనే ఆంగ్ల సాహిత్య సంచిక సంపాదకుడు ఆ సంచికలో శేషేంద్ర కవితను గురించి ఇలా రాశాడు.

"It is astonishing how Seshendra handles with felicity such shifts of thoughts and words with subtle and almost unknown thread which binds them still into an ineffable garland -- It unravels a restless, sensitive and poetic mind which has broken all ties with the humdrum and the conventional. It is the symbol of the spirit of freedom from all fetters...."

ఇంకా కవిగారి డైరీ 'రక్తరేఖ'ను గురించి ఇలా వ్రాసాడు.

"The notes embodies in the book are pretty versatile. They also reflect a deeply emotional soul, a sparkling intellect and a rich personality...A rare patriotism and love of mankind lighten's up many Seshendra's thoughts and expressions. Not exactly as Browning, yet Seshendra has an ultimate hope in humanity which makes even his most contemplative utterances gleam with the ray of the future of mankind.....Poet's Note Book is a dessertation, as original and as unmutilated as the first thought of a brilliant mind. It can compare with any of the famous personal notes and diaries which enriched the literature of the world...."

కలకత్తా విశ్వవిద్యాలయం హిందీ విభాగాధ్యక్షుడు ప్రొఫెసర్ కల్యాణ్ మల్ లోఢా శేషేంద్ర కృతుల్ని గురించి ఇలా వ్రాశాడు. "ఆధునిక పాశ్చాత్య మేధావుల్లో ఎవరి డైరీ కన్నా తీసిపోని మీ 'రక్తరేఖ' అనే డైరీ మీ రచయిత ప్రజ్ఞకు సశక్త ప్రమాణము. అలాంటి బహుముఖ ప్రతిభా ద్యోతకమయిన రచనే మీ మహాకావ్యం 'నాదేశం నా

ప్రజలు' ... ఒక లోక వ్యాపక విశాల భూమిక మీద ప్రతిష్ఠించిన ఐతిహాసిక క్షణాన్ని మానవీయ క్షణంగా పరివర్తన చేసే మానవీయ చింతన, భావబోధ ఉన్న ఒక మహత్తర సందర్భకథ, ఒక సఫల సమర్థ ... మహాకావ్యము".

భోపాల్ నుంచి అక్కడి జనధర్మ అనే (10-10-77) పత్రికలో ప్రసిద్ధ విమర్శకుడు ప్రొఫెసర్ ధనంజయవర్మ ఇలా వ్రాశాడు. "నాదేశం నా ప్రజలు" తర్వాత కవి శేషేంద్ర యొక్క ఈ రచన భారతీయ ప్రతిభ యొక్క ఎలాంటి విస్ఫోట అంటే అవిస్ఫోటలో భాషా సరిహద్దులు తెగి ఎగిరిపోయాయి. మన విశాలదేశము మన సమస్త సంస్కృతీ నఖ శిఖ పర్యంతము నిలువునా లేచి స్తంభాయమానంగా మన ఎదుట నిల్చుంటాయి. 'కాళిదాసనే రాక్షసుడు తన పేజీల్లో బంధించిన అప్సరసలను దేశం మీదికి విడుదల చేస్తా' నంటాడేగానీ కాళిదాసీయ విరహియక్షుడు పలికిన ప్రేమగాధా కావ్యం మీద పక్షపాతం వహించడు. కవితల్ని నిర్మించే కార్మికుడు గానే తన వ్యక్తిత్వాన్ని తాను గడించుకుంటాడు ... తన దేశాన్ని తన ప్రజల్ని ప్రేమిస్తూ వాటికోసం తుపాకి ఒక ప్రక్క కవిత మరోప్రక్క ధరించిన ఈ కావ్యం తన సంఘర్షశీలంచేత విశాల భారతీయ దృశ్యం సమస్తంలోనూ ఒక అనివార్య మానవీయ ఓజశ్వాలి కావ్యం అయింది.

ప్రసిద్ధ హిందీ ఉర్దూ కథా రచయిత శ్రీప్రేంచంద్ పుత్రుడు ప్రఖ్యాత హిందీ విమర్శకుడు శ్రీ అమృత్‌రాయ్ "నాదేశం నా ప్రజలు" గురించి ఇలా వ్రాశాడు. "బ్రహ్మాండమైన ఒక నవశక్తి దొరికింది. చాలాకాలం తర్వాత ఇలాంటి ఒక దుర్దాంత కావ్య ఊర్జ దర్శనమిచ్చింది. ఇందులో ఒకచోట కాంతి ఒకచోట అగ్ని - అందులోనూ నిర్ధూమ నిర్మలాగ్ని. ఈ కావ్యంలో ఎలాంటి అపూర్వ నూతనత్వం లభించిందంటే అలాంటిది అతి కష్టం మీదగానీ చూడడానికి దొరకదు. ఏదో ఒక పర్వత శ్రేణుల్లో నుంచి ధ్వనిస్తూ ప్రవహించే నదీ ప్రవాహంలో మాదిరి ఎప్పుడూ ఎరుగని క్రొత్తగా నవనవలాడే కావ్యబింబాలు ఒకదానిమీద ఒకటి పడుతూ దూకుతూ వస్తాయి. అద్భుతమైన ఆనందం లభించింది! ... నిశ్చయంగా ఇది ఒక అత్యంత మహత్వపూర్ణ కావ్యసృష్టి ఎవడైనా సరే అభిరుచి సంపన్నుడయిన పాఠకుడు ఈ కావ్యాన్ని చూస్తే త్రుటికాలమైనా ఆశ్చర్యాభి భూతుడైపోక తప్పదు".

సుప్రసిద్ధ హిందీ కవి శ్రీ నరేష్ మెహతా (1992 జ్ఞానపీఠ్ అవార్డు గ్రహీత) శేషేంద్రను కలిసి నప్పటి తన అనుభూతిని ఇలా వివరించాడు.

"It was an aesthetic experience to know the artist of your stature

and distinction. I was never before so much captivated and enchanted by any contemporary poetry and poet (1977)"

బెంగుళూరు విశ్వవిద్యాలయం హిందీ విభాగాధ్యక్షుడు, ప్రసిద్ధ హిందీ కవి, పండితుడు ప్రొఫెసర్ సరగు కృష్ణమూర్తి, ఆంధ్ర ప్రదేశ్ హిందీ అకాడమీ ప్రచురించిన 'శబ్దోసే శతాబ్దితక్' అనే తెలుగు కవితల హిందీ అనువాద సంకలనానికి హిందీ భూమిక వ్రాస్తూ ఇలా అన్నాడు. "ఈ శతాబ్దం యొక్క ఏడవ దశకం భారతీయ సాహిత్య చరిత్రలో చాలా మహత్వపూర్ణమైనది. కారణం, 74-75 కాలంలో శేషేంద్ర రచిత 'నాదేశం నా ప్రజలు' అనే మహాకావ్యం భారతీయ కవితలో ఒక కొత్త మలుపు తెచ్చింది - తెలుగు కవితలో శ్రీశ్రీ తొలిసారి విప్లవాన్ని కావ్యవస్తువుగా తెచ్చాడు. కానీ ఆ కావ్య వస్తువుకు నిజమైన కావ్యాభివ్యక్తి (Poetic expression) శేషేంద్ర రచిత 'నాదేశం నా ప్రజలు' మూలంగా నలభైఏళ్ళ తర్వాత లభించింది. మండే సూర్యుడు, నా దేశం నాప్రజలు, గొరిల్లా అనే కృతిత్రయంలో శేషేంద్ర సృష్టించినకావ్యాభివ్యక్తే నాటినుంచీ నేటి వరకూ తెలుగు కవితా క్షేత్రంలో కవులందరిచేత వాడబడుతోంది. ఈ కారణంగా - ఆధునిక తెలుగు కవిత్వంలో ప్రధమ మార్గకర్త రాయప్రోలు సుబ్బారావు. ద్వితీయ మార్గకర్త శ్రీశ్రీ అయితే, తృతీయమార్గ కర్త శేషేంద్ర".

ప్రసిద్ధ విద్వత్కవి బెంగుళూరు విశ్వవిద్యాలయ ఆంధ్ర శాఖాధ్యక్షుడు ప్రొఫెసర్ తంగిరాల వెంకట సుబ్బారావు శేషేంద్ర కవిత్వాన్ని మూల్యాంకన చేస్తూ భారతి ఆగస్టు 1985లోనూ, ఆంధ్ర ప్రభ దైనిక (7-7-85) లోనూ, తర్వాత సాహిత్యమంజరి, ఒంగోలువారిచే ప్రచురితమైన 'విప్లవ భాషా విధాత' (1986) అనే వ్యాస సంకలనంలో అదే పేరు శీర్షికతో వ్యాసం వ్రాస్తూ ఇలా అన్నారు. 'విప్లవానికి కావలసిన కవిత్వ భాష మొట్టమొదట గుంటూరు శేషేంద్ర శర్మగారి మండేసూర్యుడు నాదేశం నా ప్రజలు, గొరిల్లా అనే కావ్యాల్లో ప్రారంభమయింది. (అంటే 1974-77 మధ్యకాలంలో). అంటే అప్పటి నుంచీ ఇప్పటివరకూ వచ్చిన వస్తూ ఉన్న విప్లవ కవిత్వంలో ఈ కవిత్వభాషే వాడ బడుతోంది. వెనక చెప్పిన మూడు కావ్యాలకు పూర్వం వచ్చిన తెలుగు కవిత్వాన్ని, తర్వాత వచ్చిన తెలుగు కవిత్వాన్నీ పరిశీలనగా చూస్తే, తర్వాత వచ్చిన తెలుగు కవిత్వంలో ఈ మూడు కావ్యాల ముద్రలు కనిపిస్తాయి. ఈ కవిత్వ భాష విప్లవమనే కావ్య వస్తువుకు తొలిసారి ఇవ్వబడిన కవిత్వాభివ్యక్తి. దీని అర్థం నకలు చేస్తున్నారని కాదు. ఒక నూతన కవిత్వభాష మొదటిసారిగా సృష్టించబడినప్పుడు సామాన్య రచయితలందరూ దాని సమ్మోహక సీమల్లోకి వస్తారు. దాని అనన్య

అభివ్యక్తి విధానాన్ని అనుకరిస్తారు, అనుసరిస్తారు. క్రమంగా కొన్ని మార్పులు కూర్పులతో ఆ అనన్య అభివ్యక్తిలో ఊపులను మెలికెలను తీవ్రతను ఇత్యాది కీలక లక్షణాలను వాడి తమ రచన చేస్తారు".

నాగపూర్ యూనివర్సిటీ ఆంగ్ల శాఖాధ్యక్షుడు, విఖ్యాత సంస్కృత వాఙ్మయ పండితుడు అయిన ప్రొఫెసర్ పోతుకూచి సుబ్రహ్మణ్య శాస్త్రి **(P.S.Sastry)** శేషేంద్ర కృతులను గురించి ఇలా వ్రాశాడు. "రక్తరేఖ -

The book is revealing. There is a vibrant personality handling many controversial problems...

స్వర్ణహంస చాలా బాగున్నది. మంత్ర తంత్ర యోగవేదాంత మేళనమును చక్కగా చూపినారు... మీ కృషి అమోఘము. మీరు కేవలం కవులే అన్న దురభిప్రాయం ఉన్నది. "పాండిత్యహీనాః కవయో భవంతి" అన్నారు కదా! ఇప్పుడు మీరు కవులు మాత్రమే కాదనియు, పండితులని, దార్శనికులని, అందుచేత "ద్విత్రాపంచషా" అనే పంక్తికి ఇంకొక సంఖ్య చేర్చాలని భావిస్తున్నాను... తిక్కనపై మీరు చేసిన విమర్శ దుర్భేద్యంగా ఉంది ....చంపూ వినోదినిలోని ఆశుకవిత్వం అత్యంత రమణీయంగా ఉంది. మీరు వ్యంజనా వాదులైనా రసపరంగా పద్యాలున్నవి. వృత్తాలపోకడ, సీసపద్యాల తీరు శ్రీనాథుని జ్ఞాపకం చేస్తున్నవి..."

బెంగుళూరు జర్నలిస్టు నందితా అమెంబాళ్ ఇంగ్లీషు డైలీ, ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌లో వ్రాసిన వ్యాసంలో ఈ విధంగా అన్నది".

"The first hind of Seshendra's eminence lay in his passionate convictions to which he gave expression during an informal chat last week...critics compared Seshendra more than favourably with the daughty and well known Hindi poet Dinkar. Seshendra deeply approves of it, not because it favoured him but because he has a deep rooted passion for what he calls "Indianity of literature." And he considers such critical assessment of poets at a country-wide level to be a first step in this direction...... An intellectual who shuns the ivory tower to mixing with people students and sons of the soil, records their hopes, lives, desires disappointments and aspirations. Seshendra proves to be very much a voice of his Nation-(Indian Express, 15-1-1976)

ప్రఖ్యాత ఉర్దూ విమర్శకుడు, కమ్యూనిస్టునాయకుడు, శ్రీరాజ్ బహదూర్ గౌడ్

'సియాసత్' పత్రికలో "నాదేశం నా ప్రజలు" గురించి రాస్తూ ఇలా అన్నాడు. "నాదేశం నా ప్రజలు భారతీయ సాహిత్యంలో ఒక మహత్వపూర్ణమైన ముందడుగు, ప్రేమ శ్రామికత్వాల ఇతిహాసం. రొమాంటిక్ ఉద్యమం నుంచి అభ్యుదయ ఉద్యమం వరకూ భారతీయ సాహిత్యం చేసిన యాత్రకు సంకేతం నాదేశం నా ప్రజలు".

విఖ్యాత ఉర్దూ మహాకవి శ్రీ అలీసర్దార్ జాఫ్రీ శేషేంద్ర రచిత "నాదేశం నా ప్రజలు" ఇతిహాసం ఉర్దూ అనువాదానికి భూమిక వ్రాస్తూ అందులో ఇలా చెప్పాడు. "నేను ఆయన కవితను ఆయన కంఠస్వరం ద్వారా విన్నాను. దాని కోమలత బలిష్ఠత దాని మహత్తర శక్తి స్వయంగా అనుభూతి చెందాను... 'నాదేశం నా ప్రజలు' భారతీయ ఇతిహాసం, ఆధునిక భారతీయ ఇతిహాసం. నవయుగీన కవితా శిఖరాలు చుంబిస్తూ అది మానవ ఇతిహాసంగా రూపొందింది. ...ఏ కవి మృదుల సౌందర్యారాధకుడో, ఏకవి విప్లవ శిఖరాగ్రాలకు ఎగబ్రాకుతాడో, ఏ కవిహృదయం మానవ ప్రేమకాంతుల్లో ప్లావితం అయిందో ఆ కవి నా సమకాలికుడు. బహుశా నేనే ఆయన సమకాలికుడ్ని అనడం మరింత సమంజసంగా ఉంటుంది."

అభ్యుదయ కవితా యుగకర్త శ్రీశ్రీ శేషేంద్రకవితను ఇలా ప్రశంశించాడు. "శేషేన్ శేషేన్ నీ పొయెంస్ చూసేన్ ... నీది మంచి పద్యమా లేక ఫ్రెంచి మద్యమా, దుమాగా ఉంది ఇమేజి । రమారమి కవుల సమాధి."

కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు ఇలా అన్నారు: "రమణీయత కీతని రచన కుండిన పంటచేను. ఇట్టి రచన చేయగలవారు ఈనాడు పట్టుమని పదిమందిదైనను లేరు".

సరస్వతీపుత్ర శ్రీ పుట్టపర్తి నారాయణచార్యులు ఇలా చెప్పారు "శేషేంద్ర కవిత్వంలో ఎక్కడ పట్టినా మనోహర ధీర గంభీర శైలి కన్పిస్తుంది. రీతిని ఇంతగా సాధించిన వారు అరుదు."

కళాప్రపూర్ణ శ్రీ పురిపండా అప్పలస్వామిగారు 'నాదేశం నా ప్రజలు' గురించి ఇలా వ్రాశారు. "నా దేశం నా ప్రజలు పుస్తకం విప్పానో లేదో ఎనిమిది సర్గలూ ఎనిమిది అరపావు గంటల్లో ఆగకుండా ముగించాను. మళ్ళీ ఒక్కొక్క సర్గా చదివాను, నాలో కదలిన కదలికలు ఎలా రాయడం? ప్రతిసర్గా ప్రతిపుటా, ఇంకా చెప్పాలంటే అక్కడక్కడా ప్రతిమాటా ఎన్నో ఊపులు ఊపింది ; ఎన్నో కుదుపులు కుదిపింది. నిజమే వర్తమాన ఆంధ్రకవిత్వంలో ఇతిహాసం ఒక అచుంచితమైన ప్రక్రియ. ఈ అచుంచితమైన దానిని చుంచించిన తొలి రచయిత మీరు. అభినందిస్తున్నాను."

విఖ్యాత విమర్శకుడు శ్రీఆర్. యస్. సుదర్శనం భారతిలో వ్రాసిన వ్యాసంలో ఇలా అన్నారు. "నాదేశం నా ప్రజలు దృక్పధంలో ఇతివృత్తంలో నిర్మాణ సౌష్ఠవంలో విలక్షణమైన నూత్న సృష్టి. ఈ కావ్యంతో తెలుగు కవిత్వం ఒక మలుపు తిరిగిందని చెప్పడం తొందరపాటు కాదనుకుంటాను. కృష్ణ పక్షం భావకవితకు, మహాప్రస్థానం అభ్యుదయ కవితకు వేగుచుక్కలైనట్లే, నాదేశం నా ప్రజలు తెలుగు కవిత్వాన్ని క్రొత్తదారుల్లో నడిపిస్తుందని నాకు తోస్తుంది". శ్రీ సుదర్శనంగారు ఆనాడు దూరదృష్టితో అన్నమాట ఈనాడు వాస్తవరూపం ధరించడం మనం చూస్తున్నాము. సుదర్శనంగారే మరొకచోట ఇలా అన్నారు–

"Seshendra Sarma's poetry has attained great heights of originality and unrivalled beauty... criticism in Telugu has yet to catch up with the work of poets like Seshendra Sarma..."

శ్రీ సుదర్శనంగారు మరొకచోట శేషేంద్రను నవయుగనిర్మాతగా పేర్కొంటూ ఇలా అన్నారు.

"I was pleasantly surprised to find Sri Sri now imitating Seshendra Sarma. It is a poem on the new year Rakshasa, which he calls" Clay Tiger." I give the lines in which Sri Sarma peeps out... what further indication or assurance, is required to say that Sarma has arrived as the new trend- setter among poets."

ఆధునిక విమర్శక చక్రవర్తి, హైదరాబాదు యూనివర్శిటీ ఆంధ్రశాఖాధ్యక్షుడు, ప్రొఫెసర్ జి.వి. సుబ్రహ్మణ్యం, తన పర్యవేక్షణ క్రింద శేషేంద్ర సాహిత్యం మీద జరిగిన పరిశోధనకు సంబంధించిన 'శేషేంద్ర కవ్వితానుశీలనం' (రచయిత. డా. పెన్నాశివరామకృష్ణ) అనే సిద్ధాంత వ్యాస గ్రంథానికి వ్రాసిన పీఠికలో, ఇలా అన్నాడు: "విశ్వనాధ శ్రీశ్రీల లాగ సమకాలీన తెలుగు సాహిత్యంలో నిస్సంశయంగా శేషేంద్రశర్మ జీనియస్. 'మండే సూర్యుడు'గా పిడికిలెత్తినప్పటినుంచీ తెలుగులో వచన కవిత్వం శేషేన్ మార్కు భావచిత్రాల పట్టు శాలువా కప్పుకోవటం నేర్చుకుంది. .. శేషేంద్రశర్మకు ఒక సాహిత్యయుగ కర్తకుండే సహజ లక్షణాలు పుష్కలంగా ఉన్నాయి... రాజకీయ ఇనుపపాదాల తొక్కిళ్ళ నుండి విముక్తి కలిగించి మరొక వసంతం కోసం విప్లవపోరాటం సాగించే వీరునికోసం ఎదురు చూస్తోంది సాహితీలోకం (అప్పుడు) శేషేంద్రశర్మ ఆ వైజ్ఞానిక నాయకత్వాన్ని కవిత్వానికి అందించి తన కవిత్వాన్నే ఒక సాహిత్య ఉద్యమంగా సాగించాడు... సాహిత్యపు విలువలకు గౌరవంలేని కవితా రంగంలో

విప్లవ పంథాతోనే విలువల్ని కలిగించాడు శేషేంద్రశర్మ... విప్లవకవి శేషేంద్రశర్మ వివేచన ఇది: 'ఎవరు ఏడవ గలడు మరొకడికోసం? అంతశక్తి ఎవడికుంది? నీ కోసం ఏడ్చేవాడికి నీవు ఋణగ్రస్తుడివి. మార్క్సుకు ఈ శతాబ్దపు అన్నార్తులందరూ ఋణగ్రస్తులు' . 1975 -85 దశాబ్దంలో తెలుగు కవితను ఆధునిక జీవకళలో ఆపాత మధురంగా అభిషేకించిన గౌరవం శేషేంద్రశర్మ సాహిత్యోద్యమ కర్తగా సాధించుకున్నాడు.... యుగకర్తకు కావలసిన ఆధునిక లక్షణాలు రెండు - అతడు ఉద్యమ కర్త అయి ఉండాలి. అతడు దార్శనికుడూ సిద్ధాంత ప్రవర్తకుడూ అయి ఉండాలి. శేషేంద్రశర్మ రెండూ... శేషేంద్రశర్మలాగా అంతర్జాతీయ భావనను రాజకీయేతర స్పృహతో సాహిత్యంలో స్థాపించిన సమకాలీన కవి మరొకడు లేడు. అందువలననే ఆయనను ఆధునిక సాహిత్య స్పృహకు అభినవ భగీరథుడుగా విమర్శకులు భావిస్తారు... శేషేంద్రశర్మ కాలాన్ని మలిచిన కవిగా, కాలం మరువలేని మహాకవిగా నిలుస్తాడు."

సుప్రసిద్ధకవి, కాకతీయ విశ్వవిద్యాలయం తెలుగుశాఖ అధ్యక్షుడు ప్రొఫెసర్ కె. సుప్రసన్నాచార్య శేషేంద్రకవితా ప్రభావాన్ని గురించి ఇలా సమీక్షించాడు.

"మీతో ఒక కొత్త తెలుగు కవులతరం తెలుగుదేశంలో మేల్కొన్నది. దాదాపు అది ఈ శతాబ్దపు తెలుగుదేశంలో మేల్కొన్న కాల్పనిక పరంపర కంటే ఎక్కువ ప్రతిభా వర్షం కురిపించ వచ్చును. మీ కవిత తెలుగుకవిత్వానికి అపూర్వమైన రిచ్‌నెస్ ఈనాడు సమకూర్చడమే కాకుండా మూడు కాలుష్యాలను నివారించింది. 1. రాజకీయకాలుష్యం 2. అయోమయం తొలగించడం 3. దేశపు హద్దులను చెరిపివేసి ఇతర భాషల వారిని చేరడం. ఎందరో ఈనాడు వినబడుతూ ఉన్న కవులు కొద్ది రోజుల్లో వినబడకుండా అయిపోతారేమోననీ ఈ శతాబ్దిలో మిగిలి వినబడే కొద్ది కవుల్లో మీరు ఉంటారని నాకు తోస్తున్నది."

సుప్రసిద్ధ పండితకవి ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి గారు ఈ విధంగా అన్నారు, "మీ 'నాదేశం నా ప్రజలు' గొప్ప రచన. పాఠకుడ్ని స్తిమితంగా ఉండనివ్వదు, పాడిస్తుంది, పరుగులెత్తిస్తుంది, కొత్త ఊహకు పురికొల్పుతుంది. ఏ ఇజమునకూ తాకట్టుపడకుండా కేవల తటస్థుడుగా తన అనుభూతిని, విశాల అవగాహనను గానంచేసే కవి గొప్పవాడు."

వచన కవితా పితామహుడు శ్రీ కుందుర్తి ఆంజనేయులు శేషేంద్ర కవిత్వాన్ని గురించి ఇలా అభిప్రాయపడ్డాడు. "మన కవితా రీతులూ కొన్ని విశ్వాసాలూ

వేరనుకోండి. అయినా, నేననుకుంటాను, ఆ రీతిలో రాసే నేర్పులో మీరు తిలక్‌నూ అంతకు ముందున్న కొందరు సుప్రసిద్ధ కవులను మించిపోతున్నారు."

ఆధునిక కవితాగ్రణి శ్రీ అజంతా 'కిటికీలో సూర్యుడు' అనే శీర్షికతో 4-8-1976 ఆంధ్ర ప్రభలో వ్రాసిన వ్యాసంలో శేషేంద్ర కవితను విస్తృతంగా సమీక్షించారు; అందులో ఆయన ఇలా అన్నాడు," గొరిల్లా ఖండకావ్యం రాజకీయ కాలుష్యానికి దూరంగా, మనిషినే దైవంగా ఆరాధిస్తున్న నవయుగ వైతాళికుని అమృత లేఖిని నుంచి వెలువడిన పరిశుభ్ర కవిత్వం. శ్రీ శేషేంద్ర కవిత్వానికి రాజకీయ ముద్రలేవీ అవసరంలేదు. సిద్ధాంతాల ఉరితాళ్ళతో ప్రమేయంలేని సర్వస్వతంత్రుడైన అత్యాధునిక కవి ఆయన. తెలుగు కవిత్వానికి భవిష్యత్తు లేకపోలేదు సుమా అని నిరూపించడానికి శ్రీ శేషన్ ఒక్కరు చాలు. ఆయనకు నా శాల్యూట్."

ప్రసిద్ధ కవితా విమర్శకుడు డా.కె. రామమోహనరాయ్ 'నాదేశం నా ప్రజల్ని' గురించి ఇలా వ్రాశారు. 'గుప్పెడు వెల్తురు', పగలంతా పనిచేసి 'వచ్చిన వారి గుడిసెల్లో రాత్రి దీపం లేకపోవటమూ - ఈ శతాబ్దిలో మీరే చెప్పగలిగిన భావాలివి.'

'పాండిత్య హీనాః కవయోభవంతి' అన్నట్లు శ్రీ శేషేంద్ర కేవలం కవి మాత్రమే కాడు. క్షుణ్ణమైన ఆయన భారతీయ కావ్యశాస్త్రజ్ఞానము పాశ్చాత్యకావ్యశాస్త్ర జ్ఞానము ప్రశంసనీయము. ఈ అమూల్య జ్ఞానం ఆధారంగా ఆయన రచించిన 'కవిసేన మేనిఫెస్టో' అనే ఆధునిక కావ్య శాస్త్రం తెలుగు సాహిత్యంలో విశేష ఖ్యాతి గడించింది. దాన్ని గురించి సాహిత్య వేత్తల అభిప్రాయాలు ఈ క్రింద పొందుపరుస్తున్నాము.

ప్రసిద్ధ సంస్కృత పండితులు శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు ఇలా అన్నారు. "శ్రీ శర్మగారు సమస్తాలంకారశాస్త్ర వైశారద్యమును గడించి, నవీన యుగ నిర్మాణ దక్షత సంతరించుకున్న సాహితీ ద్రష్ట. ఈ కవిసేన మేనిఫెస్టో అనేకులకు కనువిప్పు కలిగించి జోహారులర్పింపజేయునదిగా ఉన్నది".

ప్రఖ్యాత విమర్శకుడు, పండితుడు అయిన శ్రీ అమరేంద్ర ఇలా వ్రాశాడు :

"The book is a happy blend of erudition integrating vision, creative insight, crusading zeal, and righteous indignation. I am amazed at the sweep and depth of your consummate scholarship. I earnestly hope that this book would stand as a land mark in Poetics. The synthesis of the Eastern and the Western critiques on form, content and function is really commendable. Quotations from Lenin and other Russian critics must serve as eyeopeners to

our Marxist critics who extol content at the expense of form .... In some places the tone is too trenchent, I feel. But on the whole the work is very lively by exposing tin- gods with clay feet.

ప్రసిద్ధ విమర్శకుడు కాకతీయ విశ్వవిద్యాలయ ప్రొఫెసర్ డా॥ కేతవరపు రామకోటిశాస్త్రి కవిసేన మేనిఫెస్టోను గురించి ఇలా వ్రాశాడు. "ఈ మేనిఫెస్టో ఆధునిక కావ్య శాస్త్రమనటానికి ఏమీ అభ్యంతరంలేదు. సృజనాత్మకమైన కావ్యప్రక్రియా ప్రయోజనాల్ని మార్క్సిస్టు సాహిత్య వివేచనా దృక్పథం శాస్త్రీయంగానూ క్షుణ్ణంగానూ పరామర్శిస్తున్నదన్న ప్రగాఢమైన విశ్వాస జ్ఞానంతో ప్రాచ్య సామ్యవాద సాహిత్య సిద్ధాంతాలు కావ్యాత్మ దర్శనంలో ఎలా ఐకమత్యాన్ని భజిస్తున్నాయో నిరూపించటం లక్ష్యంగా సాగిన ఈ రచన నిజంగా భేషుగ్గా ఉన్నది... 'నా దేశం నా ప్రజలు' అనే ఆధునిక ఇతిహాస రచనవల్ల అభ్యుదయ కవితాధ్వమున స్వరూపమును త్రోసి రాజని స్వభావమును బట్టి కావ్యత్వమును స్థాపించిన గుంటూరు శేషేంద్రశర్మగారు, ఆధునిక ఆంధ్ర సాహిత్య విమర్శ నాధ్వమున ఈమేనిఫెస్టో రచన చేత ఒక విశిష్ట సమన్వయాభ్యుదయ దృక్పథాన్ని ప్రతిపాదిస్తున్నారని చెప్పవచ్చును." (విమర్శిని, జనవరి. 1978)

బెంగుళూరు విశ్వవిద్యాలయ హిందీ విభాగాధ్యక్షుడు ప్రొఫెసర్ సరగు కృష్ణమూర్తి ఇలా వ్రాశారు.

"I read the monumental work, 'Kavisena Manifesto' with great interest in which the greatest modern poet Shri Seshendra has given new life and value to the subject of poetics. I have read many a book in Telugu, English, Kannada, and Hindi on poetics but no book appealed to me more than Kavisena Manifesto... I am of the opinion that without reading this work, knowledge of poetics will not reach peaks of perfection. I am now in a position to realise the real aims of Kavisena."

ప్రముఖ సాహిత్యవేత్త డా॥ త్రిపురనేని వెంకటేశ్వరరావుగారు, ఈ మేనిఫెస్టో గురించి ఇలా వ్రాశారు. "సామాజిక చైతన్యాన్ని సాహిత్య చైతన్యంగా మార్చేశక్తి కవికి కావాలని నిరూపించి భావవిప్లవానికి మార్గదర్శకులైరి. అంధవిశ్వాసాలతో పాతదారులలో నడిచే సనాతనకవుల కళ్ళు తెరిపించారు. ప్రాక్ పాశ్చాత్య ఉత్తమకవి పండితుల రచనలను అధ్యయనంచేసి, పాతకొత్తల తూర్పు పడమరల సంస్కృతుల్ని సమన్వయపరచి, ఈ కావ్య శాస్త్రాన్ని తయారు చేశారు. 'కవి గొంతుక ఒక నైతిక

శంఖారావం' అనే శేషేంద్రగారి ప్రబోధం ఉషోదయం వంటిది. వారు ఆధునికాంధ్ర కవుల్లో సుప్రసిద్ధులు. నాకు మిత్రులు. వైజ్ఞానిక ఉద్యమ వర్గాన్ని సుసంఘటితపరచి క్రాంతి వాదాన్ని వ్యాపింపజేయాలనే కవిసేన ఉద్దేశ్యము మిక్కిలి ఉదాత్తమైనది.... కవిసేన నిర్మాణ మందలి కౌశలము వేమారు ప్రశంసించెదను."

సుప్రసిద్ధకవి విమర్శకుడు శ్రీ అద్దేపల్లి రామమోహనరావు ఇలా వ్రాశారు. "మేనిఫెస్టో పూర్తిగా చదివాను. చాలా ఆనందించాను. అనేక భాషల్లోని కవితా జ్ఞానాన్ని Compare చేస్తూ original ideas ని conclude చేసే విధానం చాలా బాగుంది. Peaudo-socialist ideology ని ఆధునిక ఆంధ్ర సాహిత్యంలో వికృత రూపం దాల్చినదాన్ని, సహేతుకంగా ఖండించడంలో గొప్ప ప్రతిభను ప్రదర్శించారు..."

సంస్కృత వాఙ్మయంలో ఆయనకున్న విస్తార జ్ఞానము, ఆయన అందులో చేసిన అసాధారణ కృషి, సంస్కృత వాఙ్మయానికే మకుటాయమానము. శ్రీ శేషేంద్ర వాల్మీకి రామాయణంలో సుందరకాండకు తాంత్రిక వ్యాఖ్య వ్రాశాడు. అందులో తత్పూర్వం ఎవ్వరూ ఆవిష్కరించని అపూర్వ మర్మాలను విప్పి చెప్పారు. ఆ పుస్తకం పేరు 'షోడశి'. దానికి వాచస్పతి బిరుదాంకితుడైన విద్వద్వరేణ్యుడు శ్రీమాన్ గుండేరావ్ హర్కారే సంస్కృతంలో పీఠిక వ్రాశారు. అందులో కొన్ని పంక్తులు ఉదాహరణకు, "అయం స్వతంత్రో గ్రంథః, రామాయణ విషయే స్వతంత్రాః విచారాః అమూల్యాః అస్మిన్ గ్రందే ప్రదర్శితాః అత్రభవాన్ శ్రీమాన్ శేషేంద్రశర్మా అయం ఆంధ్రాంగ్ల గీర్వాణ భాషాసు నిష్ణాతః శాక్తాగమ విశేషజ్ఞః వాల్మీకి రామాయణాధ్యయనే కృతభూరి పరిశ్రమః అస్యమహో వైదికస్య సూక్ష్మతమా విచార సరణిః అనన్యాదృశీ... ఏతేన గ్రంథకృతో వేదాద్యాగమ శాస్త్రప్రావీణ్యాం సాహిత్య వైశారద్యంచ వ్యక్తీ భవతి. యే రామాయణవ్యాఖ్యా గ్రంధాః మహాపండితైర్విరచితాః బహవో నిర్దిష్టాస్తేషు తత్తచ్ఛాస్త్ర సిద్ధాంత విశేషాః సాధక బాధక ప్రమాణ ప్రదర్శన పూర్వక్షం ప్రతిపాదితాః పరమీదృశం మంత్రరహస్య ప్రకాశనం నక్వాపి ప్రతీయతే - శ్రీమాన్ శేషేంద్ర శర్మా అపూర్వ ప్రతిభాశాలీ ఆగమేష్వధీతీ, సాహిత్యమర్మజ్ఞః ..."

ఈ గ్రంధాన్ని గురించి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ విద్యాశాఖ సెక్రెటరీ, గీర్వాణ భాషావిశేషజ్ఞుడు అయిన శ్రీ ఎన్. రమేశన్ ఇలా వ్రాశారు

**N. Ramesan I.A.S.** "the author's erudite scholarship and keen sense of research are evident through out this work. The book is an original attempt at a reinterpretation of Valmiki in a new light .. the book is so thought provoking and so well written that it

deserves to be translated into English and several other Indian languages."

శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారు షోడశి గురించి ఇలా వ్రాశారు. "ఒక్కటిని నిస్సంశయముగా చెప్పవచ్చును. వీరి పాండిత్యము చాలా లోతుగలది. వీరి శ్రీవిద్యా వేత్తృత సర్వంకషమని చెప్పుటకుక అభ్యంతర ముండకూడదు. భారత రామాయణములను కలిపి వీరు చదివినట్లు చదివిన సంఖ్య లేదనియే చెప్పవచ్చును... ఉన్నచో ఒకరిద్దరుందురేమో! శ్రీ శర్మగారికి నాకు చెలిమి గలదు. అప్పుడప్పుడు నైషధము నుండి కొన్ని శ్లోకములు దేవీ పరముగా నాకు సమన్వయించి చెప్పుచున్నప్పుడు నేను వారికవి యాదృచ్ఛికముగా తోచిన విషయము లనుకున్నాను గానీ, శ్రీవిద్యా విషయము నింత లోతుగా తెలిసిన వారను కొనలేదు. వారీ గ్రంధము వ్రాసినందుకు తెలుగువారే కాదు భారతీయులందరును కృతజ్ఞులుగా నుండవలసిన విషయము".

వైదిక వాఙ్మయంలోనూ లౌకిక వాఙ్మయంలోనూ సర్వంకష జ్ఞానమున్న పండిత వరేణ్యుడు శ్రీ వావిలాల వేంకటేశ్వర శాస్త్రిగారు శేషేంద్ర రచిత 'స్వర్ణహంస' అను భట్టహర్ష నైషధీయ చరిత వ్యాఖ్యను చదివి ఇలా వ్రాశారు. "భవద్భిః ప్రకటీ కృతేషు నైషధీయ వ్యాసేషు సాభిప్రాయం మదీయం వ్యాసం కంచిత్ ఆంధ్రప్రభాయాం ప్రకటీకర్తుం కృతనిశ్చయోస్మి... భవదీయ వ్యాసేషు మహీన్ సుగుణో వర్తతే, సప్రమాణం విషయనిరూపణం కృతం అనేక ప్రామాణిక గ్రంథాః దృష్టాంతీ కృతాః... మల్లినాథ సూరిభిరపి అచుంబితోర్థాః భవద్భిః ప్రకటీకృతా...తత్ మహత్ సంతోషస్థానం ...భవాదృశాః సంస్కార జీవినో విరళతయాలోకే వర్తంత ఇత్యుక్తిః న సాహసికీ భవతి...."

శిరోమణి సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రి, పి.ఓ.యల్. 'స్వర్ణహంస'ను గురించి ఇలా వ్రాశారు, "స్వర్ణహంస గ్రంథకర్తలు శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మగారు యోగ మంత్ర, వేదాంత సాహిత్య శాస్త్రములందు నిష్ణాతులు. సంస్కృతాంధ్ర కవితాదక్షులు. ఇట్టి పాండిత్యము నార్జించిన వారు నూటికో కోటికో యొక్కరుందురు. ఇది భట్టహర్ష నైషధ కావ్యమును గూర్చి వ్రాయబడిన విమర్శ గ్రంథము. చాల నగాధముగా నున్నది. ఇది పిహెచ్.డి. డిగ్రీ కొరకు వ్రాయబడిన విమర్శ వ్యాసము (ధీసిస్) వలెనున్నది..."

ప్రఖ్యాత సంస్కృత విద్వాంసులు, 'ఆంధ్రబిల్హణ' బిరుదాంకితులు అయిన శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు షోడశి, స్వర్ణహంసలను గురించి (అంటే ఆయన ప్రకారం రామయణ మహాభారత నైషధీయ చరితములు మూడూ) ఇలా వ్రాశారు.

"ఈ గ్రంథములందు నిక్షిప్తములైయున్న మంత్రయోగ వేదాంత శాస్త్రార్థములను వెలికితీసి బుధులకు పంచిన సాహితీకర్మయోగీంద్రుడు శేషేంద్రుడు. ఇట్టి యపూర్వకృషిసల్పిన శ్రీ శర్మగారి మేధా సంపత్తి, భాషా వైశారద్యము, పాండిత్యము అత్యంత ప్రశంసనీయములు. ఈ యపూర్వార్థములను ఇంత వరకు మనకెవ్వరును చూపియుండలేదు. ఈ యపూర్వకృషికి వీరి యెడల కృతజ్ఞతను చూపించవలసి యున్నది.

*గీర్వాణ వాణీ మకుటాగ్రరత్న*
*త్రయం కషన్ దీప్తిమఖండ భూతలే*
*సంవ్యాపయత్ కోవిద ముఖ్యఏష*
*శేషేంద్ర శర్మాతమిమంస్తువేహం ॥*

*నిష్ణాతః శబ్దతంత్రే నిరుపమధిషణః కోమలే కావ్యమార్గే*
*నిస్సీమో రాజ్యతంత్రే నిరుపహత గతిర్దుర్గమే తత్త్వమార్గే*
*ప్రాక్ ప్రత్యక్ గీస్సముద్ర ప్రథిత మణిగణా కర్షణేయం నదీష్ణః*
*శ్రీ మచ్ఛేషేంద్రశర్మా జగతి విజయతే మండనం పండితానాం -"*

N.B. : పై సామగ్రి యుగకవి, యుగద్రష్ట, తెలుగుకె ఆధునిక్ లోక్ ప్రియ కవి ( ప్రచురణ: ఏ.పి. హిందీ అకాడమీ), విప్లవ భాషా విధాత (ప్రచురణ : సాహితీ మంజరి, ఒంగోలు) అనే గ్రంథాల్లో నుంచి సేకరించబడింది.

*(Excerpts from "TeluguBhasha Ke Aadhnnık Lok Priya Kavi" authored by Shri Vemuri Radhakrishna Murthy, President, A.P. Hindi Academy - Published by A.P. Hındi Academy, Hyderabad in 1990)*

शेषेन्द्र के साहित्य से सबधित समालोचनात्मक ग्रथो के लेखको मे विभिन्न विश्वविद्यालयो के आचार्यो के अलावा दर्जनो मूर्धन्य विद्वान भी हैं। इसी प्रकार हिन्दी, उर्दू एव अग्रेजी के भी विद्वज्जन समालोचको की सख्या इस दिशा मे अत्यधिक है।

कई विश्वविद्यालयो के छात्र श्री शर्माजी की विभिन्न कृतियो पर शोध ग्रथ प्रस्तुत कर चुके है, कर रहे हैं। श्री शेषेन्द्रजी ने कविसेना मेनफेस्टो प्रकाशित कर तहलका मचा दिया। कविसेना ने एक आन्दोलन का रूप धारण किया। साहित्य जगत् का शुद्धीकरण, सच्चे साहित्य का निर्धारण एव मूल्याकन आदि इस साहित्यिक आन्दोलन के प्रधान लक्ष्य है।

आज आधुनिक तेलुगु काव्य जगत् मे श्री शेषेन्द्र शर्माजी के मार्ग पर चलनेवाले कवियो की सख्या बढ रही है। ये सभी श्री शर्माजी को निस्सकोच युगप्रवर्तक कवि मानते है।

आज स्वतत्र भारत के अधकारमय माहोल को बदलने के लिए हर नागरिक को कमर कसना है। आज हर आदमी सोचने को विवश है कि इस देश का क्या होगा? इस स्थिति मे दहकते सूरज के रूप मे कवि शेषेन्द्र शर्मा जी ने देश मे नई क्राति का झडा अपनी कृतियो के द्वारा फहरा दिया है।

"जनता के बीच कवि की क्राति का यह पैगाम पहुचे। कई शेषेन्द्रो का आविर्भाव हो। भारत का काया पलट हो। विश्व मानवता के पुष्प पृथ्वी पर बिहँस उठे, यही महाकवि शेषेन्द्रजी की तमन्ना है।"

## SUHRULLEKHA - 2

**Dr. Madiraju Ranga Rao**
Retired Professor of Telugu
Kakatiya University
Vidyaranyapuri
WARANGAL - 506 009

**"SWECHA KAVITA SAMRAT"**

Manya Sri GUNTURU SESHENDRA SARMA GARIKI Namaskrutulu . .

You deserve not only Saraswathi Samman Award but above, Jnanapeeth award

Your colossal literary personality has no parallel in modern poetry This is my firm opinion

WARANGAL
18-2-1997

(Sd.)
**MADIRAJU RANGA RAO**

# సుహృల్లేఖ - 3

శ్రీ డా॥ శ్రీపాద కృష్ణమూర్తి M.A ; Ph D.
(రిటైర్డు ప్రిన్సిపాలు)
1-106, గుమ్మలూరు-534267
పోడూరు మండలం
పశ్చిమగోదావరి జిల్లా

గుమ్మలూరు
02-04-97

Respected Seshendra Garu ! నమః-

మీరు ఈ సరికి హైద్రాబాదు చేరి ఉంటారని తలుస్తాను. కాకినాడలో మిత్రులు జానకీజాని, మిరియాల రామకృష్ణ, శివలెంక ప్రకాశరావు( ? ) తదితరులు నాకూ మిత్రులే- జానకీజాని నాకు చిరమిత్రుడే కాక, మా మేనమామగారి అబ్బాయి, అతను తోడల్లుడు కూడాను-

అక్కడ మీకు 'నవకవితా పితామహ' బిరుదునిచ్చి గౌరవించినట్లు T.Vలో-విని ఆనందించాను-

...... .ఇంక పాలకొల్లులో మనం కలుసుకున్న రెండు రోజుల్లోనూ నా అనుమానాలు తీరి నేను సాహిత్యం విషయంలో సక్రమంగానూ, నిజయితీగాను ఉంటున్నాననే ధైర్యం మళ్ళీ వచ్చింది- మీతో మాటలాడడంవల్ల-; I highly regard you as a poet and think that what Tilak could not do in his life time, you have done through your works-

అతిగా మాట్లాడడంగాని, మొగము ముందరి మాటలూ - పొగడ్తలూగాని నా స్వభావానికి విరుద్ధం. మీరు ఎంత నిర్భయంగా మీ అభిప్రాయాలు వ్యక్తం చేస్తారో అంత ధైర్యంగా నేనూ నా అభిప్రాయాలు వెలువరించడానికి కించిత్తు కూడా వెనకాడను-

As a poet, I rate you very highly and wonder why you were not awarded the 'Jnan pith' award so far. I hope you will be awarded that award very soon. You richly deserve it- It is my sincere opinion-

తిలక్ ఎన్నో ఆశలు కలిగించి అర్ధాయుష్షుతో కాలంచేశాడు. నాకు ఎన్నో విధాల (మీ కవిత చదివాక, చదువుతుంటేనూ) తిలక్ మళ్ళీ గుర్తుకు రావడమే కాదు- భావాభివ్యక్తిలో-చాలాచోట్ల-అతన్ని మించి పోయారనిపిస్తోంది-This is a rich tribute from me- నాకు మిమ్మల్ని పొగడవలసిన అగత్యం ఏముంది చెప్పండి? మీ కవిత నన్నెంత కదిపింది - చాలా చాలా గొప్ప కవిత మీది! నవ్యతకి నవ్యత - అభివ్యక్తిలో ఎవరూ సాధించని వినూత్నత -I dare to say that you are one of the best poets, our country has produced. ఇది నా అభిప్రాయం, మీరు నమ్మినా, నమ్మక పోయినా- అన్నట్టు- I am very sorry to know that you have lost some of your books - of which you are having only single copies-

మీ ఉత్తరం కోసం ఎదురు చూస్తూ-

– శ్రీపాద కృష్ణ మూర్తి

# శేషేంద్ర సప్తతి - నవకవితకు హారతి

—రాయసం వెంకట్రామయ్య

ప్రాక్పశ్చిమ సాహితీ దిగంతాలను కలిపిన కాలరేఖ, వాల్మీకి నుండి తన వరకూ వివిధ వసంతాల కోకిలపాటలను మోసే ఇంద్రధనువు, ఒక కవి రక్తబిందువులో ప్రపంచ కవితా వనజ్వాల విస్ఫోట, సృజనానంద దగ్ధ ఉన్మత్తవేణువులోంచి తనను తాను ముక్కలు చేసుకుని కాలశకలాలతో గీసిన రక్తరేఖ శేషేంద్రకు డెబ్భైవసంతాలు. స్వర్ణభారతంతో ఆయన సాహిత్యయాత్రకు కూడా సరిగ్గా ఏభై ఏళ్లు. ఆయన సాహిత్యం కాలాతీత వసంతం. వేళ్ళుకాళ్లై నడిచే చెట్టు మీద వాలిన అనంతం. ఆయన జీవితం శతాధిక వసంతాలు చూసే కవితావృక్షం కావాలని కాంక్షిస్తూ ఆంధ్రభూమి ఈ వారం సాహితి సంచికను ఆయనకు అంకింతం చేస్తోంది.

"ధరిత్రిని హలం దున్నితే
అప్పుడు అవుతుంది
అది ఒక దేశం;
ధరిత్రిని కలం దున్నితే
అపుడు అవుతుంది
అది ఒక ఇతిహాసం
హలమూ కలమూ దున్నని
ధరిత్రి
ధరిత్రికాదు వట్టి మట్టి."

తెలుగు సాహిత్యాకాశంలో గుంటూరు శేషేంద్ర శర్మ ప్రవేశం ఒక నవారుణోదయాన్ని ఆవిష్కరించింది. మహా కవిత్వం పరమ సత్యాన్ని చెప్తుంది. నిజాయితీగల కవి తను దర్శించిన సత్యాన్ని, తనకి అనుభూతమైన నిజాన్ని తన కవిత్వంలో ప్రతిఫలింప జేస్తాడు. శేషేంద్ర నిజాయితీ గల మహాకవి. 1947లో మొదలైన శేషేంద్ర సాహిత్య స్రోతస్విని స్వర్ణభారతిలోని తెలుగు నేలనే కాక విదేశాలలో కూడా బంగారు పంటలు పండించింది.

ప్రాచీన ఆలంకారిక శాస్త్ర సిద్ధాంతాలను, ఆధునిక, పాశ్చాత్య విమర్శా ధోరణులనూ, కావ్య శాస్త్ర సంప్రదాయాలనూ, మార్క్సిస్టు విమర్శ పంథాలను పరిశీలించి శేషేంద్ర రచించిన 'కవిసేన మేనిఫెస్టో' అన్న ఆధునిక కావ్య శాస్త్ర గ్రంథం

సాహిత్య విమర్శలో క్రొత్త త్రోవలు త్రొక్కింది. 1940 తర్వాత మొదలైన కవితా ధోరణుల ప్రభావం ఒక తరం కవులపై ప్రగాఢమైన ముద్ర వేసింది. ఆంధ్ర సాహిత్యం కురుసభలో పాంచాలి అయింది. అప్పుడు శేషేంద్ర తన కలం కుంచెని ఉదయించే సూర్యుని కిరణాలలో ముంచి, కవి సేనని సమాయత్తం చేసి కుహనా కవి మూకలపై ఉద్యమం నడిపారు. విప్లవ శంఖాన్ని పూరించాడాయన. శేషేంద్ర వాల్మీకి రామాయణంలోని సుందరాకాండకు తన 'షోడశి'లో తాంత్రిక భాష్యాన్ని రాశారు. భట్టహర్షుడి నైషధానికి మంత్ర, తంత్ర, యోగ, వేదాంతపరమైన వ్యాఖ్య ఆయన 'స్వర్ణహంస.' శేషేంద్ర వ్రాసిన 'నా దేశం నా ప్రజలు' అన్న మహేతిహాసం దేశ విదేశాల్లో కాంతి ప్రసారాలు చేసింది. నాగరికుడైన కవి హృదయ స్పందనే 'నా దేశం నా ప్రజలు'. అతడి మనస్సు నిస్సహాయతని చూసినా,, అన్యాయాన్ని అవలోకించినా ఉద్విగ్నమౌతుంది. అతడి కలం ఓ శతఘ్నిలా ఘోషిస్తుంది. పుంఖాను పుంఖాలుగా విప్లవ శక్తిని సంతరించుకొన్న ఉక్తులు ఉరుకుతూ వస్తాయి. పరితల్పి తట్టి లేపుతాయి. చేయూతనిచ్చి నడిపిస్తాయి. ఆయన కావ్యాలు 'మండే సూర్యుడు', 'గొరిల్లా' ఒక నూత్న కావ్యాభివ్యక్తిని తొలిసారిగా ఆవిష్కరించాయి. అదే నేటికీ వెలుగులు చిమ్ముతూ నిలిచివుంది. శేషేంద్ర వ్యక్తిత్వం ఆయన మాటల్లోనే చెప్పాలంటే-

ఓ యుగకర్త మరో యుగకర్తని గుర్తించగలడు, ఆశీర్వదించగలడు. శేషేంద్రని గూర్చి కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారన్న మాట అక్షర సత్యం-"... ఇట్టి కవి యొక్క రచన యందు కూర్పు యొక్క రమణీయత చూపించుట యనవసరము. అట్టి రమణీయత కితని గ్రంథము పండిన పంట చేను.. ఇట్టి రచన చేయగలవారీనాడు పట్టుమని పది మందియైనను లేరు. ఈయన చిరాయువై యొక మహా కావ్య నిర్మాతయగుగాక." శేషేంద్ర పద చిత్రాలకి పొంగిన శ్రీ శ్రీ అంటాడు.

"శేషేన్ శేషేన్
నీ పోయెమ్స్ చూసేన్
పసందు చేసేన్
....
నీది మంచి పద్యమా
లేక ఫ్రెంచి మద్యమా!"

శేషేంద్ర ప్రతిభా వైదుష్యాలు ఖండాంతరాలకు వ్యాపించాయి. 1970లో జర్మనీలో 'గోటెంజన్' నగరంలోని ఇండో లాజికల్ రిసెర్చి యూనివర్సిటీ పండిత

సదస్సులో 'కాళిదాసు మేఘదూతానికీ వాల్మీకి రామాయణానికీ వున్న సంబంధం' అన్న సిద్ధాంత వ్యాసాన్ని సమర్పించారు. ఉజ్జయినీ కాళిదాసు అకాడమీలో 'ఇద్దరు ఋషులు-ఒక కవి' అనే శీర్షికతో వాల్మీకి, వ్యాస, కాళిదాసుల కవిత్వానుబంధాలను విశదం చేస్తూ ఒక పరిశోధనా పత్రాన్ని 1986లో సమర్పించారు. తెలుగు కవిత్వానికి శేషేంద్ర సరిహద్దుల్ని చెరిపేశారు. ఆయన గ్రంథాలనేక భాషల్లోకి అనువదింపబడ్డాయి. హిందీ, ఉర్దూ, బెంగాలీ వంటి భారతీయ భాషల్లోకే కాకుండా గ్రీకు భాష లాంటి పాశ్చాత్య భాషల్లోకి కూడా అనువదింపబడ్డాయి. శేషేంద్ర వ్రాసిన 'నాదేశం నా ప్రజలు' అన్న ఆధునిక మహా భారతానికి గ్రీకు భాషానువాద పీఠికలో విశ్వ విఖ్యాత గ్రీకు మహాకవి నిఖిఫోరస్ వ్రత్తాకోస్ ఇలా అంటాడు.

"It was not only Tagore and Gandhi who crossed the frontiers of their Country and reached the wider world and achieved universality... Seshendra's epic poem "My Country-My People' is an evidence... Some important critics have compared thisepic poem with T.S.Eliot's "Wasteland" and "L'Acension' by St.John Perse. Personally I would compare the pain and anguish of the poet with t he one of Loutre-Mont (The founder of surrealism) in his lyric 'Mald-Aurore' The difference is that Seshenra's protest is not made in the void. He walks firmly on the soil. At times we observe in his poem a biblical and prophetic tone which attracts us."

ఇటీవల రచించిన ఒక వ్యాసంలో దేనా అనెగ్నాగోరస్ అనే గ్రీకు దౌత్యాధికారి, సాహితీవేత్త శేషేంద్రని మెక్సికో కవి ఆక్టేవియోపాజ్‌తో పోల్చింది. శేషేంద్ర దృష్టిలో 'ఒక అందమైన పోయెం అంటే/ దానికి ఒక గుండె వుండాలి/ అది కన్నీళ్లు కార్చాలి / క్రోధాగ్నులు పుక్కిలించాలి / పీడితుల పక్షం అవలంబించి / మనిషి రుణం తీర్చుకోవాలి / బ్రతకడానికి ఒక బురుజై మనిషి / విజయ జెండా అయి ఎగరాలి' –ఇది శేషేంద్ర మార్కు 'పోయెం'.

ఏ సన్నివేశాన్నైనా రమణీయమైన ఉపమానంతో మలచగల సుందరమైన కళని భావ చిత్రపరిధిలో తీర్చిదిద్దిన మహాకవి శేషేంద్ర. వసంతంలో విరబూచిన చెట్లపై పూల గుత్తుల్లా ఆయన కవితల్లో ప్రతీకలు వికసిస్తూ వుంటాయి. 'అలంకారాలను, భావ చిత్రాలను, ప్రతీకలను ప్రయోగించి నవ్య కవితాభివ్యక్తిని సాధించిన ఆధునిక కవుల్లో శేషేంద్రకు ఒక ప్రత్యేక స్థానం వుంది. భావాభివ్యక్తి హృదయంలో ముద్ర వేయడానికి తోడ్పడే వస్తు చిత్రణే ప్రతీక. శేషేంద్ర కవిత్వానికి ప్రతీక ప్రాణం. కవి

ఎత్తు, కవిత్వపు లోతు అతడెంచుకునే ప్రతీకలపై ఆధారపడి వుంటాయి.

"ఈ ఋతు దేవత అయిన కోకిల్ని
పల్లకీ ఎక్కించి
నా గుండెల రస్తాల్లో
మోస్తున్నారు."

ఇక్కడ వసంత ఋతు దేవత కోయిల ఒక ప్రతీక. శేషేంద్ర చెట్టుని హృదయమున్న మనిషికి ప్రతీకగా ప్రయోగిస్తాడు.

వాల్మీకి మహర్షి రామాయణంలో మనిషిని చెట్టుతో పోలుస్తాడు.

శ్లో: "అమీ లక్ష్మణ దృశ్యన్తే చూతాః కుసుమశాలినః
విభ్రామోత్సిక్త మనసః సాఙ్గరాగా నరా ఇవ" (కిష్కింధకాండ, ప్రథమసర్గ, 60)

శేషేంద్ర ఆధునిక మహాభారతంలో సూర్యపర్వంలో సూర్యుణ్ణి సృజనశక్తికి ప్రతీకగా ప్రయోగించాడు. లోకాలన్నీ ఆ దివ్యశక్తివల్లే సృజింపబడుతున్నాయి. అందుకనే "రాత్రి పాలలో ఎప్పటికైనా పడకపోదు / ఒక సూర్య బిందువు" అంటాడు.శేషేంద్ర శర్మలో లాలిత్యం, అలాగే శబ్దగతమైన కర్కశత్వం, ఏకకాలంలో ఒకే కవితలో కలగలసి, చిత్ర విచిత్రమైన బొమ్మలు గియ్యడానికి ప్రతీకల ద్వారా దోహదం చేస్తాయి.

"కవిత్వం ఎర్ర గుర్రంలా పరుగెత్తుకు వస్తోంది.
రక్తంలో మునిగిన బాణంలా వీరుడు విడిచిన ప్రాణంలా"

"శేషేంద్ర కవిత్వంలో వస్తువుల ఆత్మల్ని వెతికి పట్టుకొని ఆవిష్కరించే దార్శనిక తత్వం మనకు గోచరిస్తుంది. ఉపనిషత్సారాన్ని పికాసో రంగుల మిళన నైపుణ్యంతోనూ, ఐన్‌స్టీన్ సాపేక్ష సిద్ధాంతంతోనూ, మార్క్స్ ఎంగెల్సుల చారిత్రక భౌతికవాదంతోనూ, కాలజ్ఞానంతోనూ సంధత్తం చేసి ఒక ఆధునిక కవితా విరాణ్మూర్తిని మనకి సాక్షాత్కరింప చేసాడు. అతని రసవాదంలో కవితా సామగ్రి స్వర్ణకాంతు లీనుతుంది" అంటారు డా. కలువగుంట రామమూర్తి.

శేషేంద్ర శర్మకి సాహిత్య యుగకర్త లక్షణాలన్నీ లక్షణంగా వున్నాయనేది నిర్వివాదాంశం. కవిత్వమొక సిద్ధాంతపరమైన ప్రచార సాధనమే అనుకునే దుస్థితి వచ్చి, విప్లవమార్గ ప్రవర్తకుల నియంతృత్వానికి కవికులం దాసోహమైనపుడు శేషేంద్ర తన పాంచజన్యాన్ని పూరించాడు. విప్లవ కంఠాన్ని సవరించాడు. కవిసేనను సమీకరించాడు. వైజ్ఞానిక నాయకత్వం వహించి ఉద్యమం నడిపించాడాయన.

సాహిత్య రంగంలో సాహిత్య స్పృహ ఉన్న వాళ్ళకే సామాజిక స్పృహను గురించి కేకలు వేసే హక్కు వుంటుంది అంటాడు. 'Perfected Sensibility' అంటే కవి బాధపడడం, ఆ తర్వాత ఆ బాధపడడాన్ని జీవితంలో బుద్ధిపూర్వకంగా ఆహ్వానించడం, బాధని ఒక కళగా అభ్యసించడం. ఈ బృహత్ చైతన్యావిర్భావంలో సామాజిక చైతన్యమూ, రాజకీయ చైతన్యమూ అల్పాంశాలు. ఇవన్నీ బృహత్ చైతన్య వైరాట్యంలో అంశాలుగా వున్నాయి. ఈ ప్రక్రియకు అనుభూతి కళ అని పేరుపెట్టవచ్చు. ఈ అనుభూతి కళాభ్యాసంలో నుంచి పుట్టేదే కవిత్వం, అదే సాహిత్య చైతన్యం, అదే 'Perfected Sensibility'.

అదేమి దుర్భాగ్యమోగాని తెలుగు మహాకవికి, దార్శనికుడికి ఆంధ్ర దేశంలో గుర్తింపు త్వరగా రాలేదు. ముందుగా రాష్ట్రీయ హిందీ అకాడమీ వారు కలకత్తాలో 1993లో పురస్కారంతో గౌరవించారు. 1994లో భారతదేశీయాంగ శాఖలో అంతర్భాగమైన 'రాజభాషా సమ్మేళనం' (Official Languages Commission) వారు 'ఏకతా పురస్కార్'తో పాటు 'రాష్ట్రేందు' అనే బిరుదు ప్రదానం చేసారు. అదే సంవత్సరం తెలుగు విశ్వవిద్యాలయం ఆయనకి 'డాక్టరేట్' ఇచ్చి తన్నుతాను గౌరవించుకుంది. అప్పుడే కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు ఆయన రాసిన 'కాలరేఖ' కి లభించింది. శేషేంద్ర రచ్చగెల్చి ఇంట గెల్చారు.

*(ఆంధ్రభూమి దినపత్రిక, 20-10-1997 సోమవారం, సాహితి)*

"ఈ ఏడాది సాహిత్య అకాడమీ అవార్డు ప్రముఖ కవి శ్రీ శేషేంద్ర శర్మకు రావటం సముచితంగా ఉన్నది.

"నాదేశం నా ప్రజలు" , "మండే సూర్యుడు", "శేషజ్యోత్స్న" లాంటి కావ్యాలతో "ఆధునిక మహాభారతము" వెలయించిన శేషేంద్ర యీ శతాబ్ది తెలుగు కవులలో ప్రముఖంగా పరిగణింపదగిన ప్రతిభావంతులు. ఈయన ప్రభావం దరిదాపు అన్ని ప్రాంతాల కవులపైనా ఉన్నది."

ప్రఖ్యాత విమర్శకుడు, సమీక్షకుడు
**శ్రీ కె. రామమోహన రాయ్**
(ఆంధ్రజ్యోతి, డైలీ, 26.12.94 )

# ఒక సమాంతర స్వాప్నికుడు

- అఫ్సర్

1970 తర్వాత విప్లవభావజాలం తెలుగు సాహిత్యంలో ఒక ప్రధాన ప్రవంతిగా మారింది. కవిత్వం స్వభావం వున్నట్టుండి మారిపోయింది. అది పాటల్లోకి ఇంకిపోయే ప్రయత్నం చేస్తోంది. మధ్యతరగతిలోంచి అట్టడుగువర్గంలోకి 'డీక్లాసిఫై' (చూడుడు-చలసాని ప్రసాదరావు 'ఇలా మిగిలేం') అవ్వడానికి సాహిత్యలోకం సన్నద్ధమవుతున్న దశ. కథలు మాండలికంలోకీ, వచన కవిత్వం జానపదబాణీల్లోకీ వలసపోతున్నాయి. ఈ క్రమంలోనే ఇంకోవైపు వచన కవిత్వంలో ముక్కుసూటిగా వేలెత్తి చూపుతున్నంత స్పష్టంగా వ్యక్తీకరణ మారుతోంది. ఈ వ్యక్తీకరణ ఎంత దూరం వెళ్లిందంటే-ఒక దశలో ఎంత మొరటుగా మాట్లాడితే అంత విప్లవకవిత్వం అనే స్థాయి ఏర్పడింది. కచ్చితంగా ఈ మలుపులో నిలబడి వచన కవిత్వం డైరెక్షన్ మార్చినవాడు శేషేంద్ర.

* * *

మొదటి గేయం 'విశాలాంధ్ర'లో అచ్చయినప్పటి నుంచీ ఇటీవలి కవితల వరకూ శేషేంద్ర డైరెక్షన్ వొక్కటే. కవిత్వంలో ఆయన స్వరతీవ్రత తగ్గలేదు. విమర్శలో ఆయన పదునూ తగ్గలేదు. వస్తువు పరంగా ఏకోన్ముఖంగా సాగిన శేషేంద్ర కవిత్వంలో రూపం మాత్రం భిన్నత్వాన్ని సంతరించుకుంది. తనకు వివిధ భాషాసాహిత్య సంస్కృతులతో వున్న గాఢమైన అనుబంధం వల్ల శేషేంద్ర కవితకు వొక వినూత్న సౌదర్యం అబ్బింది. 'నీది మంచి పద్యమా లేక ఫ్రెంచి మద్యమా' అని శ్రీ శ్రీ ఇచ్చిన కితాబు శేషేన్ పోయెమ్‌కి వర్తించేదే. ఎందుకంటే తన మీద బాద్‌లేర్, మల్లార్మేలాంటి కవుల ప్రభావం వుండడం శేషేంద్రకూ ఇష్టమే. కవిత్వతత్వంలో శేషేంద్ర అభిరుచికీ, ఆ కవుల సంస్కారానికీ సాన్నిహిత్యం వుంది. అలాగే, అభ్యుదయభావనకి కవిత్వకాల్పనికతని అద్దిన ఫైజ్‌లాంటి కవులు శేషేంద్రకి వ్యక్తిగతంగా కూడా సన్నిహితులు. ఇక జీవన సౌందర్యాన్ని గొప్పగా ప్రేమించిన గ్రీకు, జర్మనీ సాహిత్యవేత్తలతోనూ, చిత్రకారులతోనూ శేషేంద్రకి ఎల్లలు అడ్డురాని అనుబంధం వుంది. తెలుగులో విప్లవ కవిత్వానికి సమాంతరంగా వొక కవిసేనని తరలించిన యోధుడు శేషేంద్ర. కవిత్వరచనకీ, కవిత్వ పఠనానికీ తనదైన ఒరవడిని ఏర్పర్చుకుని సమకాలీన కవుల కాల్పనిక లోకాన్ని మార్చినవాడు శేషేంద్ర.

"75 తర్వాత శేషేంద్ర కవిత్వాన్ని చదవనివాడు ఇంకా మిగిలివున్నాడంటే వాడు

సగం కవిత్వచరిత్రని మిస్సయినట్టే" అనేవాడు యన్నంరెడ్డి వెంకటరెడ్డి. ఆ రోజుల్లో యువకులకు శేషేంద్ర కవిత్వం వొక కొలమానం. శ్రీ శ్రీ లా రాయనేకూడదని భీష్మించుకుని కూర్చున్న కలాలలను తన అద్భుతమైన ప్రతీకాత్మక సౌందర్యంతో ఆకట్టుకున్నాడు శేషేంద్ర. కవిత్వంలో కవిత్వం వుండకపోవడం శేషేంద్ర ఆ రోజుల్లో మౌలికంగా విభేదించిన లక్షణం. కమ్యూనిజం తనలో నిరంతరం మోగే ఏక్తారా అన్న నిబద్ధతని సడలించుకోకుండానే కవిత్వసౌందర్యం విషయంలో వొక్క అక్షరం కూడా రాజీపడనివాడు శేషేంద్ర.. అందుకే శేషేంద్ర సమకాలీన సంస్థాగత రాజకీయ వ్యవహారాల అక్రమ జోక్యాలను పదే పదే ఖండిస్తూ వచ్చాడు. కవిత్వం మీద అకవిత్వం పెత్తనం చెలాయించడాన్ని ఏనాడూ సంహించలేదు. అట్లాగని రాజకీయ చైతన్యాన్ని ఈసడించుకున్న శుద్ధకళావాది కాదు శేషేంద్ర. ఒక దేశం జెండాకి ఎంత పొగరుండాలో అక్షరాల్లో ప్రదర్శించినవాడే. చైతన్యరహితమైన జడపదార్థంలాంటి కవిత్వాన్ని దరిచేరనివ్వలేదు.

శేషేంద్ర కవిత్వ నిర్మాణం అసాధారణం. కాబట్టే అది యువతరాన్ని ఇట్టే ఆకర్షించింది. అప్పటికి బాగా ప్రాచుర్యంలో వున్న కవిత్వశైలికి పూర్తిగా భిన్నమైన సంవిధానాన్ని ఆయన స్వీకరించాడు. కవిత్వాన్ని నినాదంగాగాక కవిత్వంగానే చెప్పాలన్న ధోరణికి ఆయన నాంది పలికాడు. ముఖ్యంగా ముక్కు సూటిగా వుండే కవిత్వంలో కూడా సౌందర్యజ్వాల నిక్షిప్తమై వుండాలన్నది ఆయన వాదం. ఆయన రాసిన ప్రతి పంక్తీ ఆ వాదాన్ని అనుసరించిందే. ఆయనే కాదు, ఆయన్ని అనుసరించిన కవులు కూడా ఆ ధోరణిని తుచ తప్పక పాటించారు. శేషేంద్ర వొక బలమైన ప్రభావంగా మిగలడానికీ, ఇప్పటికీ ఈ తరంలో కూడా శేషేంద్ర శైలి సజీవంగా నిలిచివుండడానికీ ఇదే ప్రధాన కారణం.

అచ్చమైన కవిత్వం వున్న చోట వివాదాలూ వుంటాయి. తెలుగు సాహిత్యంలో శేషేంద్ర నిరంతర వివాదాస్పదుడు. ఇది ఆయనలో జ్వలిస్తున్న చైతన్యానికి సంకేతం. తన అభిప్రాయాలను ఎవరి సంతోషం కోసమో, సంతృప్తి కోసమో అణచివేయడం ఆయన తత్వం కాదు. ఆయన ఇంటర్వ్యూల్లోనూ, ఇతర విమర్శ వ్యాసాల్లోనూ నిర్మొహమాటంగా వ్యవహరించడమే ఆయనకు తెలుసు. ముఖ్యంగా శ్రీ శ్రీ గురించీ, విప్లవకవిత్వాన్ని గురించీ శేషేంద్రకు అతిస్పష్టమైన అభిప్రాయాలున్నాయి. వాటితో మనం ఏకీభవిస్తామా, లేదా అన్నది అప్రస్తుతం. ఆ అభిప్రాయాలు శేషేంద్ర దృక్పథ తీవ్రతకి గుర్తులుగా నిలుస్తాయి. తెలుగులో కవిత్వమూ, వచనమూ సమప్రజ్ఞతో

నిర్వహించిన రచయితలు చాలా తక్కువ. కవులు స్పష్టమైన వచనం రాయలేరనీ, విమర్శకులు అచ్చమైన కవిత్వాన్ని గుర్తుపట్టలేరనీ అపప్రథ వుంది. ఒక విశ్వనాధనీ, ఒక శ్రీ శ్రీ నీ, ఒక ఆరుద్రనీ, ఒక శేషేంద్రనీ.... వాళ్ల వాళ్ల సాహిత్య యాత్రనీ గమనిస్తున్నవాళ్లకి ఇది నిజం కాదనే అనిపిస్తుంది. శేషేంద్ర తెలుగు కవిత్వాన్ని గురించే కాక తనకు గాఢమైన అనుబంధం వున్న ఇతర భాషాసాహిత్యాలనుగురించి రాసిన విమర్శ, పరామర్శ వ్యాసాల్లో ఆయన తాత్విక సారాంశం అర్థమవుతుంది.

నిజమైన కవి కలకీ, వాస్తవికతీ మధ్య సరిహద్దు రేఖలో కనిపిస్తాడు. నేటికీ రేపటికీ మధ్య మెరిసిన సాంధ్యరాగంలో పలకరిస్తాడు. శేషేంద్ర చిరునామా కూడా అదే!

*(ఆంధ్ర భూమి, దినపత్రిక, 20-10-1997 సోమవారం, సాహితి, 'అక్షరాలా')*

Hearty Congratulations on your richly deserving Sahitya Academy Award this year.

I was going through the pages of your book "Kaala Rekha" recently, and was enlightened very much by your findings and theses like statements.

I entirely agree with you, that at a particular period in pre-history, Vedic Gods like Indra and others were reduced to the position of Dikpalakas, Raising, Prajapati, Vishnu and Rudra; your theses about 'yaa srishti srashtu raadya'; the independent status of ancient Indian theatre, from the influence of Greek theatre, your revelations about Valmiki, Vyasa and Kalidasa, your study and comparisons of 'Arunam' Aditya Hridayam and Mayura's Surya Sataskam - Comparisons of Kalidasa and Bhartrumentha's verses, metres, and styles, Oh - every bit of the book is so great.

Kala Prapoorna
**Dr. B. RajaniKanta Rao.**

# విశేషించిన శేషేంద్రుడు

-పేరాల భరతశర్మ

శేషేంద్రుడు భూమిని మోస్తున్నాడన్నది పురాణం. "శేషేంద్రుడు" విశ్వ మానవ కథ వ్రాస్తున్నాడన్నది "ఆధునిక మహాభారతం". శేషేన్ మాటల్లో-

"నదులు కవులు భూగోళపు రక్తనాళాలు
నదులు ప్రవహిస్తున్నాయి కవితల్లా
పక్షుల కోసం పశువుల కోసం
మనుష్యుల కోసం
నదులు కంటున్న కలలు పొలాల్లో
ఫలిస్తాయి
కవులు కంటున్న కలలు మనుష్యుల్లో
ఫలిస్తాయి"

మట్టిని పండించే నదులూ, మనుషులను పండించే కవులే అనాదిగా ప్రపంచంలో ప్రవహిస్తున్న సాంస్కృతిక జీవన స్రవంతులు. వాల్మీకి రామాయణాన్నీ, ఋషుల ఉపనిషత్తులనీ, వ్యాస మహాభారతాన్నీ, ఆసియా ఐరోపా కవుల మేధావుల గ్రంథాలను అవగాహన చేసుకున్న శేషేంద్రుడు తన కాలానికి ఒక ప్రతీకగా నిలిచిపోయే రవీంద్రుడు.

"సముద్ర ఇవ గాంభీర్యే, ధైర్యేణ హిమవానివ"గా దేశమే తానుగా మూర్తీభవించిన వాడే కాలంతో కలసి ప్రవహిస్తూ దేశంలో మానవ ధర్మానికి ప్రతీకగా నిలిచిపోయేవాడు. కిరాతుకుడైన వాల్మీకి కిరాతుణ్ణి శపించే ఋషి కాదగిన సంస్కారంతో కవియైనాడు. దేవుడూ దానవుడుకాదు, మానవుడికి కావలసినవాడు మానవుడే అని నిరూపించాడు. "రక్షితా జీవలోకస్య స్వజనస్యచ రక్షితా"- దేవుడికైనా మానవ భాషనే నేర్పాడు. పక్షికైనా పశువుకైనా ప్రాణమే భాష అని నిరూపించాడు. మావుడైన తన రాముడి కథ కొండలు నిలిచి ఉన్నంత కాలం, నదులు భూతంలో ప్రవహిస్తున్నంత కాలం నడుస్తూ వుంటుందన్నాడు వాల్మీకి. వాల్మీకం నుండి వెలువడ్డ కవితను తనలో చుట్టలుగా చుట్టుకొన్నాడు శేషేంద్రుడు. కనుకనే ఈ శతాబ్ది నాలుగో పాదంలో నిలదొక్కుకొని వచ్చే శతాబ్ది మొదటి పాదంలోకి సాగిపోయే మానవుడిలో ఈ దేశం ఎలా లీనం కావాలో దర్శించగలిగాడు తనలో తాను అంతర్ముఖుడై.

"ఆకాశాన్ని ముడిచివేసి దిగంత రేఖ
నాలోకి దిగింది నిలువుగా
నాలో అరణ్యాలు నదులు
పర్వతాలు గ్రామాలు పట్టణాలు
ఋజురేఖలై వక్రరేఖలై వర్తులాలై
పరుగిడుతున్నాయి స్పందించే ఒక బిందువు వైపు"

ఈ శతాబ్ది కవిత్వానికి ఒక క్రొత్త భాషను కూర్చి దేశాన్నే కథా వస్తువుగా మలచిన వినూత్న కావ్యశిల్పి శేషేంద్ర. తెలుగు తెలుగుకే పరిమితం కాకుండా ఎల్లలు దాటిన వెలుగుగా చేసిన "భాషాపరశేషభోగి". నన్నయ్య నుండి శ్రీ శ్రీకి - శ్రీ శ్రీ నుండి శేషేంద్రకి ప్రవహించిన తెలుగులో తీయని భారతీయం నుండి ఇండోయురోపియన్ ఒయ్యారాలు తొణికిసలాడడం కనిపిస్తాయి.

(వార్త, దినపత్రిక, 20-10-1997)

శేషేంద్రులకు-

నమస్కారం. అకాడమీ పురస్కారం వార్త విన్నాం. పురస్కారాల దశను దాటిన తరవాతయినా ఇది రావటం మా అందరికీ సంతోషం కలిగించింది. వార్తను బట్టి మీ సాహిత్య విమర్శను పురస్కరించినట్టుంది. మీరెంత గొప్ప కవిత్వం రాశారో అంతకన్నా గొప్ప విమర్శ రాశారు. ఈ వాక్యాన్ని తిరగేసి చెప్పినా ఏమంత అర్థ భేదం రాదు. పండిత కవులూ, కవిపండితులూ తరిగి పోతున్న తరంలో మీరే చివరి వెలుగుగా సంతృప్తి పడాలేమో!

సమకాలపు రాజకీయ వాతావరణంలో మీ సాహిత్య సంకాశం అంత వెలుగులు చిమ్మకపోవచ్చు గాని కాలాన్ని చీల్చుకుని మీ సాహిత్యం కలకాలం తెలుగు వారిని అలరిస్తుందనీ, ఉత్తేజ పరుస్తుందనీ, వివేకవంతుల్ని చేసి విజ్ఞానాన్ని ప్రసాదిస్తుందనీ నా నమ్మకం.

ప్రొఫెసర్ చేకూరి రామారావు
ఉస్మానియా యూనివర్సిటీ, హైదరాబాద్
16.12.94

# ఒక మండే సూర్యుడు శేషేంద్ర

**- వడలి మందేశ్వరరావు**

ఈ దేశానికి స్వాతంత్ర్యం వచ్చి ఏభయి ఏళ్ళయిందని మనం స్వర్ణోత్సవం జరుపుకుంటున్నాము. చిత్రంగా శేషేంద్ర కవిగా అవతరించి కూడా ఏభయి ఏళ్లయింది. దేశానికి స్వాతంత్ర్యం రావడంతో మనకు రాజకీయ స్వాతంత్ర్యం లభించింది కాని, సాంస్కృతికంగా, వైజ్ఞానికంగా, నైతికంగా మనం ఇంకా శృంఖలాబద్ధులమే. శేషేంద్ర వచ్చి ఈ శృంఖలాలను పగలగొట్ట పూనుకున్నాడు. రాజకీయవేత్త అయినా, సామాజిక సంస్కర్త అయినా శాస్త్రవేత్త అయినా, వారి వారి క్షేత్రాలలో నాయకులు... మరి కవి సమస్త వైజ్ఞానిక ప్రపంచానికే నాయకుడు, బాధ్యుడు అంటాడు శేషేంద్ర. అతని నాయకత్వమే ఏ దేశాన్నైనా, ఏకాలంలోనైనా, రక్షిస్తుంది. దానికి శేషేంద్ర సిద్ధంగానే ఉన్నాడు. "మీరు నన్ను పిలిచారు! కానీ పిలవక పోయినా మిమ్మల్ని వెతుక్కుంటూ నేనే వచ్చేవాణ్ణి!'' అంటాడీయన.

1927 అక్టోబరు 20 న జన్మించిన శేషేంద్రకు ఇరవై యేండ్లు వచ్చేసరికి దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. అప్పటికే ఆయన నేతి కృష్ణశాస్త్రి గారి అంతేవాసిత్వంలో సంస్కృతాన్ని, జి. పద్మనాభయ్యగారి దగ్గర సామ్యవాద సిద్ధాంతాలను అధ్యయనం చేశారు. అంతేకాక, తర్కశాస్త్రాన్నీ ఉపనిషత్తులనూ చదివారు; మద్రాసు 'లా' కాలేజీలో 'లా' నూ చదివారు. ఆయన విద్య ఇలా ఒక వంక భారతీయ సంప్రదాయాన్ని అనుసరించీ, మరొక వంక ఆధునిక విజ్ఞానాన్ని ఆశ్రయించీ ఉంది. అందువల్లనే ఆయన కవిత్వ ప్రస్థానం సంప్రదాయం నుండి విప్లవ పంథాలోకీ, జాతీయత నుంచి అంతర్జాతీయతలోకీ సాగిపోయింది.

నింగికెగిరే ముందు నేలమీద నిలబడ నేర్వాలి. అందుకే ఆయన పాండిత్యానికి నికషగా ఉండేరెండు విమర్శగ్రంథాలను వ్రాశారు శేషేంద్ర. 'షోడశి', రామాయణంలోని సుందరకాండను తత్త్వశాస్త్ర, శ్రీవిద్యాపరంగా వ్యాఖ్యానింప పూనుకున్న గ్రంథం. హర్షుని నైషధ చరిత్రకు తాంత్రిక ప్రాతిపదికగా వ్యాఖ్యానించిన గ్రంథం 'స్వర్ణహంస' ఈ రెండూ సంప్రదాయ పండితునిగా శేషేంద్ర కొక స్థానాన్ని కల్గించాయి.

శేషేంద్రకు వాల్మీకి అంటే ప్రాణం అయినా, సంస్కృత కవులను అభిమానించినా, అట్టి సానుభూతి పూర్వాంధ్రకవుల పట్ల లేదు. ఆయనకు కవిగా వీరందరితోనూ పెద్ద పేచీ ఉంది. వారందరి వల్ల తెలుగు కవిత్వం సంస్కృతానికిఓడకు కట్టిన ఓడలా

ఉంటుందనీ, అనువాద, అనుకరణ గొంతులేకాని, సొంత గొంతు వినబడ లేదనీ ఆయన అభియోగం. మరి శివకవుల మాటేమిటి? అంటే వారిని ఈయన పట్టించుకో లేదు.

క్రితం శతాబ్దం వరకూ ఇలా శృంఖలా బద్ధమైన తెలుగు కవిత ఈ శతాబ్దంలోనే భావకవులతో సొంత గొంతు విప్పింది. వీరి వస్తువు పాతది కాదు, రచన వెనుకటి వారి అనుకరణ కాదు. స్వీయ ఘోషను కవిత్వంలోకి ప్రవేశ పెట్టారు. పాశ్చాత్య ప్రభావం వల్ల పుట్టితే నేమి గాక, తెలుగులో కొత్త సొగసులు కనిపించాయి. కాని ఇక్కడా కొంత కాలానికి ఒక స్తబ్ధత, ఒక బాధ్యతారాహిత్యం కనిపించింది. దాని నుండి కవిని మేల్కొల్పవలసిన అవసరం ఏర్పడింది.

ఈ అవసరాన్ని అభ్యుదయ రచయిత గుర్తించాడు. రచన కొక సామాజిక నేపథ్యం ఉండాలన్నాడు. ఈ కొత్త బాధ్యతను స్వీకరించడానికి వానికి కాస్త తోడ్పాటు అవసరమైంది. అది ఎవరి దగ్గర నుంచి వస్తుంది? చాలా తీక్ష్ణమైన రాజకీయ శక్తుల నుంచే వచ్చింది. దానిని అభ్యుదయకవి మనఃస్ఫూర్తిగా ఆహ్వానించాడు. ఆహ్వానించడమే కాదు, దానికి వశుడై పోయాడు. దీనికి శేషేంద్ర బద్ధ శత్రువు.

అసలు శేషేంద్ర కూడా ప్రారంభంలో సంప్రదాయమార్గాన్నే అనుసరించాడు. ఆయన పద్యనిర్మాణం గరుకుగా ఉంటుంది. పద్యంలోని ఆయన వ్యంగ్యం, అపహాస్యం తీవ్రంగా ఉంటాయి. 'ఋతుఘోష' ఆయన దృక్పథంలోని మార్పును సూచిస్తుంది. వెనుకటి రోజుల్లో కవులు చేసిన ఋతువర్ణనలన్నీ జీవిత మంతా వడ్డించిన విస్తరిలా ఉన్న భోగుల దృష్టి నుంచి వ్రాయబడ్డాయి. అందులోని ప్రకృతి సౌందర్యం అంతా డబ్బున్న వానికై నిర్దేశింప బడినవే. ప్రకృతి తన ధర్మాన్ని తాను నిర్వహిస్తున్నా, మానవ నిర్మాణమైన సమాజంలోని హెచ్చులొచ్చుల వల్ల, ప్రపంచ అస్తిత్వానికి అవసరమైన ఎండా, వానా, చలీ కొందరికి శాపంగా పరిణమిస్తాయి. శేషేంద్ర 'ఋతుఘోష' లో ఈ దురంతాన్ని, అన్యాయాన్ని, హైలైట్ చేశాడు.

కాని తృప్తి లేదు. కవిత్వం ఛందోబద్ధం కాకపోతే వచ్చిన నష్టమేమిటి? ఛందస్సు నుండి స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకున్నాడు శేషేంద్ర. స్వచ్ఛందంగా ఉండే కవితను వ్రాయ పూనుకున్నాడు. పంక్తులను హ్రస్వీకరిస్తూ, దీర్ఘీకరిస్తూ, అంత్యప్రాసలతో పద్యభ్రాంతిని కల్గించే రచనను కాకుండా, శుద్ధమైన 'వచన కవిత'ను వ్రాయ పూనుకున్నాడు. సిసలైన వచనంలో కూడా అక్కడక్కడ కవిత్వపు తళుకు ఉన్నా, అది తైలధారలా సాగిపోతుంది, ఆలోచనను ప్రేరేపిస్తుంది, ఒక ప్రతిపాదనను సమర్థిస్తుంది,

విస్తరిస్తుంది, సిద్ధాంతాన్ని స్థాపిస్తుంది. మరి శేషేంద్ర 'వచన కవిత'లోని వచన మలాంటిది కాదే! అందులో బింబాలుంటాయి, ప్రతీక లుంటాయి, మొత్తమంతా ధ్వన్యాత్మకంగా వచనం కంటె భిన్నంగా ఉంటుంది. అది కవిత్వమయింది.

అభ్యుదయ రచయితలలోనూ, తర్వాత వచ్చిన విప్లవ రచయితలతోనూ శేషేంద్రకు వచ్చిన తగాదా అంతా ఇక్కడే. మార్క్సిస్టు దృక్పథం నేటి ప్రపంచ పురోగతికీ, కార్మిక కర్షక జనోద్ధరణకూ, పీడితుల తాడితుల బాధల ఉపశమనానికీ అవసరమే అంటాడు శేషేంద్ర. స్వీకరించిన వస్తువును అదే దృష్టి నుంచి విశ్లేషించి, వివేచించి చూస్తాడు. అలాగే కావ్యంలో ప్రదర్శిస్తాడు. ఇతర తెలుగు మార్క్సిస్టు రయితలూ అదే పని చేస్తున్నా మనుకొంటారు. కాని అది కవితాత్మకంగా లేకపోతే, అది శుద్ధ ఎండుగడ్డి వచనం అవుతుందంటాడు శేషేంద్ర. ఆయన 'కవిసేన మేనిఫెస్టో' అంతా ఈ మౌలిక అంశాన్ని విస్మరించే వాళ్ళకు ఘాటయిన హెచ్చరిక. కవిసేన మేనిఫెస్టోను ఆధునిక సాహిత్య శాస్త్ర మన్నాడు. ఇందులో అత్యాధునిక మార్క్సిస్టు విమర్శ భారతీయా లంకారికుల సిద్ధాంతాలతో ఎలా సంవదిస్తున్నదో వివరించడం కొందరిని ఆశ్చర్యపరచింది; కొందరికి క్రోధకారణమైంది.శేషేంద్ర మరికొంత ఉదారంగా నీవు వ్రాసేది ఏదీ అనికాదు, అది ఎలా వ్రాస్తున్నావన్నది కూడా ముఖ్యమే అంటాడు. దానిలో కవిత్వం ఉంటే దానిని 'కవిత'గా అంగీకరించమంటాడు. "రోమాంటిక్ పోయిట్రీ అంటే ఎందుకు పారిపోతావు? ప్రేమ అంటే నీ కంత ఎలర్జీ ఎందుకు?" అని నిలదీసి అడుగుతాడు.

శేషేంద్ర అత్యాధునిక కవిత్వానికి మీదు కట్టుకొని కూర్చున్నా సంప్రదాయం పేరు చెపితే పారిపోడు. మళ్లీ రామాయణ మేమిటి? మళ్లీ భారత మేమిటి? అంటే, "అవును నేను భారతాన్నే వ్రాస్తాను భాయీ!" అంటాడు. అయితే ఇది వెనుకటి భారతం కాదూ, అవునూ - కూడాను. ఇది 'ఆధునిక మహాభారతం'! అందులో ఒక పెద్ద యుద్ధం జరిగింది, భూమికోసం! ఇందులోనూ వర్తమాన కాలంలో ఒక పెద్ద యుద్ధం జరుగుతోంది, భూమికోసమే! అయితే ఆ కొట్లాట రాజుల మధ్య, ఇక్కడ యుద్ధానికి దిగిన వాళ్లు తిండికోసం మొగం వాచినవాళ్లు! జలగల్లా, కొండ చిలువల్లా, ప్రజలను పీల్చి, పిప్పి చేసే వారి మీద వీళ్ళు యుద్ధాన్ని ప్రకటిస్తున్నారు. "అసలు నీ మోహం మీద నవ్వు ఎలా వస్తోంది? ఇంత దుర్భర దారిద్ర్యం నీ చుట్టూ ఉంటే?" అని అడుగుతున్నాడు. మానవునిలో ఒక అద్భుత క్రియాశక్తి ఉంది. దానిని "గొర్రిల్లా" అంటాడు శేషేంద్ర. "ఆధునిక రాక్షస కపాలాలు ధరించుకొని, ... అసంఖ్యాక

భయంకర మారణాయుధాలు అలంకరించుకొని,... నానా అధర్మ జాతుల ధైర్యాస్త్రమయ ఘోర కారణమైన గ్రీష్మాతపజ్వాలా మాలికలాంటి నాలిక, నీ ముఖ మండల నిర్గతమై వ్రేలాడుతూండగా, నీ దివ్య మంగళమూర్తి సాక్షాత్కారం ప్రసాదించు పితామహా!" అంటున్నాడు. ఇదీ శేషేంద్ర ప్రబోధం, అదీ ఈ ఆధునిక మహాభారత ప్రయోజనం. ఈ భారతంలోనూ పర్వాలున్నాయి, సర్గలున్నాయి, పర్వాంత గద్యలున్నాయి, కావ్యాంత మందు ఫలశ్రుతీ చెప్పబడింది.

'నాదేశం - నా ప్రజలు' అన్న ఈ ఇతిహాసానికి గ్రీక్ భాషానువాద పీఠికలో నిఖిఫొరస్ వృత్తాకోన్ "At times we observe in his poem a biblical and prophetic tone which attracts us" అంటాడు, ఆయన కావ్యాలు హిందీ, ఉర్దూ, బెంగాలీ ఇత్యాది భారతీయ భాషల్లోకి అనువదింపబడ్డాయి. కవిగా ఆయన భారత దేశ భూగోళ అవధుల్ని దాటాడు. ఆయనకెన్నో పురస్కారాలు వచ్చాయి. ఆయన్ను 'యుగకవి' అనీ, 'రాష్ట్రేందు' అనీ సత్కరించారు. ఈ మండే సూర్యుడు ఇంకా డబ్బై ఏండ్ల యువకుడే. ఆయన ముందు ఎంతో బాధ్యత ఉంది. విశ్రమించ వీలు లేదు, విక్రమింప వలసింది ఎంతో ఉంది. విక్రమిస్తాడని ఆశిద్దాం -

## స్వర్ణ హంస

శ్రీ వావిలాల వేంకటేశ్వరశాస్త్రి

శ్రీమద్భ్యో భవద్భ్యః దత్వాశీంషి రచయామి కించిత్ పత్రం గైర్వాణ్యాం వాణ్యాం రచితం భవత్ ప్రేషితం పత్ర మద్రాక్షం. అమందానంద మవాపంచ అసాధారణయా భవదీయ మేధా సంపత్యా మోముహ్యామానో Zహం క్షిప్రమేవ భవద్దర్శనా కాంక్షీ భవామి -

త్రిపుర సుందరీ దమయంతీతి భవద్భిః రచితో వ్యాసః అద్యత్వే ఆంధ్ర ప్రభాయాం ప్రకటీకృతః మయా దృష్టః అతీవ సంతుష్ట స్థానమితికి ముచ్యతే;

గత రవివాసరె ప్రచురితో వ్యాసః అతీవ హృదయంగయో భూత్. పండితలోక స్సర్వోపి సంతుష్యతీతి మన్యే. భగవాన్ సర్వదా తవఏతాదృశీం మేధా సంపదం దద్యాదితి భగవంతం నౌమి.

# 'కవిత ఆయన అప్సర'

## -ఇందిరాదేవి ధన్‌రాజ్‌గిర్

సుప్రసిద్ధ ఇండో–ఆంగ్ల సందర కవితామూర్తి శ్రీమతి ఇందిరాదేవి ధన్రాజ్‌గిర్. ఆమె హైదరాబాద్‌కు చెందిన రాజా ధన్రాజ్ బహద్దూర్ పెద్ద కుమార్తె; ప్రముఖ కవి, రచయిత, విమర్శకుడు - గుంటూరు శేషేంద్ర శర్మ సతీమణి. శేషేంద్ర శర్మ 1997 అక్టోబరులో 20 వ తేదీన సప్తతిలో ప్రవేశిస్తున్న సందర్భంగా శ్రీమతి ఇందిరాదేవి ధన్‌రాజ్‌గిర్‌తో జరిపిన ఇష్టాగోష్ఠి నుంచి కొన్ని అంశాలు:

1. శేషేంద్ర సాహిత్య జీవితం గురించి కొంచెం చెప్పండి?

"శేషేంద్ర సాహిత్య జీవితం గులబీల పాన్పు కాదు. ఆయన నడచిన బాటలో బాధల, కన్నీళ్ల ముళ్లున్నాయి. అట్టి చీకటి దారిని ఆయన ఆత్మవిశ్వాసం కూడగట్టుకుని దాటిన తర్వాత వేకువ వచ్చింది. ఈ నేపథ్యంలో కలలుకనే కవినుంచి సద్విమర్శకుడుగా కూడా ఆయన మారాడు, మహా కావ్యాలను విశ్లేషించి చూసాడు."

2. ఆయనలో మిమ్మల్ని ఆకర్షించిన అంశమేమిటి?

"ఆయన మెత్తని మనస్సు, సౌజన్యం, సంస్కారం. పైగా ఆయన బాగా చదువుకున్నవాడు. నా జీవిత భాగస్వామికి ఇవి చాలు. ఒక మహాకవి అని నేను ఇరవయారేండ్ల క్రితం ఆయనను పరిణయ మాడలేదు"

3. మీకు నచ్చిన శేషేంద్ర కవిత ఏది?

"నా దేశం - నా ప్రజలు "

4. మీకు తెలుగు సరిగ్గా రాదు కదా? తెలుగు కవితలోని సొగసును ఎలా ఆస్వాదిస్తారు?

"మొదట శేషేంద్ర తెలుగులో కవిత వ్రాసినా, దాన్ని ఇంగ్లీషులోకి తర్జుమా చేసి ఆయన తొలుత నాకు వినిపిస్తారు. తెలుగు ధారాళంగా నేను మాట్లాడలేకపోయినా విని అర్థం చేసుకోగలను. తెలుగులో ఎక్కువగా సంస్కృతం పదాలే దొర్లుతాయి కాబట్టి"

5. శేషేంద్రను ఇండియన్ ఆక్టోవియా పాజ్ గా అభివర్ణించవచ్చునా?

"ఆక్టోవియా పాజ్ కన్నా శేషేంద్ర గొప్ప కవి. శేషేంద్ర సంస్కృతం పునాదిగా పెరిగినవాడు. భారతీయ మహాకావ్యాలు ఆయనకు కంఠో పాఠం. ఆక్టోవియాపాజ్ భారతీయ తత్వాన్ని అర్థం చేసుకునే ప్రయత్నం చేసిన మహాకవి. కాని విదేశీయుడికి అది కష్టసాధ్యమైంది".

